

**కుటుంబ సభ్యులు :** కుమారులు కోడండ్రతో తుర్లపాటి దంపతులు

ఎడమ నుండి కుడికి : చి॥ సుధాకర్, తుర్లపాటి రాధాకృష్ణ, అన్నపూర్ణ, దుర్గా ప్రభాకర్, జ్యోతి
అనురాధ, శ్రీనివాసరావు

ఎడమ నుండి కుడికి : రాధాకృష్ణమూర్తి గారి సోదరుడు శేషగిరిరావు హైమవతీ దంపతుల కుమారుడు కార్తీక్,
రాధాకృష్ణమూర్తి గారి మనుమలు : ఓంకార్ సాయి నిరంజన్, ప్రశాంత్, యశస్వి కృష్ణశ్రీ,
మనీష్ సాయిరాం చరణ్.

ఓం శ్రీ సాయిరాం



# రంగస్థలి
## అనుభవాల తోరణాలు

రచన

తుర్లపాటి రాధాకృష్ణమూర్తి ఎం.ఏ.,

**మొదటి ముద్రణ : 2013**

**కాపీలు : 1000**

*ప్రతులకు :*

**తుర్లపాటి రాధాకృష్ణమూర్తి** ఎం.ఏ.,

రంగస్థలి, సినీ, టి.వి. ఆర్టిస్ట్

శ్రీరంగ శారదా సదన్, **5బి**

**2/3** బ్రాడీపేట, గుంటూరు **- 522 002**

ఫోన్ : **0863 - 2233785,** సెల్ : **9440250430**

వెల : రూ. **120/-**

ముద్రణ : డాన్‌బోస్కో ప్రింటింగ్ ప్రెస్, గుంటూరు - 7, ఫోన్ : 2350832

# విషయసూచిక

# ప్రేరణ

ఈ రచన కుపక్రమించటానికి కారణం నా ఆలోచన కాదు. నాకు ఆత్మీయ కళాబాంధవులైన నటసోదరులు, కళాశాలలోని నా సహాధ్యాపకులు, నా అభిమాన ధనమైన ప్రేక్షక మహాశయులు. **"మీ నాటకరంగ అనుభవాలకు అక్షరరూపమిస్తే, భావితరాలకుపయోగపడుతుందేమో ఆలోచించండి"** అన్న ఒక్కమాట నా వెన్నుతట్టినట్లయింది. నిజమే, అయిదు దశాబ్దాలుగా పాత్రధారణకే పరిమితమయిన నా ఆలోచనలలో ఏనాడూ ఈ ఊహ పొడమ లేదు.

పాండవోద్యోగ విజయాలలో **"దుర్యోధనుడు"**

సత్యహరిశ్చంద్రీయంలో **"విశ్వామిత్రుడు"**

గయోపాఖ్యానంలో **"గయుడు"**

వేంకటేశ్వర మాహాత్మ్యంలో **"భృగుమహర్షి"**

బొబ్బిలి యుద్ధంలో **"విజయ రామరాజు"**

కన్యకాపరమేశ్వరిలో **"విష్ణువర్ధనుడు"**

పల్నాటి యుద్ధంలో **"నరసింగరాజు"**

(సంస్కృత నాటకం) వరూధినిలో **"సిద్ధుడు"**

మహాకవి కాళిదాసులో "భోజరాజు"

(శ్రీవీరబ్రహ్మేంద్ర స్వామి వారి నాటకం) కాలవాహినిలో **"పాదుషా"**

సమ్రాట్ జయచంద్రలో రాజగురువు **"ప్రహరాజ శర్మ"**

క్రీస్తు జననంలో **"హేరోదు ప్రభువు"**

దావీదు విజయంలో **"గొలియాత్"**

పంజరంలో **"డాక్టర్"**

మొదలుగా ఎన్నో పాత్రలు వహించాను. వేల సంఖ్యలో ప్రదర్శనలిచ్చే అవకాశమూ కలిగింది. అలా ఎన్ని ప్రదర్శనలిస్తున్నా, అభినయంలో మెరుగులు దిద్దుకుంటూ,

"పొరలు పొరలుగా తప్పుకుంటూ
పురోగమించింది జిజ్ఞాస
ఎన్నెన్ని సత్యాలు ఆస్వాదిస్తున్నా
ఇంకా తీరని పిపాస."

అని డా॥ సి. నారాయణ రెడ్డిగారన్నట్లుగా ఇంకా ఇంకా ఏదో కొత్తదనం కోసం అన్వేషిస్తూనే ముందుకు సాగాను.

1992 సం॥లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు నిర్వహించిన పద్యనాటక పోటీలలో నేను సుయోధనపాత్ర ధరించి, దర్శకత్వ బాధ్యత వహించిన "పాండవోద్యోగం" ఉత్తమ ప్రదర్శనకు ఎంపికై, ప్రథమ బహుమతినందుకోవటం, నేను ఎందఱో పెద్దల చేతులమీదుగా ఘనమైన సత్కారాలు పొందటం జరిగింది.

కాని, రచనా వ్యాసంగం మీదికి మాత్రం నా మనసుపోలేదు. ఇదిగో, యిప్పటికి సుహృద్భావుకులయిన కళాభిమానుల నలహామేరకు నా రంగస్థలానుభవాలను ఒక్క పర్యాయం పర్యాలోకనంచేసుకుంటూ, అభినయాల ద్వారాలను అనుభవాల తోరణాలతో అలంకరించి వారి ముచ్చట తీర్చుదామనిపించింది.

ఏటి ఒడ్డు చలంలో తోడేకొద్దీ నీటి ఊట ఉబికినట్లుగా, తొలిచేకొద్దీ తలపులు ఊరకపోతాయా! అన్న భరోసాతో ఈ రచనకుద్యమించాను.

"The Older I grow, The more everything seems to me, to lie in manliness. This is my new gospel."

'అనుభవం పెరిగేకొద్దీ పురుషప్రయత్నంలోనే సర్వం ఇమిడి ఉన్నట్లనిపిస్తుంది. ఇదే నానూతన సందేశం.' అన్న వివేకానందుని సూక్తి నాకు స్ఫూర్తినిచ్చింది. "ప్రయత్నాత్ కర్తవ్యమ్" అన్న బుధజన వాక్యం నన్ను కార్యోన్ముఖుణ్ణి చేసింది. అంతే,

**గళం విప్పాను,**
**కలం పట్టాను.**



**అక్కినేనివారి 87వ జన్మదిన మహోత్సవంలో సత్కారం, రవీంద్రభారతి. అక్కినేని వారిచే, యువకళావాహిని ఆధ్వర్యంలో**



**ఎం.ఎస్. రెడ్డి (మల్లెమాల) గారితో నాటకం పై చర్చ. సభా నిర్వహణ : సమతా సూరిగారు, కృపారావుగారు, గుంటూరు.**





జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
**డాక్టర్ సి. నారాయణరెడ్డి** ఎక్స్ ఎం.పి.
ఎం.ఎ. పి.హెచ్.డి., డిలిట్,
అధ్యక్షులు
**ఆంధ్ర సారస్వత పరిషత్తు ట్రస్టు**
తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001
ఫోన్: (ఆ) 24753724

ఆసాప/అధ్యక్షులు/2013/515 తేది : 03-06-2013

## అభినందనలు

శ్రీ తుర్లపాటి రాధాకృష్ణమూర్తిగారు అగ్రేసరరంగస్థలకళాకారులు. ప్రత్యేకించి దుర్యోధనపాత్ర వారి నటనాప్రతిభకు పతాక సదృశమైంది.

రాధాకృష్ణమూర్తి గారు రచించిన "రంగస్థలి - అనుభవాల తోరణాలు" అనే ఈ గ్రంథం, తెలుగు పద్యనాటకరంగంలోని వివిధ కోణాలను విశ్లేషించి చూపింది. గుణదోషాలను బేరీజువేసి పాఠకుల ముందుంచింది. మచ్చుకు కొన్ని ఉదాహరణలు.

"జగదంబ" అనడానికి బదులు "జగదాంబ", "షష్టి" అనడానికి బదులు "షష్ఠి" అనడం. అదిగో ద్వారక... పద్యంలో "వరమందురాంతర" సమాసంలో 'మందుర'కు బదులుగా' 'మందిర' అనడం - ఇలా అసంఖ్యాక దోషాలను ఎత్తిచూపారు మూర్తిగారు.

**నాటకాభిమానులకే కాక సాహిత్యాభిమానులందరికీ "పాఠ్యగ్రంథం" ఇది. శ్రీ తుర్లపాటి రాధాకృష్ణమూర్తిగారి రచనాప్రతిభకు నా హార్దికాభినందనలు.**

*(డా॥ సి. నారాయణ రెడ్డి)*



**ఆచార్య ఎస్. గంగప్ప**

ఎం.ఎ. పి.హెచ్.డి.,

హంస అవార్డు గ్రహీత,

విశ్రాంతాచార్యులు,

**ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం**

## నటులకు పాఠ్య గ్రంథం

నట జీవితంలో రంగస్థల అనుభవాలకు 'రంగస్థలి – అనుభవాల తోరణాలు' పేర చక్కటి గ్రంథాన్ని ప్రకటిస్తున్నాడు నా ఆబాల్యమిత్రుడు **'నటశ్రీ'** తుర్లపాటి రాధాకృష్ణమూర్తి. ఇది నటులందరికీ ఒక పాఠ్యగ్రంథంలా ఉంది. సుమారు యాభై ఏళ్ల నటజీవితంలో – అందునా "సుయోధన ఫేం"గా ప్రసిద్ధిపొందిన నా మిత్రుడు విలువైన అంశాలను అందించాడు. మేమిద్దరం ఆంధ్ర విశ్వవిద్యాలయంలో 1957–60ల మధ్య తెలుగు సాహిత్యంలో బి.ఏ. (ఆనర్సు) సహపాఠులం.

సుమారు పదిపదిహేను నాటకాలలో ప్రముఖపాత్రధారి అయినప్పటికీ 'సుయోధన' వేషంలో అత్యంతాద్భుతంగా ప్రేక్షకలోకాన్ని మురిపించి ఆదరాభిమానాలు పొందడం మా రాధాకృష్ణ ప్రత్యేక విశిష్టత. ఎన్నో సన్మానాలు, సత్కారాలు పొందిన రాధాకృష్ణను అభినందించడం కాదు, 'ఇంతటి ప్రసిద్ధ నటుడు గదా!' అని గర్విస్తున్నాను. ఇంకా సర్వోన్నతమైన సన్మానం జరగాలని నా ఆకాంక్ష.

తొలితరం నాటకకర్తలు ధర్మవరం, కోలాచలంవారలు మొదలుకొని తదనంతరం బలిజేపల్లి, చిలకమర్తి, తిరుపతివేంకటకవుల పద్యనాటకాలు రంగస్థలిపై ఎంతో ప్రసిద్ధిపొందిన విషయం మనకు తెలుసు. అంతే కాదు, ఈనాటికీ తిరుపతివేంకటకవుల 'ఉద్యోగవిజయాలు' తెలుగు సీమలోనేగాదు, బయట కూడా ప్రదర్శనకు నోచుకొంటున్న విషయం తెలిసినదే. ఆ నాటకాల్లో పద్యాలు, పద్యపఠనంలో సంగీతం – అనే అంశాలపై అనేక చర్చలు జరిగాయి. దాన్ని సమన్వయిస్తూ పద్యపఠనంలో సంగీతమెంతవఱకు ఆవశ్యకమో చక్కగా వివరించారు తుర్లపాటి. ఇది చక్కటి సూచన. కారణం, పద్యంపాడడంలో కొందరు రంగస్థలాన్ని సంగీతకచేరీ చేస్తారు. అది సముచితం కాదని నా అభిప్రాయం.

కాగా, నటనలో ఆంగికం - వాచికం - సాత్వికం అనే అభినయాలలో నటులు ఎలా అభినయించాలో, అందులో ఆయానటుల ప్రతిభావిశేషాలను ఎలాజోడిస్తే నాటకాభినయం రంగస్థలంపై ఎలారక్తికట్టుతుందో సముచితరీతిని వివరించిన తీరు రాధాకృష్ణ అనుభవానికి ప్రతీకగా నిలుస్తుంది.

సందర్భోచిత సమయస్ఫూర్తితో ప్రతిభా ప్రకటనగావించిన తన అనుభవాలతో ప్రేక్షకులను అలరించడమేగాక తోటినటులను సైతం విస్మయపరచి అబ్బురపడేలా చేసిన సందర్భాలను వివరించి, అది ఎలా తనకు ప్రఖ్యాతిని తెచ్చిపెట్టిందో, సముచితంగా వివరించి తన విశిష్టతను నిరూపించుకొన్నతీరు నన్నెంతో ముగ్ధుణ్ణి చేసింది. అది రాధాకృష్ణ నటజీవితానికి ప్రత్యేకప్రతిపత్తిని తెచ్చిపెట్టింది.

అభినయ కళాభిజ్ఞులుగా అభివృద్ధిచెందటానికి ఎన్నో సూచనలు చేశారు. అనుకరణను గూర్చి తెలిపారు. రంగాలంకరణ నాటకప్రదర్శన విజయానికి ఎలా ఉపకరిస్తుందో వివరించారు.

కాగా, నటులు చేసే ఉచ్చారణ దోషాలు, పద్యపాదాల విరుపుల గూర్చి, తప్పుగా విరిచి చదవటంవల్ల కలిగే అనర్థాలను గూర్చి వివరించి, అధ్యాపకుడిగా వాటి సవరణలు అనేకం తెలిపారు.

తిరుపతి వేంకటకవుల ఉద్యోగవిజయాలు, గయోపాఖ్యానం మొదలైన నాటకాల్లో వాటిని ఉదాహరించి సోపపత్తికంగా వివరించిన తీరు నటులందరికీ చక్కని సూచన. చివరగా ఒక్క సూచన, నటప్రస్థానం అనే అంశాలతో రాధాకృష్ణ **తన అనుభవాలను అద్భుతంగా రంగస్థలానికి తోరణాలుకట్టి మనందరినీ ఆహ్వానిస్తున్నాడు.** అలాంటి నా ఆత్మీయమిత్రుని మరోసారి మనసార అభినందిస్తున్నాను. అస్తు. సుధర్మ.

(ఎస్. గంగప్ప)

తేది : 06-06-2013



'భ్రుకుంస రత్న'
**బుఱ్ఱా సుబ్రహ్మణ్యశాస్త్రి**
ఆం.ప్ర. ఎన్.టి.ఆర్. రంగస్థల పురస్కార గ్రహీత
హైదరాబాద్.

## అభివ్యాహారణము

శ్రీ తుర్లపాటి రాధాకృష్ణమూర్తిగారు "రంగస్థలి - అనుభవాల తోరణాలు" అనే గ్రంథాన్ని వ్రాసి ముందుమాట వ్రాయండని నాకు పంపినారు. సంతోషము.

ఇంచుమించు నేను నాటకములు వేయుట మొదలుపెట్టినప్పుడే వారునూ పాత్రధారణ చేయుట మొదలుపెట్టినారు. నేను విద్యాధరి పాత్రధరించిన 'మహాకవి కాళిదాసు' నాటకంలో మొట్టమొదట కవిరాక్షసుడి వేషంతో ప్రవేశించి ఆ పిమ్మట భోజరాజుపాత్ర ధరించారు. ఆ నాటకంతో నాకు పరిచయమైన తుర్లపాటివారు 'వరూధిని' అనే సంస్కృత నాటకంలో సిద్ధునిపాత్రతో సన్నిహితులయ్యారు. 'ఆ నాటకమున నేను వరూధిని పాత్ర ధరించాను. అది మొదలు అనేక నాటకములలో వారును, నేనును కలిసి రంగస్థలమున వ్యవహరించుట జరిగినది.

వారు విశ్వామిత్రునిగా, నేను చంద్రమతిగా 'సత్యహరిశ్చంద్రీయ' నాటకము, వారు గయునిగ, నేను అక్రూరుడు, నారదునిగా 'గయోపాఖ్యానము', వారు దుర్యోధనునిగా, నేను ద్రౌపదిగా 'కురుక్షేత్రం' నాటకములందలి పాత్రలను అనేక ప్రదర్శనములలో నిర్వహించినాము.

ఏ నాటకమునందు ఏ పాత్ర ధరించినను వారి వాచికాభినయము వైవిధ్యముగనుండును. వారు చతుర్విధాభినయములను కూలంకషముగ అధ్యయనమొనర్చిన చక్కని నటులు. ఒక్కొక అభినయమును గురించి ఈ గ్రంథమునందు చక్కగా వివరించుట జరిగినది. వాచికాభినయమును గూర్చి, అది కవిచే నటునకు ఈయబడినది కావున విస్తృతముగా ఈ గ్రంథమున

తెలియజేయుట ప్రశంసనీయము. మిగిలిన ఆంగిక సాత్త్విక ఆహార్యాభినయములు అంత విస్తృతములు కాకున్నను పాఠకులకు ఉపయుక్తములుగనే వ్రాయబడినవి.

వారు, వారు ధరించిన పాత్రములుగల నాటకములనే ఉట్టంకించిరి. మిగిలిన నాటకములలో నేటికిని విస్తృతముగ ప్రదర్శింపబడు సాంఘిక, సమస్యాయుక్తమైన నాటకములను కూడ చేర్చిన బాగుండెడిదేమో!

ఏది యేమైనను, **నేటి తరము వారికి ఈ గ్రంథము పఠనయోగ్యమైనది. తెలిసికొనవలసిన విషయములు అనేకములు ఇందు పొందుపఱుపబడినవి. చాల సంతోషము. ఇంతవఱకు పద్యనాటకమును గూర్చి యిట్టి గ్రంథము వెలువడియుండలేదనుట సత్యము, స్పష్టము.**

శ్రీ తుర్లపాటివారు, వారి అనుభవతోరణములేకాక ఇట్టి గ్రంథములనెన్నిటినో వెలయించిన బాగుగనుండునని నా అభిప్రాయము.

మంగళమ్ మహత్.

తేది :02-07-2013

హైదరాబాదు

**బుఱ్ఱా సుబ్రహ్మణ్య శాస్త్రి**



స్త్రీ పాత్రలో
శ్రీ శాస్త్రి గారు



'కళాతపస్వి', 'నటశేఖర'

**జి.యస్.యన్. శాస్త్రి**

ఆం.ప్ర. ఎన్.టి.ఆర్. రంగస్థల పురస్కార గ్రహీత

హైదరాబాద్.

## సాత్త్వికమ్ - శివమ్

ఆప్తమిత్రులు శ్రీ తుర్లపాటి రాధాకృష్ణమూర్తి నటవిరాట్, పండితప్రకాండుడు. అతడొక రోజు దుర్యోధనుడు, ఒక రోజు గయాఖ్యగంధర్వుడు, మరొక రోజు విశ్వామిత్రుడు, వేరొక రోజు భృగుమహర్షి - ఇలా అనేక అవతారముల నెత్తగలడు. ఆయా అవతారములకు ఉచితమైన ఆహార్యము, దానిని మించిన భావన, దానిని వ్యక్తము చేయు శబ్దము - ఈ మూడును తుర్లపాటిలో ఇల్లుకట్టుకొనినవి. భావశబలతకు ఇతడు పెట్టిన పేరు.

ఏ పాత్రధరించినా, ఆ పాత్ర శ్రీతుర్లపాటికి 'సలాము' చేసి తీరుతుంది. తుర్లపాటి ధరించిన ప్రతిపాత్ర నేను నేనని ఇతనిని వరించినవి. ఇన్ని పాత్రలు ధరించి, ఇంతటి ప్రఖ్యాతివహించుటకు కారణం ఇతని వ్యక్తిత్వం. ఇతడు సత్త్వగుణ ప్రధానుడు.

అందువలననే సాత్త్వికాభినయము ఈతనికి స్వాధీనమయినది. తుర్లపాటితో నా పరిచయం 1962లో మా సమాజంలో 'కాళిదాసు' నాటకంలో నేను 'కాళిదాసు', తుర్లపాటి 'భోజరాజు' పాత్రలు ధరించినప్పటి నుండి. ఆ తరువాత 'పాండవోద్యోగము' 'వరూధిని' నాటకములు కలిసి ప్రదర్శనలిచ్చాము.

గత 50 సంవత్సరముల నుండి అతని **'నటవిశ్వరూపాన్ని'** చూస్తున్నాను.

ఇక అసలు విషయం.

శ్రీ తుర్లపాటి రచించిన 'రంగస్థలి - అనుభవాల తోరణాలు' పరిశీలించాను. ఈ గ్రంథంలో అభినయానికి సంబంధించిన అన్ని అంశాలను స్థూలంగా వివరించటం జరిగింది.

'వర్ధమాననటులకే కాదు, పేరుప్రఖ్యాతులు గడించి, నాటకరంగాన్ని యేలుతున్న నటనామధేయులకు సైతం ఈగ్రంథం **'కరదీపిక'**.

కొందఱు నటులలోని వాచికదోషాలను, పద్యపఠనంలోని విరామదోషాలను, అందువల్ల వస్తున్న అనర్థాలను ఉటంకిస్తూ సరియైన విరామస్థానాలను నిలువగీట్లతో సూచించారు.

పదాలు, వాటి అర్థాలు, కొన్నిపదాల ఉచ్చారణలోని తప్పొప్పులను పట్టిక రూపంలో ఇవ్వడం జరిగింది. నటులు ఈ పట్టిక ఆధారంతో తమ వాచికదోషాలను సరిచేసికొనవచ్చును.

'సమయస్ఫూర్తి' అనే అంశంలో శ్రీ తుర్లపాటి తాను నటించిన నాటకములలో సహనటుల ప్రశ్నలకు (కవి వ్రాయనవి) తాను సముచిత సమాధానములిచ్చి ప్రేక్షకుల ప్రశంసలనందుకొనిన సందర్భాలను వ్రాసారు. ఈ అంశము చదివిన పిమ్మట.

"నటుడు కవిని మ్రింగుటలో రాహువు" అనిన బ్ర॥ వే॥ వేలూరి శివావధానులు గారి మాట స్ఫురణకు వచ్చినది. సమయస్ఫూర్తిలో శ్రీ తుర్లపాటి రాధ (అనగా మెఱపు) లా వ్యవహరించిన తీరు సముచితము, సమయోచితము.

ఒక్క మాటలో చెప్పవలెనన్న ఈ గ్రంథం నటులకు ఓ బాలశిక్ష, ఓ కరదీపిక.

జి.యస్.యన్. శాస్త్రి



కవి సమ్మేళనం
కరుణశ్రీ, శ్రీకృష్ణ భగవానులు, అనంతరామయ్యగారు, తుర్లపాటి, హిందూకాలేజి, గుంటూరు



**కె.యస్.టి. శాయి**
నందీ పురస్కార గ్రహీత,
యన్.టి.ఆర్. రంగస్థల పురస్కార గ్రహీత
బాపట్ల.

## "అక్షరాభినందనలు"

"కావ్యేషు నాటకమ్ రమ్యమ్" అని ప్రవచించిన ఆర్యుల పలుకులను యధార్థం చేసిన ఘనత నిస్సందేహంగా పద్యనాటకానికే దక్కుతుంది. తరాలవారీగా ఎందరో నటప్రవీణులు మంచిస్థాయి గల ప్రదర్శనలిచ్చి, నాటక ప్రక్రియకు, తెలుగునాట గొప్ప గౌరవ ప్రతిష్ఠలార్జించి పెట్టారు - తెలుగు నాటకరంగం యీనాటికి బ్రతికి వుండటానికి తొలినాళ్ళలో ఆ నటఘనాపాఠీలు వేసిన బీజమే కారణం.

నాటక రంగాన్ని తమతమ నటనాచాతుర్యంతో సుసంపన్నం చేసిన మేటి నటుల వరుసలో శ్రీ తుర్లపాటి రాధాకృష్ణమూర్తిగారిది ప్రత్యేక స్థానం. అటు పూర్వతరం నటులకు, నేటితరానికి మధ్య నిలిచిన వారధిలాంటివారు వీరు. సనాతన నటులలో ఆధునికుడు - ఆధునికులలో పౌరాణికుడు - రంగం మీద పాతకొత్త నటనారీతులను సమాన ప్రతిభతో ఆవిష్కరించగల నటసిద్ధులు.

రారాజుగా రంగంమీద ఠీవిని ప్రదర్శించి, విజయరామరాజుగా కనిపించి, నరసింగరాజుగా క్రూర స్వభావరీతులను ప్రదర్శించి ప్రేక్షకుల మెప్పు, ప్రశంసలను పొందిన మేటి నేటి మహానటులు. రకరకాల చిత్తప్రవృత్తులు గల భూమికలను విభిన్న శైలిలో అభినయించి, ఆంధ్రుల అభిమాననటులైనారు - ఆంగికం, ఆహార్యం, వాచిక సాత్వికాభినయాలు ప్రదర్శించటంలో వీరిబాణి ప్రత్యేకమైంది.

రంగం మీద అతిక్రూరస్వభావంగల పాత్రలు అలవోకగా నటించి మెప్పించగల వీరు, నిజ జీవితంలో సాత్త్వికులు - స్నేహశీలి. అభిమానించటమేగాని,

ద్వేషించటం, దూషించటం ఎరుగని అజాతశత్రువు. అంచేతనే సాటినటులకు, ప్రజలకు అభిమాన పాత్రులైనారు.

"నిన్నలేనిది నేడు లేదు, నేడు లేకపోతే రేపురాదు" ఇది వాడుకలోనున్న నానుడి - కనుక గతించిన కాలం, వైభవం, నటీనటుల నటనా వైశిష్ట్యం, నాటక రంగ స్థితిగతులు తెలిసికొని, వర్తమానులు తమకు అందిన గతకాలపు సాహిత్య సంపదలను భవిష్యత్తరాలకు అందించటం మంచి సంప్రదాయం. రంగస్థలాన్ని దశాబ్దాలపాటు ఏలిన పూర్వనటులు, ఎవరో ఒకరిద్దరు తప్ప, మిగతావారు తమతమ అనుభవాలను అక్షరబద్ధంచేయకపోవటం పెద్దలోటుగానే మిగిలిపోయింది. "రంగస్థలి - అనుభవాల తోరణాలు" పుస్తకానికి రూపం యిచ్చి ఆ లోటును కొంత వరకు పూడ్చటానికి ప్రయత్నించారు తుర్లపాటి వారు.

"నాట్యశాస్త్రం", "అభినయదర్పణం"వంటి పెద్ద పెద్ద గ్రంథాలు చదివే అవకాశం, అర్థంచేసుకునే భాషాసంపద కరువైన వారికి, యీ "రంగస్థలి - అనుభవాలతోరణాలు" కరదీపికగా సహాయపడ్తుంది - **పెద్ద పెద్ద నాట్యశాస్త్రాలలో ఉన్నసారాన్ని యీ పుస్తకంలో ఇమిడ్చి నటలోకానికి ఎంతోమేలు చేశారు తుర్లపాటి.**

ఇందులో రంగానికి సంబంధించిన అన్నికోణాలు తడివిచూచారు. తమ సుదీర్ఘ - అనుభవం ఆధారంగా, నాటక లక్షణాలు, చతుర్విధాభినయాలు, ఉచ్చారణ - భాషాదోషాలు, మున్నగు అంశాలను సోదాహరణంగా వివరించారు. ప్రసిద్ధమైన పాండవోద్యోగవిజయములు, గయోపాఖ్యానం, సత్యహరిశ్చంద్ర నాటకాలలో పద్యాలను ఉదహరించి క్లిష్టపదాలు, అవి ఉచ్చరించవలసిన విధానం, పదాలకు అర్థాలు - తప్పొప్పులను వివరించటం చూస్తే, యిది అనుభవజ్ఞుడైన ఆచార్యులవారు నటవిద్యార్థులకు బోధచేస్తునట్లనిపిస్తుంది.

**ఈ గ్రంథం వర్ధమాన, ప్రవర్ధమాన నాటకాభిలాషులకు దిశానిర్దేశం చేసే దిక్సూచి. నటగీతామృతం, కరదీపిక.** నాటకం అనే వాచక పుస్తకానికి

సోదాహరణలతోకూడిన గైడ్ యిది. నటులేకాదు, నాటకాభిలాషులు, తెలుగు భాషాభిమానులు తప్పక చదవవలసిన **నట పెద్దబాలశిక్ష.**

ఇంతటి విలువైన మంచిపుస్తకం రచించి, శ్రీ తుర్లపాటివారు, తన గళమేకాదు కలం కూడా శక్తివంతమైనదే అని నిరూపించారు.

నటలోకపు ప్రశంసలు ఈ పుస్తకానికి తప్పక లభించగలవని నమ్ముతూ, ఈ అక్షరఅభినందనచందనాలను సగౌరవంగా సమర్పిస్తున్నాను.

భవదీయ

విజయలక్ష్మీపురం
బాపట్ల

కె. యస్. టి. శాయి
**(కొంపల్లి శేషతల్ప శాయి)**



**వరయూరి రామానుజ సూరిగారి "పల్నాటి యుద్ధం"లో నరసింగరాజు 'నటశేఖర' తుర్లపాటి, నాయకురాలు 'నటనా ప్రవీణ' రేబాల రమణ**





*కళాభారతి (యు.యస్.ఎ)*
**మూడు పర్యాయములు ఉత్తమనటుడు**
*నంది అవార్డుల గ్రహీత*
*"కళారత్న" (హంస అవార్డుగ్రహీత)*
**గుమ్మడి గోపాలకృష్ణ**
హైదరాబాద్ -45
చరవాణి : 9848043079

"రంగమార్తాండ" గౌరవనీయ

శ్రీ తుర్లపాటి రాధాకృష్ణ గారూ!

మీ "రంగస్థలి - అనుభవాల తోరణాలు" పుస్తకం పూర్తిగా చదివాను, చాలా సంతోషించాను. ఒక అధ్యాపకుడు, అధ్యయనశీలి నటుడయితే నాటకరంగానికి ఎంత మేలుజరుగుతుందో మీ పుస్తకం ద్వారా అర్థమవుతుంది. పద్యనాటకరంగ చరిత్రలో మీ స్థానాన్ని నటుడిగా స్థిరపరచుకొన్నారు. ధన్యజీవులయ్యారు.

నిరంతరం రంగస్థలంమీద ప్రదర్శనలు చేసిన మీకు ఎందరో పండితనటులు, కాని నటులతో నటించవలసి వచ్చిన సన్నివేశాలలో జరిగిన సంఘటనలు, దొర్లిన అపశబ్దాలు, అపభ్రంశాలు విని, చూచి సహించి, మీవంతు కర్తవ్యంగా నాటక రంగానికి యీ గ్రంథాన్ని కానుకగా సమర్పించారేమో అనిపించింది. కాదు. ఇది సత్యం.

తెలిసో, తెలియకో చేసిన తప్పులను, వాచాదోషాలను సవరించుకోకపోతే, అసలు శబ్దం ఎలా పలకాలో తెలుసుకొనకపోతే, ఎంత పెద్దనటుడయినా, పండితుల ప్రశంసలు పొందలేడు. పండిత, పామర ప్రశంసలు పొందినవాడే నిజమైన నటుడు.

ఎవరు ఎలాపోతే మనకెందుకులే అనుకునే యీ రోజుల్లో, ఎదుటివాడి తప్పుల్ని ఎత్తిచూపి అవహేళనచేయకుండా, మీవంతు కర్తవ్యంగా పద్యనాటక

రంగానికి సంబంధించిన అనుభవాలు, అనుభూతులతోపాటు, రాబోయే తరానికి, కాబోయే నటీనటులకు **"శబ్దోచ్చారణ మార్గదర్శిని"**గా ఈ గ్రంథాన్ని అందించి కళామతల్లి కీర్తికిరీటంలో మణిపూస అయ్యారు. నేను శ్రీకృష్ణ పాత్రలో, మీరు దుర్యోధనపాత్రలో కలిసి ఎన్నోప్రదర్శనలు చేసినందుకు నేను ఎంతో ఆనందిస్తున్నాను. భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యసాయిబాబావారి దివ్యసన్నిధిలోని ప్రదర్శన మరపురాని మధురానుభూతి.

భగవాన్ ఆశీస్సులతో మీ శేషజీవితాన్ని ఈలాంటి మంచిగ్రంథాల రచనతో సాగించాలని, మీకు ఆయురారోగ్య ఐశ్వర్యాలను ఆ నటరాజు అనుగ్రహించాలని మనస్ఫూర్తిగా కోరుకుంటూ,

భవదీయుడు

(గుమ్మడి గోపాలకృష్ణ)



**"తుర్లపాటి" నటబింబాలు**



*21 నందీ పురస్కార విజేత*
**డా॥ మీగడ రామలింగ స్వామి**
స్వర్ణ కిరీట గ్రహీత
చరవాణి : 9420189229

## అనుభవాలతో రణాలు

నట జీవితానుభవాలతో రణాలు చేసి చేసి, అనుభవపూర్ణులై, పూజ్య నటాగ్రేసర అనుభవపూర్ణులై, పూర్ణదైవానుగ్రహపూర్ణులై తుర్లపాటి అందించిన 'అనుభవాల తోరణాలు' ఆమూలాగ్రంగా చదివాను. మహదానంద పడ్డాను. ఇది స్తవం కాదు. వాస్తవం.

నాటి ప్రదర్శనలు చూచిన ప్రేక్షకుల స్పందన నుండి, 'నట ప్రస్థానం - నాడు, నేడు' వరకు చూస్తే, తుర్లపాటి, ప్రతి అంశంలోనూ తన అనుభవాలను కళ్ళకు కట్టినట్టుగా రూపొందించారు. ఇన్నేళ్ల సుదీర్ఘమైన తన నటనానుభవాన్ని, అందులో దొర్లిన తప్పు ఒప్పులను చెప్పడం, భావితరాలవారికి ఎంతో ఉపయోగకరంగా ఉంది. అంతేకాదు. వారుఎక్కడికీ వెళ్లక్కర లేకుండా అనేక విషయాలు ఈ పుస్తకం ద్వారానే తెలుసుకునే వీలుంది.

రాధాకృష్ణమూర్తి గారు 'దుర్యోధనులు'గా ఎంత సుప్రసిద్ధులో మృదుమనస్వి, వచస్విగా అంత యశస్వులు. కాబట్టి చెప్పదలచుకున్న అంశాన్ని సున్నితంగా, సంఘటనల పూర్వకంగా చదువరులకు అందించడంలో కృతకృత్యులయ్యారు. అది నాకు చాలా బాగా నచ్చింది.

మన పద్యవైశిష్ట్యం, పద్యనాటకానికి సంగీతం ఎంత వరకు కావాలో, ఇక చతుర్వాధాభినయాల గూర్చి, నటునికి కావలసిన సమయస్ఫూర్తి, మంచి నటునిగా ఎదగాల్సిన నటునికి ఉండాల్సిన లక్షణాలు, దర్శకుడు, అనుకరణ మొదలగు అంశాలు విపులంగా, సోదాహరణంగా చెప్పిన తీరు చాలా బాగుంది.

ఇక చాలామంది నటులు సర్వసాధారణంగా చేస్తున్న తప్పులు సుదీర్ఘంగా చెప్పారు. ఇది చాలా అవసరం.

పద్యనాటకం అంటే సంగీతం, సాహిత్యం, నటన. ఈ మూటిని అధ్యయనం చేయాలి. అలా చేయగలిగిన వారే దీనిని గురించి చెప్పాలి. తుర్లపాటివారు ఇందులో కృతశ్రములు, జితశ్రములు.

వీటన్నింటికంటే చివర ఉన్న వారి **నటజీవనప్రస్థానం**, ఈ పుస్తకానికి మరింత శోభనిచ్చింది. నటజీవనాన్ని ఎక్కడ ప్రారంభించారు? ఎలా వర్ధిష్ణులయ్యారు? ఎన్ని ఆటుపోట్లను అధిగమించారు? ఎన్ని సత్కారాలు పొందారు? ఎలా ఇంత స్థాయికి రాగలిగారు? అన్ని విషయాలు ప్రతినటసోదరుడు తెలుసుకోవాలి. దాన్ని స్ఫూర్తిగా తీసుకోవాలి.

అంతా బాగానే ఉంది... పుస్తకాలు చదవడం అవాలటులేని చాలామంది నటసోదరులకు ఇది ఎంత వరకు ఉపయోగపడుతుందనేది ఆ నటరాజే తేల్చాలి. ఏది ఏమైనా... 80వ పడిలోఉన్న

ఆత్మీయ సోదరులు మంచి ప్రయత్నం చేశారు. చదవని వాళ్ళను ప్రస్తావించడం కంటే, చదివిన వాళ్లు, లబ్ధిపొందుతారని, వాళ్లు పదిమందికి ఈ విషయం చేరవేస్తారని ఆశిద్దాం.

(మీ రామలింగ స్వామి)







**యస్. ముక్తేశ్వరరావు**
ఐ.ఏ.యస్.
కలెక్టరు మరియు జిల్లా మెజిస్ట్రేట్
నల్లగొండ
చరవాణి : 08682 - 232940

## శివమస్తు నట జగతాం

'రంగస్థలి–అనుభవాల తోరణాలు' అనే ఈ పుస్తకం ముందుమాట రాయటం నా అదృష్టంగా భావిస్తున్నాను. ఎందుకంటే దీన్ని రాసిన శ్రీ తుర్లపాటి రాధాకృష్ణమూర్తి స్వయానా నాకు అన్నయ్యే కావటం కాకుండా చాలా విషయాల్లో నాకొక మంచి ప్రేరణ, స్ఫూర్తి. పౌరాణిక నాటక రంగంలో రారాజుగా వెలుగొందినటువంటి ఒక గొప్ప వ్యక్తి. గత ఐదుదశాబ్దాల కాలంగా కొన్నివేల ప్రదర్శనల్లో ఆంధ్రదేశం అంతటా రారాజంటే, మకుటంలేని మహారాజంటే ఆయన అన్నట్లుగా వెలుగొందిన సంగతి ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నటువంటి ప్రేక్షకలోకం అంతటికీ తెలుసు.

ముఖ్యంగా ఆయన వాచికాభినయంలో ఒక కొత్త ఒరవడిని సశాస్త్రీయమైనటువంటి పోకడను కూడా సృష్టించినటువంటి సంగతి మనందరికీ తెలుసు. ఒక పదాన్ని స్పష్టంగా ఉచ్చరించటంతో పాటు దాంట్లో ఉన్నటువంటి భావాన్ని, స్ఫూర్తినీ, రసానుభూతినీ చెక్కు చెదరకుండా మళ్ళీ మళ్ళీ వినాలనిపించే లాగా సంభాషణల్ని పలకడం నేను ఎన్నోసార్లు విన్నాను.

ఈ పుస్తకం రేఖామాత్రంగా ఆయన ఆత్మకథలాగా కనిపించినా, స్వరూపంలో మాత్రం ఒక మంచి శాస్త్రీయగ్రంథం లాగా అభినయానికి ఒక చిన్న కొండగుర్తులాగా కనపడుతోంది. కొండను కొండగుర్తు అని ఎందుకు అంటామంటే, అన్నీ మారినా కొండ అక్కడే ఉంటుంది కాబట్టి. దీని ఆధారంగా రాబోయే నటులు నేర్చుకోవలసిన, నేర్చుకొనే పాఠాలు అనేకం దీనిలో కనపడతాయి.

ఇదే కాకుండా కాలగర్భంలో కలిసిపోయేటటువంటి అనేక గొప్ప అంశాల్ని దీనిలో శాశ్వతంగా నిలబెట్టినట్లు కనబడుతుంది. ఉదాహరణకి మన ఆంధ్రప్రదేశ్

లో కళారంగానికి మేకప్ కళాకారుడుగా అంజిబాబుగారు అనే ఆయన ఉండేవారు. ఆయన ఆతర్వాతకాలంలో పూనేఫిల్మ్ఇన్స్టిట్యూట్‌కి వెళ్ళటం, మేకప్ కళలో ముఖ్యంగా ఆహార్యంకళలో అక్కడ ఆయన జాతీయప్రమాణాలు తీసుకురావటం మన అందరికి తెలుసు. ఆయనకు సంబంధించిన ఒక సంఘటన చాలామందికి తెలిసినటువంటిది ఇందులో పేర్కొన్నారు.

ఒక పరిషత్తులో ఆయన చాలా చక్కగా మేకప్ చేసినటువంటి "ఆంజనేయుడి పాత్రధారికి బహుమతి ఎందుకు ఇవ్వలేదు?" అంటే ఆంజనేయుడికి పచ్చరంగు లేదనీ, ఆంజనేయుడికి పచ్చరంగు ఉండాలా, అక్కర్లేదా అన్న దానిమీద ఒక చర్చవచ్చినప్పుడు స్వయంగా ఒకకళాకారుడిగా ఆయన చొరవచేసికొని "అతులిత స్వర్ణ శైలాభ దేహం" అనే శ్లోకాన్ని చెప్పి ఆంజనేయుడి యొక్క స్వరూపం ఎలా ఉంటుందన్నటువంటి ఆ శ్లోకాన్ని ఆయన పేర్కొని దాని ద్వారా ఆంజనేయుని యొక్క రూపురేఖల్ని మన కళ్ళకు కట్టినట్లుగా తెలియజేసారు.

అలాగే స్థానం నరసింహారావుగారు గొప్ప స్టార్ వాల్యూ ఉన్నటువంటి ఒక గొప్ప నటుడు. ఆయనగురించిన కథలు, ఉపకథలు రాష్ట్రమంతా కూడా ప్రచారంలో ఉన్నాయి. ఆయన చేసినటువంటి రెండు మూడు సన్నివేశాలు ఒక తొట్రుబాటు లేదా పొరపాటుకులోనైనప్పుడు స్థానంవారు యుక్తియుక్తంగా ఎలా దానిని నిభాయించి రసభంగం కాకుండా నిర్వహించారో ఇందులో మనం చూడవచ్చు. ఇలాంటి సంఘటనలు యాధృచ్ఛికంగా కాలగర్భంలో కలిసిపోవలసినవి నిలబడటానికి కారణం ఇలాంటి చొరవ ఇంతకు ముందు చేయకపోవటం అని నేను భావిస్తున్నాను.

ఇంకొక అంశం ఏమిటంటే నాటకంలో బాగా కొండవీటి చాంతాడంత రాగాలు తీయాలా? లేకపోతే రాగం భావయుక్తంగా పాడితే సరిపోతుందా? అన్నది చాలాకాలంగా ఉన్నటువంటి ఒక తెగని సమస్య. దాన్ని, రెండింటిని సమన్వయ పరుస్తూ ఈ పుస్తకంలో చేసినటువంటి ప్రయత్నం చాలాగొప్ప ప్రయత్నంగా నాకు అనిపిస్తుంది. ఎందుకంటే సందర్భాన్ని బట్టి, పాత్రని బట్టి అవసరమైతే రాగం నిడివి ఉండవచ్చంటారు. ఉదాహరణకి సరస్వతి పాత్ర, నారదుని పాత్ర. వారు సంగీత విద్వాంసులు కూడా కాబట్టి వాళ్ళకు ఎక్కువ ఉన్నా పర్వాలేదు. అదే ఒక

రారాజైన దుర్యోధనునికి అంత రాగం ఉండాల్సిన అవసరం లేదు. ఆయన సంగీత విద్వాంసుడు కాదు బేసిక్‌గా. ఆ రకంగా సమన్వయం చేసుకుంటూ సందర్భాన్ని, సన్నివేశాన్ని బట్టి ఎంత ఉండాలి అనేదాన్ని సమన్వయం చేయడం కూడా ఇందులో చాలా బాగున్నది.

అలాగే ఇంకొక అంశం ఏమిటంటే చాలా స్పష్టంగా, చాలా సంక్షిప్తంగా అయినాసరే అద్భుతంగా జరిగినటువంటి చర్చ ఏమిటంటే, ఆంగిక, వాచిక, సాత్త్వికాభినయాలలో దేనిస్థానం ఎంత? అంటే దేనికి ఎంత స్థానం. ఆంగికానికి ఉండవలసిన స్థానం ఎంత? వాచికానికి ఉండవలసిన స్థానం ఎంత? అలాగే సాత్త్వికాభినయానికి ఉండవలసిన స్థానం ఎంత? అన్నదాన్ని ఈ పుస్తకంలో అపురూపంగా మూల్యాంకనం చేయడం జరిగింది. ఇది కూడా భావితరాలకి ఒక టెక్స్ట్ బుక్‌గా ఉపయోగపడే అంశంగా భావిస్తాను.

అన్నింటికన్నా కూడా ముఖ్యంగా వేషధారి, పాత్రధారి ఈ రెండింటికీ మధ్య ఒక చర్చని ఇందులో ప్రవేశపెట్టారు. ఆ చర్చయొక్క సారాంశం ఏమిటంటే! "నువ్వు కృష్ణుడి వేషం వేసుకొని కృష్ణుడిలాగా కనపడటం, గాండీవం పుచ్చుకొని అర్జునుడిలాగా కనపడటం మాత్రమే కాదు. పాత్రయొక్క మానసిక పరిస్థితి, పాత్రయొక్క వైఖరి, జీవితాదర్శం, పాత్రకు ఆసమయంలో, ఆసన్నివేశంలో ఉన్నటువంటి సంఘర్షణ - అన్నింటిని కలుపుకుంటేనే పాత్రధారివి కాగలవు. అవి లేకపోతే ఒట్టి వేషధారివే అవుతావు" అని. మనకి ఎక్కువ సందర్భాలలో నాటకాల్లో వేషధారులు ఎక్కువగా ఉంటారు.

ఈ పుస్తకంలో విచిత్రంగా చర్చలో ఉందేమిటంటే నాటకాల మీద 'నాటకాలు వేయుబాక నాముందు! పిచ్చివేషాలు వేయుక!' అనేటివి ఎందుకొచ్చాయని ఒక చర్చ, ఒక లైటర్ వీన్‌లో జరిగిన చర్చ ఉంది. దానికి కారణం ఏమిటంటే, వేషం వేసినంతమాత్రాన ఆ పాత్రలోకి వెళ్ళకపోతే అందులో రసానుభూతిని ప్రేక్షకుడు పొందలేడు, పొందటానికి కావలసిన రసాయనిక ప్రక్రియని గురించి చర్చిస్తూ, వేషధారి, పాత్రధారి అనేటటువంటి అధ్యాయంలో చర్చించటం జరిగింది.

ఈ రకంగా పుస్తకం మొత్తం కూడా ఒక షడ్రసోపేతమైనటువంటి భోజనం. దీన్ని మనం అందరం ఆస్వాదిద్దాం.

ఇది భావితరాలకి అపూర్వంగా కళ్ళకద్దుకొని, ఇంట్లో భద్రపరచుకొని చదువుకోవలసిన పుస్తకంగా, ముఖ్యంగా యువతరానికి సిఫారసు చేయదగిన పుస్తకంగా నేను భావిస్తున్నాను.

అయిదుపదుల రంగస్థలానుభవపరిపాకంలో ఆణిముత్యంలాంటి పుస్తకం అందిస్తున్న అన్నయ్యకు జయహో! అన్నయ్య చేసిన ఇంతటి కళాప్రస్థానానికి నేపథ్యసంగీతం వదిన. పేరుకు మాత్రమే కాదు - పేర్కొనదగిన ఆదరణ పంచే అన్నయ్య నోరార పిలిచే 'అన్నపూర్ణ'మ్మకు,

ఇద్దరికీ రెండుచేతులెత్తి నమస్కరిస్తూ...

(నందివెలుగు ముక్తేశ్వరరావు)



**ఆప్తసోదరుడు శ్రీ ముక్తేశ్వరరావు శ్రీమతి హేమా దంపతుల కుమారుడు చిరంజీవి కార్తికేయకు దుర్యోధనపాత్ర శిక్షణనిచ్చిన సందర్భంగా సత్కార సంరంభం బృందావన గార్డెన్స్, వేంకటేశ్వరస్వామి కోవెల ప్రాంగణంలో సి. హెచ్. మస్తానయ్య గారు, తుర్లపాటి దంపతులు, కార్తికేయ, గుంటుపల్లి ఆంజనేయులు చౌదరి, శ్రీమతి హేమ**



# హార్దికాభివందనములు

అక్షరరూపం దాల్చిన నా అనుభవపరంపరకు విజ్ఞులైన సాహితీవేత్తల అభినందనలు వింతశోభ చేకూర్చాయి. నాట్యకళాభిజ్ఞుల ఆలోచనలు అమృతాన్ని వర్షించాయి. ఆనందంతో నా కన్నుల వెన్నెలలు వెల్లివిరిసాయి.

అడిగినదే తడవుగ "రంగస్థలి – అనుభవాలతోరణాలు" అవలోకించి తమతమ అమూల్యమైన అభిప్రాయాల నందించిన "జ్ఞానపీఠ" అవార్డు గ్రహీతలు డాక్టర్. సి. నారాయణరెడ్డి గారు, ఆప్తమిత్రులు, హంస అవార్డు గ్రహీతలు ఆచార్య ఎస్. గంగప్ప గారు, 'భ్రుకుంస రత్న', యన్.టి.ఆర్. రంగస్థల పురస్కార గ్రహీతలు బుఱ్ఱా సుబ్రహ్మణ్య శాస్త్రి గారు, 'కళాతపస్వి', 'నటశేఖర', యన్.టి.ఆర్. రంగస్థల పురస్కార గ్రహీతలు జి.యస్.యన్. శాస్త్రిగారు, 'నాటక బ్రహ్మ', 'నవరస నాట్యకళానిధి' యన్.టి.ఆర్. రంగస్థల పురస్కార గ్రహీతలు కె.ఎస్.టి. శాయిగారు, 'కళారత్న' హంస అవార్డు గ్రహీతలు గుమ్మడి గోపాలకృష్ణగారు, నందీ విజేతలు డాక్టర్ మీగడ రామలింగస్వామిగారు, ఆప్తసోదరులు యన్. ముక్తేశ్వరరావు, ఐ.ఎ.ఎస్. నల్లగొండ జిల్లా కలెక్టర్ మరియు మెజిస్ట్రేట్ – అందఱకూ నా కృతజ్ఞతాపూర్వక హార్దిక అభివందనములు.

డాన్‌బోస్కో వారిని పరిచయంచేసి ఇంతకుమున్ను "సచ్చిదానందమయమూర్తి" శతకాన్ని పూర్తిచేయించి, వెంటనే "రంగస్థలి – అనుభవాల తోరణాల"కు నాంది పలికించి పూర్తయ్యేంత వఱకు ఎంతో అంకితభావంతో అండదండలుగ నిలిచిన మిత్రశ్రీ నరాలశెట్టి రవికుమార్ (నంది నాటకోత్సవములలో బ్రహ్మానాయుడు ఉత్తమ నటుడు బహుమతి గ్రహీత) గారికి, ఏ మాత్రం విలంబనం చేయకుండా నా లేఖినికి పని కల్పించి చురుకుగా నడిపించిన మా సహకర్ణపాత్రధారి, గుంటుపల్లి ఆంజనేయులు చౌదరి గారికి, ఎంతో నేర్పుతో, ఓర్పుతో ఈ గ్రంథాన్ని ముచ్చటగా ముద్రించి యిచ్చిన డాన్‌బోస్కో ముద్రణాలయం సిబ్బందికి నా అభిమాన పురస్సర అభివందనచందనాలు.

భవదీయుడు **'తుర్లపాటి'**



తల్లిదండ్రులు
శ్రీమతి వెంకటసుబ్బమ్మ,
కోటేశ్వరరావు దంపతులు



మేనత్త దంపతులు
శ్రీమతి కంఠంరాజు తులిసెమ్మ, వెంకట
సుబ్బయ్య గారు, బాల్యంలో "తుర్లపాటి"

*"కన్నవారిని, ప్రేముడి గన్నవారి*
*భక్తిదైవార మనమున, ప్రస్తుతించి*
*అంజలించెద నీ పుష్ప మంకితముగ*
*మొలకనవ్వులు మోమున తొలకరింప."*

\- తుర్లపాటి



"ప్రేమ ప్రోత్సాహమిడిన మా మామగారు"
(నాగలింగం సుబ్బారావు గారు)



నాటి తుర్లపాటి

# విఘ్నేశ్వర స్తుతి

"శుక్లాంబరధరం । విష్ణుం । శశివర్ణం । చతుర్భుజం ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ । సర్వవిఘ్నోప శాంతయే."

అగజాననపద్మార్కం । గజాననం । అహర్నిశం
అనేకదం । తం । భక్తానాం । ఏకదంతముపాస్మహే."

# నటరాజ స్తుతి

"ఆంగికం భువనం యస్య । వాచికం సర్వవాఙ్మయమ్।
ఆహార్యం చంద్రతారాది । తం వందే సాత్త్వికం శివమ్.॥

# ప్రార్థన

"పరబ్రహ్మ పరమేశ్వర । పురుషోత్తమ సదానంద । ॥2॥
పరంజ్యోతి పరాత్పర । పతితపావన స్వప్రకాశ । ॥2॥
వరదాయక । సకలలోక వాంఛిత సుఖదాప్రమేయ । ॥2॥
పాహి పాహి మాంపాహి
పాహి పాహి మాంపాహి
పరబ్రహ్మ పరమేశ్వర । పురుషోత్తమ సదానంద" ॥2॥

రచన : చేందవోలు కేశవదాసు

"భావాల నేత్రాల ప్రకటించు రీతుల
సాకల్యముగ నేర్పు శాస్త్రమెద్ది
అంగవిక్షేపాల ఔచిత్యమును దెల్పి
సంతసమ్మొదవించు శాస్త్రమెద్ది
సత్యధర్మమ్ముల నిత్యత్వమును దెల్పు
సద్రూపకాధార శాస్త్రమెద్ది
జగతి సంక్షోభాల సతమతమౌ ప్రజ
సమ్మోదమొనరించు శాస్త్రమెద్ది

అట్టి నాట్యశాస్త్రమ్మిటులందజేసి
మహిత మార్గమ్ము జూపిన మాన్య చరిత!
భరతమునివర్య! నీకిదె ప్రాంజలింతు
అలరజేయుమ యెల్లర నాదృతమున"

– 'తుర్లపాటి'



**హితులు, సన్నిహితులు అయిన నటమిత్రులు**
**గుంటుపల్లి ఆంజనేయులు చౌదరి, నరాలశెట్టి రవికుమార్ గార్లతో 'తుర్లపాటి'**

# నాటి నాటక ప్రదర్శనలు - ప్రజల ఆదరాభిమానాలు

నా చిన్నతనంలో నేను హైస్కూలులో చదువుకొనే రోజుల్లో (1950 ప్రాంతంలో) ఎన్ని నాటక ప్రదర్శనలో! ప్రతి పండుగను కొన్ని రోజులపాటు ఉత్సవంగా జరిపేవాళ్లు.

గణపతి నవరాత్రులు, దేవీ నవరాత్రులు, సంక్రాంతి, శివరాత్రి, సుబ్రహ్మణ్య షష్ఠి, శ్రీరామనవమి, గ్రామ దేవతల జాతరలు మొదలుగా గల ఉత్సవ సందర్భాలలో నాటక ప్రదర్శనలు తప్పక జరిగేవి. ప్రజలు తండోపతండాలుగా బండ్లుకట్టుకొని మరీ వచ్చేవాళ్లు. స్టేజికి మూడువైపులా జనం కిటకిటలాడుతూ ఉండేవాళ్లు.

ఆ ప్రదర్శనలకు పంటచేలల్లోని కాలిబాటల్లో, కటికి చీకటిలో పురుగూపుట్రా ఉంటాయని కూడా లెక్క చేయకుండా, పరుగులాంటి నడకతో, ఎంతో ఉబలాటంతో వెళ్లేవాళ్లం. అలసట వచ్చేది, చెమటలు పట్టేవి, బట్టలు తడిసిపోయేవి. ఏమయితేనేం, అక్కడకు చేరి ఆ స్టేజి, ఆ లైటింగ్, ఆ రంగురంగుల కర్టెన్స్ చూచేటప్పటికి, వాటితోపాటు, ఆ హార్మోనియం నాదం వినపడేటప్పటికి, ఆ పద్యాలు చెవిని బడేటప్పటికి, "ఇంకో పదినిమిషాల్లో నాటకం ప్రారంభం కాబోతుంది" అని మైక్‌లో ఎనౌన్స్‌మెంట్ వినేటప్పటికి, మేమంత దూరం నుంచి నడిచి వచ్చిన కష్టమంతా మటుమాయమైపోయేది. చూడండి, మనకిష్టమయిన పని ఎంత కష్టమయినా, కష్టమనిపించదన్న మాట, ఎంత నిజమో!

ఇక అక్కడ 'పరబ్రహ్మ పరమేశ్వర, పురుషోత్తమ, సదానంద' అనే ప్రార్థనా గీతం, మొదలయ్యేంత వఱకు, జరగబోయే ప్రదర్శనను (నాటకాన్ని) గుఱించి, ఆనాటి నటీనటులను గుఱించి ప్రేక్షకులు ఎంతో ఉత్సాహంతో చెప్పుకొనే మాటల రణగొణ ధ్వని అంతా యింతా అని చెప్పలేం.

ప్రార్థనాగీతం పాడి, దేవతలకు జేజేలు కొట్టిన తరువాత తెరతొలగించి పాత్ర ప్రవేశించేటప్పటికి హఠాత్తుగా వాతావరణం పూర్తిగా మారిపోయేది. అంతా

నిశ్శబ్దం. అంత వఱకూ ఎడతెగకుండా మాటాడుకుంటున్న మిత్రులు, ఒకళ్లతో ఒకళ్లకు ఏమీ సంబంధం లేనట్లుగా కూర్చుని, రంగస్థలం వేపే గుడ్లప్పగించి చూస్తూ, చెవులు రిక్కించి వినటం చూస్తే ఎంత వింతగా ఉండేదో! ఇక నాటకమయేంత వఱకు ఆ దృశ్యాలు చూస్తూ, ఆయా పాత్రల మాటలు, పాటలు వింటూ, ఆ కథాంశంలోకి తలదూర్చి యీ లోకాన్నే మఱచిపోయేవారంటే అతిశయోక్తి కాదు. నాటకమయిపోయింతరువాత మళ్లీ మనలోకంలోకి వచ్చేవాళ్లు. ఇక అందఱూ కలిసి యింటిముఖం పట్టేవాళ్లు. ఇవి ఆనాటి ఉత్సవ నాటక విశేషాలు.

అలాగే అప్పుడప్పుడు పట్టణాలలో, నాలుగు గ్రామాలకు కూడలిగా ఉండే కాస్త పెద్ద గ్రామాల్లో ఒరుపుగా ఉండే జనవరి నుంచి దాదాపు మే వఱకు టికెట్ నాటకాలు వేయించేవారు. నెల రోజులముందే గోడలమీద పెద్ద పేపర్లు అంటించే వాళ్లు. నాటక ప్రదర్శనకు 15 రోజులముందునుంచే జట్కాబండి మీద మైక్‌లో ఎనౌన్స్‌చేస్తూ కరపత్రాలు పంచుతూ పబ్లిసిటీ యిచ్చేవాళ్లు. నాటకం రోజు ఎప్పుడొస్తుందా అని చిన్నా, పెద్ద అందఱూ ఎదురుచూస్తుండే వాళ్లు. ఇక, నాటకం రోజున ఎంత కోలాహలమో! అందఱకు టిక్కెట్లు అందటం కూడా కష్టమయేది. దీనిని బట్టి ఆ రోజుల్లో నాటక ప్రదర్శనలంటే ఎంత ఆదరణ ఉండేదో ఒక్కసారి ఊహించండి.

ఇంకా చెప్పనా!

నటీనటులు కారు దిగొస్తుంటే, దేవతలే దిగివచ్చినంత వింతగా ఎగబడి చూచేవాళ్లు, చుట్టూ మూగి ముందుకు కదలనిచ్చే వాళ్లు కాదు.

**అదీ ఆనాటి నాటక వైభవం.**



# లోకవ్యవహారంలో వేషం - నాటకం

వేషం, నాటకం అనే పదాలు మనకు లోకవ్యవహారంలోనూ వినబడుతూనే ఉంటై. అయితే ఎలాంటి సందర్భాల్లో ఏ అర్థాన్ని వెలువరించటానికి ఉపయోగిస్తారు? అనే అంశాన్ని పరిశీలించుదాం.

ఈ రెండు పదాలను నేను మొట్టమొదట ఎక్కడ విన్నానో తెలుసా? చిన్నప్పుడు ఎలిమెంటరీ స్కూలులో మా మాస్టరు గారంటే విన్నా. నా ప్రక్కన కూర్చునే సత్యం ఏదో అబద్ధం చెబుతున్నాడని మాస్టరుగారి కనుమానం వచ్చింది. అంతే, బెత్తం ఝుళిపిస్తూ "రేయ్ నా దగ్గర వేషాలెయ్యకు. నిజం చెప్పు. నాటకాలాడావో నడ్డివిరుగుతుంది" అన్నారు. సత్యం అబద్ధాలాడుతున్నాడని మాస్టరుగారలా అన్నారు.

అంటే, వేషాలెయ్యటమన్నా, నాటకాలాడటమన్నా అబద్ధమాడటమన్నమాట. మాకు అప్పటికి తెలిసిందంతే, ఇప్పుడు కాస్త నాటక పరిజ్ఞానం ఏర్పడిన తరువాత ఆలోచిస్తే ఆ మాటల్లో ఎంత అర్థముందో తెలుస్తుంది.

వేషమంటే నటుడు తనకు సహజం కాని యింకొకరివలె తయారు కావటమన్నమాట. తాను ధరించనున్న పాత్రకు సంబంధించిన వేషం వేసుకోవటం. ఆ పాత్రకెలాటి ఆభరణాలుండాలో అవి అలంకరించుకోవటం, పాత్రకు తగిన వస్త్రధారణ చేయటం, ఆ పాత్రకు సంబంధించిన మాటలే మాట్లాడటం, ఆ మాటలలోని అర్థానికనుకూలంగా కరచాలనాదులు చేయటం, ఆ పాత్ర మనసులోని ఆనందాన్నో, కోపాన్నో ముఖకవళికలలో చూపటం - ఇవన్నీ అభినయం క్రిందికే వస్తాయి. వీటినే భరతముని నాట్యశాస్త్రంలో చతుర్విధాభినయాలుగా పేర్కొని ఎంతో విపులీకరించి చూపారు.

1. ఆహార్యాభినయం
2. ఆంగికాభినయం

3. వాచికాభినయం

4. సాత్త్వికాభినయం

ఈ క్రమంలో భరతులవారు చెప్పారు

"వయోఽనురూపః ప్రథమస్తు వేషః
వేషాను రూపేణ గతి ప్రచారః
గతి ప్రచారానుగతం చ పాఠ్యం
పాఠ్యానురూపోఽ భినయశ్చ కార్యః."

వయసుకు తగినట్లు వేషం, వేషానికి తగిన విధంగా ఆంగికం, ఆంగికానికి తగినట్లుగా వాచికం, వాచికానికి తగినట్లుగా సాత్త్వికం ఉండాలి అని పై శ్లోకం స్పష్టీకరిస్తుంది.

ఈ చతుర్విదాభినయాలు ఏకోన్ముఖంగా స్పందించినపుడే అభినయం అర్ధవంతమౌతుంది.

అంటే వేషము, చెప్పేమాట, చేసేచేత, చూపే భావం అన్నీ కలిసి ఆ పాత్రకు, ఆ పాత్ర ద్వారా సన్నివేశానికి జీవం పోయాలి.

ప్రతి నటుడూ, పాత్రధారియై రంగస్థలాన ప్రవేశించినపుడు తనకు సహజమైన మనఃస్థితిని అదుపులో ఉంచుకొని (తాను మఱుగై) పాత్ర తత్వాన్ని తనకు ఆపాదించుకొని ఆ పాత్రనే రంగస్థలాన చూపగలిగిన నాడు తన పాత్రకు న్యాయం చేయగలుగుతాడు. నాటకాన్ని రక్తి కట్టించటంలో, ప్రదర్శనను విజయవంతం చేయటంలో తనవంతు కృషి తానుచేసివాడౌతాడు.

ఇది ఒక సమష్టి కృషి. శాస్త్రబద్ధంగా, ప్రజాభిమానాన్ని చూరగొనే విధంగా ప్రదర్శనకనువైన ప్రణాళిక నేర్పఱచుకొని, పాత్రధారులనందఱిని కూడగట్టుకొని తన ప్రణాళిక ప్రకారం అభ్యాసం (రిహార్సల్స్) చేయించి ఎంతో నేర్పుగా ప్రదర్శనను విజయపథంలో నడిపించే బాధ్యత దర్శకునిదే!

నటసిద్ధి పాత్ర సారూప్యతను పొందుట వలన నేర్పడదు. పాత్రమే కావలెనని అభిప్రాయపడిన వారును లేకపోలేదు. కాని అట్టి అవస్థనే నటుడు పొందినట్లయిన ప్రమాదములు తటస్థించే అవకాశము లేకపోలేదు.

అట్టి స్థితియందే నృసింహపాత్రధారి హిరణ్యకశిప పాత్రధారి వక్షస్థలిని చీల్చివేయటం జరిగిందని పెద్దలు చెపుతారు.

కనుక పాత్రధారి తానే ఆ పాత్రయన్న భ్రమను కలిగించాలే కాని తానే పాత్రయైపోరాదు అన్న అభిప్రాయం సమంజసమనునది నిర్వివాదాంశం.

తనను తాను మఱచి పాత్రలో లీనమై ప్రవర్తించటం జరిగితే తన పాత్ర పరిధులను విస్మరించటం, తన పాత్ర పాఠాన్ని మఱచిపోవటంలాంటి ప్రమాదాలు జరిగే అవకాశమూ లేకపోలేదు.

"ఉత్తమ నటుడు దుఃఖించుచున్నట్లు నటించుచు ప్రేక్షకులను ఏడ్పించును. అదియే నటన. లౌకికార్థమున నటన అనగా లేనిది ఉన్నట్లు నటించుటయే కదా."

**- పింగళి లక్ష్మీకాంతం**

"నటుడు స్మృతితో కూడిన ఒకానొక విస్మృతి ననుభవించాలి. ఇందుకు అమోఘమైన జ్ఞాపకశక్తి అవసరం."

**- స్థానం**

పై యిరువురి అభిప్రాయాలూ నటుడు తాను నటుడనన్న స్మృతిని కోల్పోవరాదనెడి అభిప్రాయాన్నే స్పష్టీకరిస్తున్నాయి గదా!



# పద్యాలంటే, పాటలంటే, నాటకాలంటే ఎందుకో అంత యిష్టం!

నిజమే, పల్లెటూరివారయినా, పట్టణాల్లో ఉండే వారయినా, పిన్నలయినా పెద్దలయినా, చదువుకున్నవారయినా, చదువుకోనివారయినా, రైతులయినా, ఉద్యోగస్థులయినా, ఎలాటి వృత్తులవారయినా సరే పద్యాలంటే, పాటలంటే, నాటకాలంటే ఎంత యిష్టపడతారో! ఆ పూట పనైనా మానుకుంటారేమోకాని పద్యం వినకుండా వెళ్లగలరా! పాట వినకుండా అడుగుముందుకు వేయగలరా! అలాటి పద్యాలతో, పాటలతో నిండి ఉన్న నాటకాన్ని చూడకుండా ఎలా ఉండగలరో చెప్పండి!

ఇక్కడ నా చిన్ననాటి సంఘటనొకటి చెప్పి తీరాలి.

నేను హైస్కూలు నుంచి యింటికి వచ్చి హాయిగా స్నానం చేసి మా చెఱువుగట్టువేపు వెళ్లేవాణ్ణి. ఆ గట్టు నానుకొనే మా దేవాలయాలమండపాలు. అక్కడ చెఱువు నీటి అలల మీదినుంచి వచ్చే చల్లటి గాలికి అటూయిటూ పచార్లుచేసి కాసేపు మండపంలో కూర్చోవటం రోజూ అలవాటు.

అది సాయంవేళ. రైతులు పొలాన ఉన్న కోడెలకు ఉలవగుగ్గిళ్లు తీసికెళ్లే సమయం. వాళ్లు గుగ్గిళ్ల బుట్టలుపట్టుకొని వెళుతూ, నేను కనబడితే చాలు ఆగి "క్రిష్ణమూర్తీ! బాబ్బాబు రెండు పద్యాలు పాడవయ్యా, దోసెడు గుగ్గిళ్లు పెడతాం" అనే వాళ్లు. నిజం చెప్పొద్దూ! మనింట్లో చేసే పిండి వంటలకంటే నాకాగుగ్గిళ్లంటే మహాయిష్టం. ఇక పద్యాలు పాడకుండా ఎలా ఉంటాను! పాడేవాణ్ణి. వాళ్లు నేను తిన్నన్ని గుగ్గిళ్లు పెట్టి ఎంతో సంతోషంగా వెళ్లేవాళ్లు. చూడండి. ఎంతో తొందర తొందరగా వెళుతూ కూడా నన్ను చూడగానే ప్రాణం లేచొచ్చినట్లుగా ఆగి, పద్యాలు పాడించుకొని మరీ వెళ్లేవాళ్లంటే వాళ్లకి పద్యాలంటే ఎంత యిష్టమో తెలియటం లేదూ! అలాంటి వారు పద్యనాటకమంటే ఎంత యిష్టపడతారో వేరే చెప్పాలా!

మరో విశేషం!

మనకు సహజంగానే భగవద్భక్తి యెక్కువ. ప్రొద్దున్నే మన పనులమీద మనం వెళుతూ గూడా మధ్యలో దేవాలయం కనబడితే అటొక నమస్కారం చేసి మరీ వెళతాం. అలాంటి వాళ్లం శ్రీరామచంద్రుడు, శ్రీకృష్ణ పరమాత్మ, వారివారి కథలు నాటక రూపంలో చూపిస్తుంటే వెళ్లకుండా ఎలానండీ ఉండటం!

అయితే, సంగీతమంటే అంత చెవికోసుకొనే వాళ్లే అయినా నాటకంలో కథను సాగనీయకుండా రాగం ప్రస్తారం చేస్తున్నప్పుడు "ఏమండీ, కాస్త కథసాగనివ్వండి" అని హెచ్చరించిన సందర్భాలూ ఉన్నై. కనుక 'నాటకం - సంగీతం' అనే శీర్షిక క్రింద ఎప్పుడు పాడవచ్చు, ఎప్పుడు సంగీతాన్ని పరిమితంగా అనాలి అనే విషయాన్ని గూర్చి చర్చించుకుందాం. ముందుగా మన పద్య వైశిష్ట్యాన్ని గూర్చి ముచ్చటించుకుందామా!



మంత్రివర్యులు సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డిగారు, జక్కా వెంకయ్య యం.యల్.ఏ. గార్లచే "తుర్లపాటి"కి, శ్రీకృష్ణ పాత్రధారి ఎ. వెంకటేశ్వరరావుగారికి సత్కారం, టౌన్‌హాలు నెల్లూరు

# మన పద్య వైశిష్ట్యం

హృద్యమైన పద్యాలలో భారతేతిహాసాన్ని నిర్మల గంగా ప్రవాహంలా సాగిపోయే లలిత మనోహరమైనశైలిలో అందించిన ఆదికవి నన్నయభట్టారకులాదిగా, కమనీయ పద్యకావ్యస్రష్టలయిన కవివతంసులెల్లరూ మనకు చిరస్మరణీయులే. తెలుగు పలుకులతల్లికి పద్యకావ్యాలు తులలేని సువర్ణహారాలు.

చదివిన కొద్దీ చవులూరించి, మన హృదయాలను రంజింపజేయగలిగిన, గణయతిప్రాసాన్వితమైన యీ పద్యం, మన తెలుగువారికి మాత్రమే సొంతం కావటం మన అదృష్టం. అలాంటి రమ్యమైన పద్యం, శ్రవ్య కావ్యాలకే పరిమితం కాక, నాటకాలలో సైతం ప్రవేశించి పరవశింపజేయటం, మన భాగ్య విశేషం కాక మఱేమిటి!

ఇక పద్యాన్ని పఠించటంలో వలసిన మెలకువలను గుఱించి విశ్లేషించుకుందాం.

పద్యం ఛందోబద్ధమైన రచన. పదాలు వచనంలో మాదిరిగా కాక కొంచెం వెనుకముందులవుతుంటాయి. కనుక అన్వయదోషం కలుగకుండా, ఎక్కడెక్కడ విరామమిచ్చుకుంటూ ముందుకు సాగాలో, తెలిసికొని పఠించవలసి ఉంటుంది. ఏయే పదాలను ఏయే స్థాయిలలో వినిపిస్తే, అందలి భావం ప్రేక్షక హృదయాలలో హత్తుకుంటుందో, గమనించి పలుకవలసి ఉంటుంది.

మన నాటకాలలో సామాన్యంగా చంపకమాల, ఉత్పలమాల, శార్దూల విక్రీడితం, మత్తేభం విరివిగా కనుపించే వృత్తాలు. అలాగే కందం, సీసం, తేటగీతి, ఆటవెలది, ద్విపద తరచుగా వినిపించే జాతులు.

మన పద్యాలలోని యతి ప్రాసలను గురించి వివరిస్తూ, **"విశ్వవాఙ్మయ జగత్తులో తెలుగు పద్యసౌష్ఠవం సాటిలేనట్టిది. తెలుగు కవితా**

**సామగానానికి యతిప్రాసలు మృదంగనిస్వనాలు చేకూర్చగలవు."** అన్న శ్రీ నండూరి రామకృష్ణమాచార్యులవారి మాట మేలి రతనాల మూట :

భావానికి తగిన చందాన ఛందాన్ని కూర్చుకుంటే,

ఆయా సందర్భాల ననుసరించి పద్యం,

గంభీర గమనం చేయగలదు

లలిత లలితంగా పయనించనూగలదు

సెలయేటి జాలులా ప్రవహించగలదు

జలధిలా ఉప్పొంగి పొంగులు వారనూగలదు

సముచిత రీతిని సంగీతాన్ని సంధానం చేసి పద్యాన్ని పఠిస్తూ నటిస్తే

సభ్యహృదయాలు సంభ్రమాశ్చర్యాలతో సమాహితం కాకుండా ఎలా ఉండగలవు!

ఆనందం అవధులు దాటి విహరించకుండా ఎలా ఉండగలదు!

**మరొక్క నిజం చెప్పుకోవాలి :**

అనునిత్యం మనపద్యం సామాన్యప్రజానీకం నాలుకలపై సైతం లాస్యం చేస్తూండటానికి, వాడవాడలా విజయవిహారం సలిపే నాటకప్రదర్శనలే ప్రబలమైన కారణమంటే అది ఏమాత్రం అత్యుక్తి కాదు గదా!







# పద్యనాటకం - సంగీతం

మన పద్య నాటకం పండిత పామరజనరంజకమై జనబాహుళ్యంలో అనూహ్యమైన ఆదరణపొందటానికి, ఆపాతమధురమైన సంగీతం ఎంతగానో దోహదపడినదనటం సత్యదూరం కాదు.

అటు పద్యనాటకమే అయినా, ఇటు గద్య నాటకమే అయినా నాటకాన్ని రక్తి కట్టించటానికి సన్నివేశానుగుణంగా, సందర్భానుసారంగా నేపథ్య సంగీత సహకారాన్ని అందుకుంటూనే ఉన్నాం. రసానుభూతిని కలిగించటంలో సంగీతమెంత సహకరిస్తుందో గ్రహించే, ప్రార్థనా గీతంతో మొదలయి, మంగళ గీతం పాడేంత వఅకు ఏతత్సహకారాన్ని పొందుతూనే ఉన్నాం.

ఇక పద్యనాటక ప్రదర్శనలో రంగస్థలం మీది పాత్రలు పాటలు, పద్యాలు పాడుతున్నప్పుడు వాద్యసహకారం తప్పనిసరి. అయితే పద్యాన్ని రాగయుక్తంగా పాడటంలో భిన్నాభిప్రాయాలున్నవి.

1. ఛందోబద్ధమైన పద్యానికి, తాళలయాన్వితమైన పాటకు, స్వరాంచితమైన సంగీతాన్ని సమ్మేళనం చేసి విస్తరించి పాడటం వలన ప్రేక్షకుల హృదయాలు ఆనందతన్మయత్వాన్ని పొందుతాయి. కనుక, పద్యాంతంలో రాగప్రస్తారం విస్తారంగా చేయవచ్చును అని కొందఱి వాదం.

2. పద్యంలోని భావాన్ని ప్రేక్షకుల హృదయాలకు హత్తుకొనేలా అభివ్యక్తం చేయటానికి, ఎంత వఱకు ఆవశ్యకమో, అంతవఱకే పరిమితంగానే సంగీతాన్ని సమకూర్చుకోవాలిగాని విస్తరించి రాగప్రస్తారం చేయరాదు అని మరికొందఱివాదం.

అయితే, ఈ రెండువాదాలను ఒకవిధంగా సమన్వయం చేయవచ్చు.

రంగస్థలిపై కొన్నిపాత్రలు తమ సంభాషణల ద్వారా సన్నివేశాన్ని రసవత్తరంగా నడుపుతున్నప్పుడు, మధ్యలో పద్యరూపంలో ఉన్న సంభాషణను, భావానుగుణమైన

రీతిలో పరిమితంగా సంగీతాన్ని జోడించి వినిపిస్తేనే సముచితంగా ఉంటుంది.

పప్పుకు ఉప్పులాగా, వంటకు మంటలాగా, చీరెకు అంచులాగా సంగీతాన్ని పద్యానికి జోడిస్తే సంభాషణ సజావుగా సాగుతుంది, శ్రావ్యంగానూ ఉంటుంది.

పప్పుకు ఉప్పు ఎక్కువైతే తినలేము, ఉప్పులేకుంటే చప్పగా ఉంటుంది. వంటకు మంట చాలకపోతే ననుబాయి పడుతుంది, ఎక్కువైతే మాడిపోతుంది. చీరెకు అంచుకూడా అంచున ఉంటేనే చూడముచ్చటగా ఉంటుంది. పద్యానికి సంగీతం కూడా అంతే. అదీ పరిమితి అంటే.

అలాకాక అలాంటి సందర్భాల్లో కూడా విస్తరించిపాడటం మొదలిడితే, తక్కిన పాత్రధారులు ఎక్కడివారక్కడ చేష్టలుడిగి ఉండవలసి వస్తుంది. మఱి, అది నాటకీయతకు భంగమే కదా!

అయితే, ఒకే పాత్ర రంగస్థలాన నిలిచి, తన బాధలను భగవంతునికి విన్నవించి, కాపాడుమని అర్థిస్తూ పద్యరూపంలోగాని, పాట రూపంలోగాని వేడుకుంటున్న సందర్భమయినప్పుడు, ఆవేదనతో విస్తరించి గానం చేయటం రసౌచితికి దోహదమే అవుతుంది కాని, నాటకౌచితికి భంగకారి కానేరదు.

అలాగే భక్తిపారవశ్యంతో సంగీత సమర్చనం గావించుకుంటూ నారద తుంబుర అక్రూరాది పాత్రలు ప్రవేశించి కొంతతడవు గానం చేయటం ఆనంద దాయకమే అవుతుంది కాని ప్రదర్శనకు అంతరాయం కలిగించదు.

కనుక సందర్భాన్ననుసరించి మెలకువతో సంగీతాన్ని తగిన విధంగా జోడించుకోవాలన్నదే సారాంశం. మఱోవిశేషం, పాత్రధారులు పాత్రోచితమైన రీతిలో గంభీరంగానో, మృదువుగానో వినిపింపగలిగిన శ్రావ్యమైన, మధురమైన కంఠస్వరం కలిగి ఉండటం ముఖ్యం. వచనమే అయినా పద్యమే అయినా కంఠస్వరం బాగోలేకపోతే వినలేము గదా!

**పాత్రశుద్ధిలేని పాకం లాటిదే**
**గాత్ర శుద్ధిలేని గానం కూడా!**

"శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగాన రసం ఫణిః"

శిశువులను, పశువులను, విషసర్పాలను సైతం మైమఱపింప జేయగలిగిన సంగీత సహకారం, నాటకాన్ని రమ్యంగా, హృద్యంగా కొనసాగించటానికి ఎంతైనా దోహదకారి అవుతుందనటం నిర్వివాదాంశం.

అయితే పద్యాలను రాగయుక్తంగా పఠించేటప్పుడు పాటించవలసిన ఒకముఖ్యాంశం.

"పాత్రధారి ఏ శ్రుతిలో పద్యపఠనం చేస్తే అన్ని స్థాయిలలో తన గళధ్వని నిండుగా వినసొంపుగా ఉంటుందో గమనించి శ్రుతి నిర్ణయిం చేసుకోవాలి.

శ్రుతి తక్కువయినా, ఎక్కువయినా స్వరస్థానాలలో నాదాన్ని శ్రావ్యంగా పలికించటం తృప్తికరమైన రీతిలో ఉండదు" అన్న "ఆంధ్ర బాల గంధర్వ" శ్రీ షణ్ముఖి ఆంజనేయరాజుగారి అభిప్రాయం అనుభవైకవేద్యం, ఆచరణ యోగ్యం.

శ్రుతి విషయం వచ్చింది గనుక కాస్త విస్తరించి మాటాడుకుందాం. "శ్రుతిలేని పాట మతిలేని మాట" అనే నానుడి మనం లోకంలో వింటూనే ఉంటాం. అంటే మతిలేని వాడిమాట ఎంత నిరర్థకమో, శ్రుతిలేని పాట కూడా అంతే అని భావం.

కనుక పద్యపఠనాసక్తుడైన నటుడు తన కంఠస్వరాన్ని శ్రుతిపక్వంగా తీర్చిదిద్దుకోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. తాను ఏయే స్థాయిలలో నాదాన్ని ఏ పరిమితిలో పూరిస్తే, శ్రుతి విలీనమై శ్రవణపేయంగా ఉంటుందో గమనించి, నిరంతరమైన అభ్యాసం చేయాలి. "అనగననగ రాగమతిశయిల్లుచునుండు" అన్నట్లుగా పాడే కొద్దీ క్రమక్రమంగా స్వరం విప్పారుతుంది. గళం అనర్గళంగా పాడగలిగిన స్థాయిని అందుకుంటుంది. మధురిమలు సరిగమలతో సయ్యాటలాడతాయి.

నటుడు శ్రుతిపక్వంగా పాడేందుకు నాదాన్ని పూరించటంలో శ్రద్ధతీసుకున్న విధంగానే, వాద్యకారుడు కూడా ఆ నటగాయకుని కంఠస్వరానికి తగిన విధంగా వాద్యసహకారాన్నందిస్తేనే యీ ధ్యేయం సఫలమౌతుంది.

**పద్యంలోని భావానికి తగిన విధంగా, కమనీయమైన సంగీతాన్ని నేర్పుగా కూర్చుకోగలిగితే పసిడికి తావి అబ్బినట్లే.**

సి.యస్.ఆర్.గారి పద్యపఠనాన్ని గూర్చి ప్రస్తావిస్తూ ఏడిద కామేశ్వరరావు గారు వెలువరించిన అభిప్రాయం చూడండి.

"ఆంధ్ర నాటకరంగానికి పద్యాలు అనేవి పసిడిపూవులుగా రాణించాయి. భారతదేశంలో ఏ యితర ప్రాంతీయ రంగభూమికి లేని అలంకారం, ఈ పద్యాలవల్ల ఆంధ్ర నాటకరంగానికి సమకూరి వన్నె తెచ్చింది. అట్టి పసిడి పద్యాలకు సువాసన కూడా అలది సి.యస్.ఆర్ గారు రసజ్ఞులను అలరించారు. పద్యాలకు రాగాలను ఎన్నుకోవటంలో, ఆ పద్యాలను రకరకాలుగా విరిచి చదవటంలో ఆయనదొక ప్రత్యేకత. ఆయన మహానటుడు, గాయకుడు."

"యథా వర్ణా దృతే చిత్రే శోభతే ననివేశనమ్
ఏవ మేనం వినాగానం నాట్యం రాగం న గచ్ఛతి."

**- నాట్యశాస్త్రము**

వర్ణ సంయోగం లేనిదే చిత్రం శోభాయుతంకానట్లే
గానంలేనిదే నాట్యం రక్తి కట్టదు.

"గానస్వరాలతో గాలి పులకరించింది" అన్న రవీంద్రుని భావన రమ్యాతి రమ్యం కదూ!

మఱొక్క విశేషం.

పద్యనాటక కళారంగంలో సుప్రసిద్ధులయిన నటులెందఱో ఉన్నారు. పద్యానికి సంగీతాన్ని మేళవించుకోవటంలో ఎవరి ప్రత్యేకత వారిదే, ఎవరి బాణీ వారిదే. ఇందులో ఎవరి పోహణింపు బాగుంటుందంటే ఎలా చెప్పటం! వారందఱూ ప్రఖ్యాతినందిన వారే, నాట్యకళోద్యాన స్వైరవిహారులే, వారిబాణీ ప్రేక్షకులకు నచ్చకుంటే అంతటి ఖ్యాతి ఎలా వచ్చింది?

వేల ప్రదర్శనలు ఎలాయివ్వగలిగారు!

మన పూదోటలో ఎన్నిరకాల పూలో! నందివర్ధనాలు, ముద్దమందారాలు, కాశీరత్నాలు, పారిజాతాలు, సన్నజాజులు, సురపొన్నలు, సిరిమల్లెలు, చేమంతులు, పూబంతులు ఇలా ఎన్నో! వీటిలో మీకేవి యిష్టమంటే!

అవి విరియ బూచిన విరులు,
పరిమళాల సిరులు.

దేని సొగసు దానిదే, దేని సురభిళం దానిదే.
ఇదీ అంతే మఱి! ఏమంటారు!

"నాటకమున పద్యపఠనము ఉన్నంత వఱకు కొద్దియో,
గొప్పయో సంగీతము ఉండితీరవలసినదే. నాటక
రసాస్వాదమునకు వేషధారణము, అభినయము
ఎట్లు తోడ్పడునో సంగీతమును అట్లే తోడ్పడును.
కాని, అది మితిమీరిన సంగీతము కారాదు."

*– 'సాహిత్య శిల్ప సమీక్ష' పింగళి లక్ష్మీకాంతం*



రాయబారం సన్నివేశంలో
దుర్యోధనుడుగా
"తుర్లపాటి"

# ఆహార్యం

తెరతీయగానే ప్రేక్షకుడికి రంగస్థలిపై ప్రప్రథమంగా కన్పించేది, ఆకర్షించేది వేషం, అంటే పాత్ర. ఆంగికం, వాచికం, సాత్త్వికం పాత్ర రంగస్థలంపై ప్రవేశించిన తరువాత వ్యక్తం చేయబడతాయి. ఆహార్యం మాత్రం రంగస్థలి పైకి రాకముందే సిద్ధం కావలసినది కనుకనే దీనిని 'నేపథ్య విధి' అంటారు.

వేషానికి కావలసిన వస్తువులను తయారు చేసుకొనే నిమిత్తం అవసరమైన సామగ్రిని ఒకచోట చేర్చుకోవటాన్ని 'పుస్తము' అని, పాత్రోచితమైన వర్ణాన్ని ముఖానికి, శరీరానికి వేసుకోవటాన్ని 'అంగ రచన' అని, పాత్రకు తగిన ఆభరణములను, బట్టలను ధరించటాన్ని "అలంకార"మని, సహజత్వాన్ని రూపొందించటం కోసం జింకలు మొదలైన జంతువులను, పావురములు మొదలైన పక్షులను రంగస్థలిపై సంచరిస్తున్నట్లు చూపటాన్ని 'సంజీవ'మని అంటారని శాస్త్రం చెబుతోంది.

పాత్ర వయస్సు, వర్ణము, వర్చస్సు, స్థాయి, మనస్తత్వము, అలంకారములు, వస్త్రధారణము – వీటన్నిటినీ చక్కగా అవగాహన చేసికొని పాత్రోచితమైన విధంగా జాగరూకత వహించి రూపు దిద్దుకోవాలి.

అయితే ఆహార్యం విషయంలో కొన్ని వింతలు చోటుచేసుకుంటాయి. అవి అసహజమే అయినా అలా కొనసాగుతూనే ఉంటాయి. ఒక ఉదాహరణ చెప్పనా!

ఒకప్పుడు మా మిత్రుడు అంజిబాబుగారని మేకప్ ఆర్టిస్ట్ ఉండేవారు. ఆయన ఏదో (ఒకానొక) పరిషత్ పోటీలలో ఒక నటునికి ఆంజనేయుడు వేషం మేకప్ చేశారు. ఆ పాత్రధారి పాత్రోచితంగా, చక్కగా నటించారు. చేతలోగాని, వాచికంలో గాని, పద్యపఠనంలో గాని ఏ లోటూ కన్పించలేదు. కాని, పరిషత్తు వారు అతనికి ఏ బహుమతీ యివ్వలేదు.

మేకప్ చేసిన అంజిబాబుగారు

"ఏమండీ! మా ఆంజనేయ పాత్రధారి చేసిన పొరపాట్లేమిటి? అతనిని ఎందుకు ఎంపిక చేయలేదు? ఆ పొరపాట్లేమిటో తెలిస్తే అవి సరిదిద్దుకొనే అవకాశం కలుగుతుంది కదా! కనుక అతడు చేసిన దోషాలను కాస్త వివరించండి." అని కమిటీ వారిని అడిగారు. ఆనాటి న్యాయనిర్ణేతలలో ఒకరు కల్పించుకొని, "ఆంజనేయ పాత్రధారి బాగానే నటించాడు. కాని అతని మేకప్ బాగోలేదు. అందరూ వేసే ఆకుపచ్చ రంగు వేయకుండా ఏమిటో వేశారు. అందువల్ల మార్కులు తగ్గించవలసి వచ్చింది." అన్నారు.

అంజిబాబుగారు వెంటనే సమాధానమిస్తూ "అజనేయుడి వర్ణం ఆకుపచ్చ అని ఎక్కడ చెప్పబడి ఉన్నదండీ? అలా అని ఆధారమేమైన ఉన్నదా? నేను మేకప్ చేసిన వర్ణానికి ఆధారముంది.

ఆంజనేయుని ప్రార్థన శ్లోకంలోనే

"అతులిత బలధామం - స్వర్ణశైలాభ దేహం
దనుజవన కృశానుం - జ్ఞానినామగ్రగణ్యం
సకల గుణ నిధానం - వానరాణా మధీశం
రఘుపతి ప్రియ భక్తం - వాతజాతం నమామి"

పై శ్లోకంలో "స్వర్ణ శైలాభ దేహం" అని వర్ణించబడి ఉంది. అంటే బంగారు కొండవలె ప్రకాశించుచున్న దేహము కలవాడు అని అర్థము. ఆ వర్ణన నాధారంగా చేసికొనే నేను మేకప్ చేయటం జరిగింది." అని వివరించటంతో న్యాయ నిర్ణేతలు తమ పొరపాటును గ్రహించుకొని పాత్రధారికి బహుమతి ప్రదానము, అంజిబాబు గారికి ఘన సన్మానము చేసి పంపారు. (ఆ అంజిబాబు గారే తరువాతి కాలంలో పూనే విశ్వవిద్యాలయంలో ఆహార్య విభాగంలో ఆచార్య పదవినలంకరించి ఎందఱో విద్యార్థుల పరిశోధనలకు మార్గదర్శకులయ్యారు).

అయినా, ఆంజనేయ పాత్రధారులందఱూ ఆ ఆకుపచ్చ రంగే యిప్పటికీ వేస్తున్నారు. అదీ విచిత్రం.

మఱో విషయం. ఒక పాత్రకు నటుణ్ణి ఎంపిక చేసికొనేటప్పుడు అతని అంగ సౌష్ఠవం, కంఠస్వరం ఆ పాత్రకు నప్పుతాయో లేదో పరిశీలించి మరీ ఎంపిక చేసుకోవాలి.

ఒక లావుపాటి వ్యక్తికి శ్రీకృష్ణ పాత్ర ధరించాలనే కోరిక బలీయంగా ఉండవచ్చు. కాని, అలా వేయించగలమా? ప్రేక్షకులు చూడగలరా! సహించగలరా! అలాంటి వ్యక్తిచేత ఏ భీమసేనుడో, బకాసురుడో అలాంటి పాత్రలేవో వేయిస్తే నప్పుతుంది. ప్రేక్షకుల మన్ననలందుకునేటట్లు రూపొందించవచ్చు. అయితే కంఠస్వరం కూడా పాత్రకు తగిన విధంగా గంభీరంగా ఉందోలేదో చూచుకోవాలి. పాత్రకు తగిన అంగసౌష్ఠవం ఉండి కూడా కీచుగొంతైతే భరించలేము గదా! కనుక అన్నివిధాలా తగిన వ్యక్తినే ప్రతిపాత్రకు ఎంపిక చేసుకోవాలి.

**ఉదాహరణకు :**

వ్యాస భారతంలో కర్ణుడుమిక్కిలి తేజస్వంతునిగ, సాలప్రాంశునిగ (వృక్షమువలె పొడవైన వానిగ) సువర్ణ దేహునిగా అభివర్ణింప బడినాడు. పైగా సహజకవచకుండల శోభితుడు, కౌరవ పాండవులందఱికంటె పెద్దవాడు. పై విశేషాంశాలనన్నిటిని పరిగణనలోనికి తీసికొని కర్ణపాత్రను రూపొందించవలసియున్నది. అలాగే అలంకరణములు, ఆయుధములు అన్ని విషయాలలోను శ్రద్ధ వహించాలి. ఇలాగే ప్రతిపాత్ర విషయంలోనూ జాగరూకత వహించాలి.

ఒకే వ్యక్తి వేర్వేరు నాటకాలలో విభిన్న పాత్రలు ధరించి ఆయా పాత్రలే మనముందున్నట్లు భ్రమింపజేయగలిగినది ఆహార్యమే!

అలాగే ఒకే నాటకంలో పాత్రధారణ చేసి ఒక రంగాన ప్రవేశించి. అదే పాత్రధారి మఱో రంగంలో మారు వేషంలో ప్రవేశిస్తే ఏ మాత్రం గుర్తించలేని విధంగా మార్చగలిగినదీ ఆహార్యమే!

కనుక ఆహార్యం విషయంలో తగు జాగ్రత్త వహించి, ఆ పాత్రయే మన కంటి యెదుట ఉన్నట్లుగా చూపగలగటమే ప్రయోజనం.

అలా ప్రతిపాత్రకు తగిన నటీనటులు లభిస్తే నాటక ప్రయోజనం సగం సిద్ధించినట్లే అవుతుంది.

పౌరాణిక పాత్రలయితే ఏ పాత్ర ఏ వర్ణంలో ఉంటుందో, ఏయే పాత్రలకు ఎలాంటి ఆభరణాలు అలంకరించాలో, వస్త్రధారణ ఎలా ఉండాలో ఆయా పురాణాలలోని వర్ణనలను బట్టిగాని, రవివర్మ వంటి చిత్రకారుల చిత్రాలను బట్టిగాని గ్రహించవచ్చు.

సాంఘిక పాత్రలయితే మన నిజజీవితాలలోనే అలాంటి వారు తారసపడతారు కనుక చూచి గ్రహించవచ్చు. సరియైన అవగాహన, పరిశీలన లోపిస్తే పొరపాట్లు దొర్లే అవకాశముంటుంది.

కనుక వయోభేదము, అవస్థా భేదము, వృత్తి భేదము, సంస్కార భేదము, ప్రాదేశిక భేదము, సన్నివేశ భేదము - అన్నింటినీ పరిగణనకు తీసికొని వస్త్రాభరణాలను ధరించాలి.

సన్నివేశ భేదాన్ని కూడ చేర్చటంలోని ఆంతర్యమేమంటే ఒకే వ్యక్తి సన్నివేశ సందర్భాలను బట్టి వస్త్రాభరణాదులను ధరించవలసి ఉంటుంది.

**ఉదాహరణకు :**

మహారాజు కొల్వుతీరినప్పుడు, వేటకు వెళ్లేటప్పుడు, యుద్ధరంగానికి ఆయత్తమైనప్పుడు, వాహ్యాళికి వెడలేటప్పుడు ఒకే విధమైన వస్త్రాభరణాదులలో ఉండడు గదా!

## మరో విషయం

పాత్ర వయసునకు తగిన వయసు కలిగిన నటులు లభిస్తే రూపు రేఖలు తీర్చిదిద్దటం సులభతరం. ఒక్కొక పర్యాయం వృద్ధపాత్రధారణకు ఆ వయసు నటులు లభ్యంకాకపోతే వయసు తక్కువవారే ఆ పాత్ర ధరించవలసి వస్తుంది. అలాంటి సందర్భాలలో మేకప్ ఆర్టిస్ట్ (ఆహార్య నిపుణుడు) తన నేర్పును ప్రదర్శించి తీర్చిదిద్దవలసి ఉంటుంది. అలాగే పాత్రధారి కూడ తన చేతలో, మాటలో, చూపులో,

నడకలో అనుభవంతో కూడిన కౌశలాన్ని ప్రదర్శించి ప్రేక్షకుల హృదయాలను సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తవలసి ఉంటుంది.

అలాగే స్త్రీ పాత్రలు పురుషులు ధరించినా, పురుష పాత్రలు స్త్రీలు ధరించినా వేష - భాష - అభినయాలలో ఎంత జాగరూకత వహించవలసి ఉంటుందో గమనించి పాటించాలి, ఆ పాత్రలలో వారు రాణించటం ఆయా కళాకారుల శ్రద్ధ, అవగాహన, అభ్యాసం, లోకపరిజ్ఞానం, అంకిత భావం - వీటన్నిటిమీద ఆధారపడి ఉంటుంది.

## ఈ విషయంలో నా విషయం

రంగ ప్రవేశం చేసిన మూడు నాలుగేళ్ల వఱకూ నాకు రంగు వేసుకోవటం మీదికి ధ్యాసపోలేదు. మేకప్ ఆర్టిస్ట్ ఏది వేస్తే అదే. వస్త్రాభరణాలు కూడా అంతే. డ్రెస్ కంపెనీ వారు ఏవి వేస్తే అవే. వేషం ఒక్కో రోజు ఒక్కోవిధంగా ఉండేది. అలాగే సర్దుకునే వాణ్ణి.

అంతలో, తెనాలిలో నాటి ప్రముఖ రంగస్థల నటులు పీసపాటి నరసింహ మూర్తిగారు, బండారు రామారావుగారు, షణ్ముఖి అంజనేయ రాజుగారు శ్రీకృష్ణపాత్రధారులైన 'కురుక్షేత్రం'లో దుర్యోధన పాత్ర ధరించే అవకాశం జె. రామమోహనరావు చౌదరి గారి ద్వారా లభించింది.

శ్రీకృష్ణ పాత్రధారి పీసపాటి వారి ప్రశ్నల పరంపరకు నాటి 'చమత్కృతీ' లలితమైన నా సందర్భోచిత సమాధానాలు అందఱినీ అలరించాయి. పీసపాటివారూ ఆశీర్వదించి, అభినందించారు. అలా అటు ప్రేక్షకులనుంచి, ఇటు కళాకారుల నుంచి నాకు మంచి ప్రశంసలే అందాయి. బుఱ్ఱా సుబ్రహ్మణ్యశాస్త్రి గారు ఈ నాటకం మీ భవిష్యత్తుకు పునాది అన్నారు.

వల్లూరి వెంకట్రామయ్యచౌదరిగారు భుజంతట్టి "చాలా బాగా చేశారు. కాని మీ మేకప్ మాత్రం మీ పాత్రకు తగిన విధంగా లేదు. మేకప్ మనది మనమే చేసుకోవటం నేర్చుకుంటే ఎంతో శ్రద్ధగా మనమనుకున్న రీతిలో తీర్చిదిద్దుకో గలుగుతాం. అలాగే వస్త్రాభరణాలు కూడా మనవి మనకుండాలి. వెంటనే తప్ప తీసుకోండి" అని హెచ్చరించారు.

గుంటూరు రావటంతోనే, గుళ్లపల్లి ఆది శేషయ్యగారి డ్రెస్ కంపెనీకి వెళ్లి కావలసినవన్నీ కొనేశాను మేకప్ మెటీరియల్‌తో సహా.

మేకప్ అలవాటు చేసుకున్నాను. దుర్యోధనుడు, గయుడు, విశ్వామిత్రుడు, నరసింగరాజు మొదలుగా నేను ధరించే వేషాలన్నింటికీ ఆయా వేషాలకు తగిన విధంగా మేకప్ ఎంతో ఆకర్షణీయంగా చేసుకోగలిగిన స్థితికి వచ్చాను.

'Practice makes man perfect' అంతేగా మరి. మరో చిన్న విషయం, ముఖ్య విషయం.

కొందరు ముఖం వరకు మేకప్ వేసుకుంటారు. కాని బయటకు కనిపించే తక్కిన శరీరానికి కలర్ వేసుకోవటంలో నిర్లక్ష్యం వహిస్తారు. అలా కన్పిస్తే ఎంత ఎబ్బెట్టుగా ఉంటుందో! అలాగే, మహారాజు వేషం వేసి చేతికి ఒక్క ఉంగరం కూడా లేకపోతే ఎంత బోసిగా ఉంటుందో!

అలాగే, పాత్రస్థాయికి తగిన విధంగా కేశాలంకరణము, వస్త్ర ఆభరణాదులు పాదరక్షలతో సహా ఏలోటూ లేకుండా జాగరూకత వహించాలి.



గయుడు
"తుర్లపాటి"



భీమేశ్వర పురాణం టెలీఫిలిమ్‌లో వ్యాస మహర్షి "తుర్లపాటి"

# వాచికం

తెరతీయడంతోనే పాత్ర కన్పడుతుంది. ఆ తరువాత మాట వినబడుతుంది.

వాక్కు అంటే మాట. నోటి నుండి వెలువడే మాట - పాట - పద్యం, మూడూ వాచికాలే. వాచికంలోని భావాన్ననుసరించే కదలికలు, ముఖ కవళికలు చోటు చేసుకుంటాయి. కనుక ప్రదర్శనాంశమంతా వాచికంమీదనే ఆధారపడి ఉన్నదని, వాగ్రూపమైన యితి వృత్తాన్ననుసరించే నాటకం ఆది నుండి క్రమ పరిణామ మందుతూ కొనసాగుతుందని తేటతెల్లమవుతుంది.

కనుకనే "వాచియత్నస్తు కర్తవ్యో నాట్యస్యైషా తనుః స్మృతాః" వాక్కు నాట్యమునకు తనువు (= శరీరము). కావున దానిని గూర్చి తప్పక శ్రద్ధ తీసుకోవాలి అని,

"ఇదివృత్తంతు నాట్యస్య శరీరం పరికల్పితమ్"

(ఇతివృత్తము నాట్యమునకు శరీరము) అని భరతముని వాచికాభినయ వివరణమునకు పూనుకొనినాడు.

ఇతివృత్తమంటే కథ. కథ వాగ్రూపమే కదా! కావున పై రెండు వాక్యాలూ వాచికాభినయ ప్రాశస్త్యమునే తెలుపుతున్నాయి.

అలాటి వాచికాభినయాన్ని గుఱించి పలుకోణాల్లో ఆలోచించవలసిన ఆవశ్యకత యెంతైనా ఉన్నది.

నాట్యం అన్నప్పుడు రూపక రచన - రూపక ప్రదర్శన రెండూ ఉన్నవి.

వాచికాభినయంలో కవిని దృష్టియందుంచుకొని రచనా విధానాన్ని, ప్రయోక్తను దృష్టియందుంచుకొని పాఠ్య విధానాన్ని భరతముని వివరించారు.

**గాథాకల్పనా కౌశలం రచయిత కెంత ముఖ్యమో, ప్రదర్శనానుకూల రచనా శిల్పం కూడా అంతే ముఖ్యం.** కనుక తన రచనకొక ప్రణాళిక

నేర్పులచుకొని, రసరమ్యంగా, ప్రేక్షకజన హృద్యంగా నాటకాన్ని రూపొందించటం రచయిత బాధ్యత.

చూచేకొద్దీ ప్రేక్షకులలో ఉత్సుకతను రేకెత్తించే విధంగా ప్రదర్శనను ఉత్తమ ప్రమాణాలతో చూపగలగడం దర్శకుని బాధ్యత.

వాచికాభినయంలో న్యాయం చేకూర్చాలంటే నటుడు తీసుకోవలసిన జాగ్రత్త లేమిటి?

తాను ఏ నాటకంలో పాత్రధారణ చేయవలసి ఉందో, ఆ నాటకంలో తన పాత్ర వఱకే చూచుకోవటం కాకుండా నాటకాన్ని ఆద్యంతం క్షుణ్ణంగా చదవాలి.

అప్పుడు అందలి కథాంశమేమిటో, ఆయా పాత్రల మనస్తత్వాలేమిటో, తన పాత్ర మనస్తత్వమేమిటో, ఏయే పాత్రలతో తన పాత్ర ఎలా యెలా మెలగవలసి ఉందో, తన పాత్ర వలన రచయిత సాధించదలచుకొన్న లక్ష్యమేమిటో, అన్నీ విపులంగా తెలుస్తాయి.

అప్పుడు ఎవరితో పూజ్య భావంతో గౌరవంగా మాట్లాడాలో, ఎవరితో మైత్రీ భావంతో మెలగుతూ ముచ్చటించాలో, ఎవరితో చనువుగా, పరిహాసంగా చమత్కారాలు పండిస్తూ భాషించాలో, ఎవరిపైన విషం క్రక్కుతూ పరుష వచనాలు సంధించాలో అవగాహనకు వస్తుంది.

దానిని బట్టి తనపాత్ర వారివారితో మాటాడవలసిన విధానం గ్రాహ్యమవుతుంది.

ఏ నత్తిగా మాటాడవలసిన పాత్రో అయితే తప్ప తక్కిన పాత్రలన్నీ స్పష్టంగా మాటాడాలి.

సంస్కృతనాటకాలలో ఎలా పాత్రల స్థాయిననుసరించి సంస్కృతము, ప్రాకృతము ఉపయుక్తమైనవో అలాగే తెలుగు నాటకాలలో కూడా ఆయా పాత్రల స్థాయిని బట్టి శిష్టవ్యావహారికమో, పామరజన సామాన్య వ్యావహారికమో నిర్ధారించి రచయిత వ్రాయాలి, నటుడు మాటాడాలి.

సుదూర సామీప్యములను బట్టి పాత్రధారి నాదాన్ని పూరించటంలో భేదాన్ని పాటించాలి. మనకు కనిపించకపోయినా రంగస్థలిపైనున్న పాత్ర మాటాడే స్థాయిని బట్టి అవతలి వ్యక్తి ఎంత దూరాన ఉండి ఉంటాడో ప్రేక్షకుని ఊహకందాలి. **ప్రక్కనే ఉన్న వారితో కూడా బిగ్గరగా మాటాడుతుంటే అసహజంగా ఉండదూ!**

స్వగత సంభాషణలు కూడ తనలో తాను ఏదో పథకాన్ని రూపొందించు కుంటున్నట్లు మాటాడటం, లేక ఎదుట పాత్ర ఉన్నట్లు భావించుకొని క్రోధావేశపూరిత సంభాషణలు సేయటం మొదలుగా ఆయా సందర్భాలననుసరించి తాను మాటాడే విధానం సముచితంగా ఉండేలా చూచుకోవాలి.

ఇట్లే జనాంతికములును. జనాంతికములనగా ఇరువురు రహస్యముగ మాటాడుకోవటం. రహస్యమే అయినా, రహస్యం మాటాడుకుంటున్నారనిపించాలి, ప్రతి అక్షరమూ ప్రేక్షకుడికి వినిపించాలి.

మాటలంటే మాటలా!

ఎన్ని భావాల ఊటలో!

సుధలు వర్షించనూ గలవు

వ్యథలు తొలగించనూ గలవు

వ్యంగ్యాస్త్రాలు సంధించనూ గలవు

ద్వేషాగ్నిని రగిలించనూ గలవు.

ప్రశాంతిని చేకూర్చనూ గలవు.

ఆయా భావాలను సుస్పష్టం చేయటానికి ఎక్కడ నాదాన్ని పూరించాలి, ఏ పదాన్ని తేల్చిపలకాలి, ఏ పదాన్ని ఏ స్థాయిలో అనాలి, ఎక్కడ నవ్వును మేళవించాలి, ఎక్కడ భావానికి ఊతంగా, ఊహుఁ, ఆహాఁ, ఊఁ, ఇలాంటి ధ్వనులను జోడించాలి, ఎక్కడ గాద్గదికం తేవాలి, ఎక్కడ పారుష్యాన్ని పలికించాలి మొదలైన అంశాలను దృష్టిలో ఉంచుకొని ముందుకు సాగితే సంభాషణ ఎంత సహజత్వాన్ని మేళవించుకుంటుందో!

పలికే విధానం తెలియకపోతే అర్థమెంత మారిపోతుందో చూడండి.

"ఆడి యెన్నడు బొంకని వాడనేని

ధార్మికుడనేని, అజాతశాత్రవుడనేని,

పదుగురొకటయి నిను గవయుదురు గాక

నీక విజయము సుమి సుభద్రా కుమార!

(పాండవ విజయములో ధర్మరాజు అభిమన్యుని ఆశీర్వదించి యుద్ధానికి పంపనున్న సమయం)

'నీక/విజయముసుమి' అంటే 'నీకే విజయము కలుగును గాక. అని అర్థం స్ఫురిస్తుంది.

అలా కాక "నీ/కవిజయము సుమి" అని అన్నామో నీకు అపజయము కలుగును గాక అని స్ఫురిస్తుంది.

అలాగే.

"మావాడెంత పండితుడో మీకు తెలియదుటండీ అనే విధానాన్ని బట్టి .......... పండితుడనే అర్థాన్ని స్ఫురింప చేయవచ్చు. ఎంత శుంఠో అనే అర్థాన్ని వెలికితేవచ్చు.

వీటినన్నిటిని దృష్టియందుంచుకొనే 'కాకు స్వరం', శాస్త్రంలో విపులీకరింప బడింది.

'కాకువు' అంటే శోకభయాదుల వలన కలిగే ధ్వని పరిణామము.

అలాగే అర్థాంతర స్ఫూర్తిని కలిగించే విధంగా భాషించటం కూడా కాకువే అని స్థూలంగా చెప్పవచ్చు అని పి.యస్.ఆర్. అప్పారావు గారు తెలియజేస్తూ,

'దయచేయండి' అనే పదాన్ని పలికే విధానాన్ని బట్టి రండని ఆహ్వానిస్తున్నట్లూ నుడువవచ్చు. 'బయటకు నడవండి', అని స్ఫురించేటట్లూ ధ్వనింపజేయవచ్చునని ఉదాహరించారు.

ఆనందము, ఆశ్చర్యము, విషాదము, వ్యంగ్యము, అవహేళనము ఇత్యాది భావాలను పలికించేతీరు పాత్రధారి సంభాషణా వైవిధ్య కౌశలం మీద ఆధారపడి ఉంటుంది.

శృంగార హాస్యాదులయందు భావభేదములను గుర్తించి అనేక విధములగు కాకువులతో పాఠ్యములను ప్రయోగింపవలెనని శాస్త్రము వివరించింది.

కాకువును గురించి ఎంతో వివరంగా తెలుపుతూనే పోణంగివారు,

"కాకువు పద్యమందెంత ముఖ్యమో, వచనమునందును అంతే ముఖ్యం. అనంతమైన యీ కాకువైవిధ్యమును వ్రాసి చెప్పుటకు శక్యం కాదు. సమర్థుడైన నాట్యాచార్యుడు స్వయంగా పలికి వినిపించవలసినది మాత్రమే." అని స్పష్టీకరించినారు.

ఆయా సందర్భాలను బట్టి మాటాడే విధానం ఎంతో సహజంగా ఉండాలి. ఎంత సహజంగా అంటే,

జాబిల్లికి వెన్నెల ఎంత సహజమో,
చిఱుగాలికి చల్లదనమెంత సహజమో,
ఏటి నీటికి అలలెంత సహజమో,
అంత సహజంగా ఉండాలి.

"ఏకశబ్దః సుష్ఠుప్రయుక్తః సమ్యక్జ్ఞాతః.
స్వర్గ లోకేచ కామధుక్ భవతి" అని శ్రుతి వాక్యము.

అంటే, ఒక శబ్దం చక్కగా ప్రయుక్తం కావటం, చక్కగా ఉచ్చరింపబడటం జరిగితే, అది స్వర్గమందు, లోకమందు కూడ కోరికలను పిండుతుంది అని అర్థం.

**కొసమెఱుపుగ ఒక విషయం మనం మననం చేసుకోవాలి. మధుర వచస్వులయిన సాహితీమూర్తు లెందఱో, కళాతపస్వులై, తాము పాత్రపోషణ**

కావించటమే కాక, మతెందతెందతికో శిక్షణనిడి, కళామూర్తులుగా తీర్చిదిద్దటంతో, మన నాటకకళ కళకళలాడుతూ కలకాలం వర్ధిల్లగలిగే స్థాయికి ఎదిగిన మాట వాస్తవం.

కావ్యం దోషరహితంగా ఉండాలి. అంతే కాదు. గుణ మహితంగా ఉండాలి అన్నది సర్వాలంకారికుల అభిప్రాయం. అలాగే ఉచ్చారణ దోషరహితంగా ఉండటం మాత్రమే కాదు, గుణమహితంగా కూడా ఉండాలి అని నా అభిప్రాయం.






స్వామి సన్నిధిలో సత్యసాయి కళావాహిని బృందం, గుంటూరు

# ఆంగికాభినయం

ఆంగికాభినయము అంటే శిరము మొదలుగా కరచరణాది అవయవముల తోడి అభినయము అని అర్థం.

లోకంలో సహజంగా ఏదో ఒక పని చేసుకుంటూనే ఎదుటి వారితో మాటాడటమో, కలిసి నడుస్తూ ముచ్చటించుకోవటమో, కుదురుగా కూర్చున్న వారితో ఎవరిని గురించో నిందలు వేస్తూ దురుసుగా మాటాడటమో, ఎదురెదురుగా కూర్చొని ఎవరన్నా వస్తున్నారేమోనని తఱచుగా అటూయిటూ చూస్తూ రహస్యంగా మాటాడుకోవటమో, దారినపోయే తనకుగిట్టని వాళ్లని. అటు చూడకుండానే వారికి తగిలొచ్చేటట్లు నోరుపట్టని మాటలనటమో, గలగల నవ్వుతూ పరాచకాలాడు కోవటమో, మాటాడుతూనే మధ్యమధ్య వెటకారపుచురకలేయటమో, రోషం పొడుచుకొచ్చి ఒకరినొకరు దెప్పుకోవటమో, ఇలా ఏవేవో జరుగుతూనే ఉంటాయి కదా! అలాంటప్పుడు, తలూపటమో, చేతులు కదపటమో, అటుయిటు నడవటమో, కనుబొమ లెగరేయటమో, కన్నెఱ్ఱ జేయటమో, వెళుతూ వెళుతూ మళ్లీ వెనక్కు వచ్చి మాటాడటమో, కోపం తట్టుకోలేక చేతిలోని వస్తువు విసురుగా గిరాటు వేయటమో, తొడగొట్టి సవాలుచేయటమో - ఇలాటివి, పైన చెప్పుకున్నవి, ఇంకా అలాంటివెన్నో రంగస్థలం మీద నటుడు తాను ధరించిన పాత్ర ద్వారా సన్నివేశానుగుణంగా, సందర్భోచితంగా చేసినప్పుడు అదే 'ఆంగికాభినయం'గా పరిగణింపబడుతుంది.

ఈ ఆంగికాభినయాన్నే ఇలా విభజించారు. అవే,

1. ముఖజము,

2. శారీరము,

3. చేష్టాకృతము. అలాగే మానవుని శరీరావయవములన్నీ,

అంగ - ఉపాంగ - ప్రత్యంగములను పేర మూడు విధాలుగా విభక్తములయినవి.

**అంగములు :** శిరము, హస్తములు, కటి, ఉరము, పార్శ్వములు, పాదములు.

**ఉపాంగములు :** నేత్రములు, కనుబొమలు, నాసిక, అధరము, కపోలములు, చిబుకము.

**ప్రత్యంగములు :** జఠరము (కడుపు), జంఘలు (పిక్కలు), ఊరువులు (తొడలు), స్కంధములు (మూపులు) బాహువులు, పృష్ఠము (మూడి).

ఇవి అన్నీ పరస్పర సంబంధమును కలిగియున్నవే. ఏదేని ఒక భావాన్ని ప్రదర్శించినప్పుడు, లేదా ఏదేని ఒక చలనాన్ని చూపినప్పుడు ఈ అంగ ఉపాంగ ప్రత్యంగములన్నీ కాని, కొన్ని కాని కలసి కదులుతుంటాయి.

ఇందులో ముఖజాభినయము కేవలము ఉపాంగాభినయము. శరీరాభినయము ఒకచోటి నుండి కదలకయే చేయదగిన అభినయము.

చేష్టాకృతము అంటే చలనమే ప్రధానముగా కలది.

**ఒక ముఖ్య విషయం :** మనం చెప్పుకునే ఈ అభినయాలన్నీ మనసులోని భావానికి అనుగుణంగానే జరుగుతాయి. ఉపాంగములలోనిదైన నేత్రాన్ని గురించి, నేత్రాభినయవిన్యాసవైశిష్ట్యాన్ని గురించి ఎంత చెప్పుకున్నా తక్కువే ఔతుందేమో!

**నేత్రాలు :** ఆనందంలో వెన్నెలలు విరియించగలవు.

క్రోధంలో అగ్నిశిఖలు వెలిగ్రక్క గలవు.

దుఃఖంలో కన్నీరు మున్నీరుగా చేయగలవు.

ఉద్వేగానికి ఊపిరి పోయగలవు.

ప్రశాంతతకు పట్టం గట్టగలవు.

ప్రేమామృతాన్ని వర్షించగలవు.

చూపులు విసరగలవు.

తూపులు నాటగలవు.

ఇంత యెందుకు?

కంటి చూపులు ఎలాంటి భావాన్నైనా ప్రకటించగలవు. ఏ ప్రేక్షకుణ్ణైనా మురిపించగలవు.

బళ్ళారి రాఘవగారి అభినయానికి ముగ్ధులై ప్రశంసిస్తూ **"ఆ విశాల లోచనాలు అనంతభావాల దర్పణాలు"** అని పుట్టపర్తి నారాయణాచార్యుల వారన్నమాట అక్షరాక్షర సత్యం.

అలాగే మరొక్క విషయం.

కొన్ని విచిత్రమైన ప్రకృతిగల పాత్రలరుదుగా తటస్థపడతై. ఒక్కొకణ్ణి గుఱించి చెపుతూ,

'వాడా! నోటితో మాటాడుతూనే నొసటితో వెక్కిరిస్తాడురా!' అంటారు.

**అలాంటి పాత్రలను సైతం సమర్ధవంతంగా నిర్వహించగలగటం అభినేత నటనాచమత్కృతికి, అనుభవపరిణతికి గీటురాయిగా నిలుస్తుంది.**


టెలీఫిలిమ్‌లో
"తుర్రపాటి"


తురంగ చిత్రంలో
"తుర్రపాటి"

# సాత్త్వికం

నాట్యం సర్వప్రకృతులను, సర్వభావాలను అనుకరిస్తుంది. కనుక నటుడు విభిన్న పాత్రలు ధరించవలసి ఉంటుంది. ఎలాంటి భావాన్నైనా ప్రకటించవలసి ఉంటుంది. అందువల్ల సర్వమానవ వ్యాపారాన్ని గురించి చక్కగా అవగాహన చేసికొనటం నటుడికి ఎంతో ఆవశ్యకం.

మానవ వ్యాపారమంతా మనో – వాక్ – కాయ భేదాలచే మూడు విధాలు. అవి క్రమంగా సాత్త్విక – వాచిక – ఆంగికాభినయాలుగా పేర్కొనబడినవి.

మానసిక వ్యాపారము – సాత్త్వికము

వాగ్వ్యాపారము – వాచికము

కాయ (శారీరక) వ్యాపారము – ఆంగికము

ఈ మూడు అభ్యాస ప్రారంభం నుండి ఆవశ్యకాలే. ఆహార్యం మాత్రం ప్రదర్శన సమయంలోనే ఆవశ్యకం.

సాత్త్వికాభినయం అంటే సత్త్వసంబంధమైన అభినయం. సత్త్వం అనేది సర్వమానవ సామాన్యమైన మనః స్థితి. తగిన కారణం ఉంటేనే మనసు స్పందిస్తుంది. ఆ సమయంలో అంతదనుక అవ్యక్తంగా ఉన్న సత్త్వం రోమాంచ – అస్రాది రూపంలో అభివ్యక్తమవుతుంది.

ఈ సత్త్వబలం వల్ల వ్యక్తి తన కష్టసుఖాలకు స్పందించటమే కాక ఇతరుల కష్టసుఖాలకు కూడా స్పందించటం జరుగుతుంది. అదే, అంటే పరులకష్ట సుఖాలకు స్పందించటమనేదే నటీనటులకు అభినయంలో సహాయకారి అవుతుంది.

నాట్యం లోకస్వభావ అనుకరణం కనుక నాట్యంలో సత్త్వం ఆవశ్యకం.

సత్త్వప్రధానమైన అభినయమే సాత్త్వికాభినయం.

"స్తభః స్వేదాంబు రోమాంచః స్వరభంగో౽ థవేపథుః
వైవర్ణ్యమశ్రు ప్రలయ ఇత్యష్టౌ సాత్త్వికాః స్మృతాః." అభినయదర్పణము.

అంటే మానసిక స్పందన వలన కలిగే,

స్తంభము = ప్రమానుపాటు

స్వేదాంబువు = చెమటపట్టుట

రోమాంచము = గగుర్పాటు

స్వరభంగము = కంఠధ్వని మారుట

వేపథువు = గాద్గదికము

వైవర్ణ్యము = వెల్లబాటు

అశ్రువు = కన్నీరు

ప్రలయం = అపాయము

ఈ ఎనిమిదింటిని సాత్త్వికములంటారు.

ఒక్క మాటలో చెప్పాలంటే మనసులోని భావాన్ననుసరించి శరీరము మీద వ్యక్తమయ్యేవే సాత్త్వికములు.

"పరగత సుఖదుఃఖాదుల
నరయగ భావించి యట్లయలరుట సత్త్వ
స్ఫురణము, తద్భవభావము
లరయగ సాత్త్వికములయ్యె..."

*- కావ్యాలకార సంగ్రహము*

"నటుడు తాను నిజముగా సుఖితుడు కాకపోయినను, లేదా దుఃఖితుడు కాకపోయినను సుఖమును లేక దుఃఖమును అభినయించుచునే ఉన్నాడు. అట్టి అభినయమును అతడు చేయగలుగుట సత్త్వ ప్రభావముచేతనే." అన్నపోణంగివారి గుప్తభావ ప్రకాశికా వివరణము సత్త్వమననేమో సుస్పష్టమొనరించుచున్నది.

"సాత్త్వికాభినయమునందే నాట్యము ప్రతిష్ఠితమై యున్నది. సాత్త్వికాభినయము అధికముగా గల అభినయము జ్యేష్ఠాభినయమనబడును. సాత్త్వికాభినయము ఇతరాభినయములతో సమానముగనున్నచో అది మధ్యమాభినయమనబడును. వాచికాంగికాభినయము లధికమై సాత్త్వికాభినయము తక్కువగా నున్నచో అది అధమాభినయమనబడును" అన్న భరతముని వాక్యములు సాత్త్వికాభినయ ప్రాధాన్యమును సువ్యక్తమొనర్చుచున్నవి.



గుంటూరు పట్టణ కళాకారుల సంఘం తరపున శ్రీకృష్ణ పాత్రధారులు శ్రీ ఏ.వి. సుబ్బారావుగారిని సత్కరిస్తున్న "తుర్లపాటి"



వై. సుబ్బారావు, (హార్మోనిస్టు) కొణతం నాగేశ్వరరావు, చలువాది ప్రసాదు బాబు, షేక్ బాజ్జీ, కె. నాగేశ్వరరావు, మొ॥ శిష్యులచే గురు సత్కారం "తుర్లపాటి"

# ప్రతిభ

ఎంత శిక్షణ పొందినా, ఎంత నిరంతర అభ్యాసం చేసినా ప్రతిభావంతుడు కాని నటుడు అగ్రేసరుడు కాలేడు. ప్రతిభావంతుడు ఎప్పటికప్పుడు తన నటనలోని లోటుపాట్లను పరిశీలించుకుంటూ, సవరించుకుంటూ, ఇంకా వినూత్నంగా నైపుణ్యంతో ప్రదర్శించటానికి అనువైన రీతిని అన్వేషించుకుంటూ ముందుకు సాగుతాడు. అందువల్లనే ప్రతిభావంతులయిన మహానటుల నటన నానాటికి నవ్యమై, ప్రేక్షకులకు ఆకర్షణీయమై అలరారుతుంది.

"కవి ప్రతిభలోన నుండును కావ్యగత శ
తాంశములయందు తొంబదియైన పాళ్లు"

అని కవి సమ్రాట్ విశ్వనాథవారన్నట్లు కావ్యశిల్పం కవి ప్రతిభ మీద ఆధారపడి ఉంటుంది.

అలాగే నటనాశిల్పం నటుని ప్రతిభ మీద ఆధారపడి ఉంటుంది. ప్రతిభావంతుడైన కవి కావ్యానికి చదివించే శక్తి ఉంటుంది. అలాగే ప్రజ్ఞాశాలియైన నటుని నటునకు, సందర్శనాసక్తిని కలిగించే శక్తి ఉంటుంది.

తాను స్వీకరించిన శీర్షిక ఏదైనా కావచ్చు దానిని కవితగా రూపొందించే ప్రతిభ మహాకవి కుంటుంది. అలాగే! తాను ధరించిన పాత్రయేదైనా సరే, దానిని పండించ గలిగిన ప్రతిభ మహానటునికుంటుంది.

ప్రతిభావంతుడైన నటుని మాటలో, చూపులో, కదలికలో అన్నింటిలో తనదైన ఒక ప్రత్యేకత ఉంటుంది. సహనటులకు అనుకరించాలనేటంత ఉబలాటం కలిగించే ఆకర్షణ ఉంటుంది.

కనుక కవి గాని, నటుడు గాని మఱియే కళాకరుడు గాని హిమవన్న శిఖరంలా ఎదగాలంటే అప్రతిమాన ప్రతిభావంతుడై ఉండాలి.

'ప్రతిభా వ్యుత్పత్త్యాః ప్రతిభాశ్రేయసీ."

అన్న ఆనందవర్ధనుని వాక్కు ప్రతిభ శ్రేష్ఠత్వాన్ని స్పష్టం చేస్తోంది. వ్యుత్పత్తి అంటే పాండిత్యము, పరిజ్ఞానము.

"ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభామతా"

ఉన్మేషము అంటే వికాసము. ఎప్పటికప్పుడు వికసించే బుద్ధినే ప్రతిభ అంటారు.

"అపూర్వ వస్తు నిర్మాణక్షమా ప్రజ్ఞా" అని మఱొక ఆలంకారికుని అభిప్రాయం. "ఎంత సహజశక్తి ఉన్నా అది కావ్యనిర్మాణక్షమమైనప్పుడే కావ్యహేతువుగా కొనియాడబడును గాని లేనిచో పరిగణనీయమే కాదు." అని పింగళి లక్ష్మీకాంతం గారు తన సాహిత్య శిల్ప సమీక్షలో వివరించినారు.

వస్తు సౌందర్యాన్ని వినూత్నమైన రీతిలో భావించగలగటం, భావించిన దానిని కావ్యంలో రమణీయంగా రూపొందించగలగటం - ఇవి రెండూ ప్రతిభకు రెండు ముఖాలు. ఒకటి దర్శనము, రెండవది ప్రదర్శనము.

అలాగే నటుడు తన పాత్రను అన్ని కోణాలలో చక్కగా అవగాహన చేసికొని ఏ సన్నివేశంలో ఎలా నటిస్తే పాత్రౌచితికి దోహదం చేస్తుందో, ప్రేక్షకుల కాదరపాత్రమౌతుందో యోజించటం ఒక యెత్తు.

దానిని అభ్యాసవశాన తగిన విధంగా మలుచుకొని ప్రదర్శించటం మఱియొక యెత్తు.

**భావించటాన్ని 'భావయిత్రి' అని, రూపొందించటాన్ని 'కారయిత్రి' అని ఆలంకారికులు పేర్కొనినారు.**

ప్రతిభనే శక్తి అనికూడా అంటారు.

**ఎవరు ఏ యే వృత్తులు నిర్వహిస్తూ ఉన్నా, మౌలికంగా కళాప్రతిభ కలిగిన వ్యక్తి కళాకారుడిగా బయటపడకుండా ఉండలేదు.**

# సమయ స్ఫూర్తి

నటుడికి అభినయాన్ని గూర్చిన అవగాహనతోపాటుగ, సమయస్ఫూర్తి కూడా ఎంతో ముఖ్యం, దర్శకుడు ఎన్ని రోజులు రిహార్సల్స్ చేయించినా, ఒక్కొకపర్యాయం తలవని తలంపుగా ప్రదర్శనలో ఏవో అవాంతరాలు ఎదురౌతాయి. అవాంఛనీయ సంఘటనలు చోటు చేసుకుంటాయి.

అలాంటి సందర్భాలలో పాత్రధారి, పాత్రౌచితికి భంగం కలుగకుండా, నాటకాన్ని రసవత్తరంగా కొనసాగించే నిమిత్తం స్ఫూర్తిమంతుడై ప్రవర్తించవలసి ఉంటుంది.

స్వతంత్రించి సమయానుకూల సంభాషణా చాతుర్యాన్ని ప్రదర్శించి, అవాంతరాన్ని అధిగమించి, ప్రదర్శనను రక్తికట్టించి, ప్రేక్షకుల హృదయాలను ఆకట్టుకోవటం పాత్రధారి ప్రతిభాపాటవాలపై, సమయస్ఫూర్తిపై ఆధారపడి ఉంటుంది.

ఇలాంటి సందర్భాలు కళాకారుల అనుభవాలలో ఎన్నో! కొన్నింటిని పరిశీలించుదామా!

స్థానం నరసింహారావుగారు ప్రప్రథమంగా పాత్రధారణ చేసిన సందర్భం.

అది సత్యహరిశ్చంద్ర నాటక ప్రదర్శనం. స్థానం వారు చంద్రమతి పాత్రధారి. హరిశ్చంద్రుడు వేటకు వెళ్లినట్లు రంగంలో ప్రవేశించాడు. చంద్రమతి లోహితునితో రంగస్థలాన ప్రవేశించాలి. భయంతో స్థానం వారు సైడ్ వింగులో నిలబడిపోయారు. అడుగుముందుకు పడలేదు. ఎవరో వెనుకనుంచి నెట్టటంతో, ఏదో రాయి కాలికి తగిలినట్లుగా తూలిపడబోయి రంగస్థలాన ఎలాగో నిలద్రొక్కుకున్నారు. ఆయన స్థితిని గమనించిన హరిశ్చంద్ర పాత్రధారి (చోరగుడి హనుమంతరావుగారు) దగ్గరకు వచ్చి, వీపుతట్టి, "దేవీ! భయపడకుము. ఇది అరణ్యప్రాంతము గదా! నేల

యెగుడుదిగుడుగా నుండును. రాయి రప్పా కాలికి తగులుచుండును. కనుక ముందు దారిచూచుకొని, నిర్భయముగా నడువుము" అని సమయస్ఫూర్తితో సమర్థించటంతో ప్రేక్షకులు ఆనందాతిశయంతో హర్షధ్వానాలు చేసారట! (స్థానం వారి 'నటస్థానం' నుండి)

## మరొక సందర్భం :

రాయలసీమలో 'కురుక్షేత్ర' నాటక ప్రదర్శనలు ముమ్మరంగా జరుగుతున్న రోజులవి.

(మయసభ, ద్రౌపదీ వస్త్రాపహరణం, పాండవోద్యోగం, పాండవ విజయం ఈ నాల్గింటిలోని ముఖ్యఘట్టాలను కథాగమనం కుంటువడకుండా కూర్చి ప్రదర్శనలిచ్చేవారు. వాటినే "కురుక్షేత్ర" ప్రదర్శనలనే వారు).

అందులో పాడవోద్యోగం ప్రథమ రంగంలో – శ్రీకృష్ణునిగా కల్యాణం రఘురామయ్య గారు, అర్జుననిగా బి.వి. రంగారావు గారు. దుర్యోధనునిగా నేను నటించటం జరిగింది.

శ్రీకృష్ణుడు కపట నిద్ర నటిస్తుండగా దుర్యోధనుడు భుజమున గదా దండమును ధరించి ప్రవేశించి, గదను తన సింహాసనమాధారంగా నిలువుగా ఉంచటం జరిగింది.

ఆ తరువాత దుర్యోధన పాత్రధారినైన నేను, నిష్క్రమణకు ముందు శ్రీకృష్ణునితో

"బావా! పరిశేషన్యాయమున తక్కిన దానినే ఏనుగైకొంటిని. ఇక నేనరుగుదునా!" అని గదనందుకొనటానికి రెండడుగులు వైచి చూడగా ఎప్పుడు పడిపోయిందో గద క్రిందపడి ఉంది.

వంగి గదను తీసుకోవటానికి నాలోని అభిమానధనుడు అంగీకరించలేదు. అంతలో ఒక ఆలోచన నాలో తళుక్కున మెరిసింది. అంతే "వాసుదేవా! మేము మా విశ్రాంతి మందిరమునకేగుచుంటిమి. మా గదా దండమును ఒక యోధునిచేత అచ్చటకు పంపింపుడు" అని ఠీవిగా నిష్క్రమించాను.

సభ్యుల కరతాళధ్వనులు మార్మోగాయి. శ్రీకృష్ణ పాత్రధారి రఘురామయ్యగారు లోనికి వచ్చి నన్ను అమాంతం కౌగిలించుకొని అభినందనలతో ముంచెత్తారు.

## అలాగే వేరొక సందర్భం :

ఒక పర్యాయము సత్యహరిశ్చంద్ర నాటకం జరుగుతోంది. హరిశ్చంద్రుడు భార్యా పుత్రులు, నక్షత్రకుడు వెంటరాగా అరణ్యమున ప్రవేశించినాడు.

లోహితుడు : 'అమ్మా! నాకీనాడిన్ని మంచినీళ్లయిన లేవుగా! నాకేమో ఆయాసముగానున్నదే' అన్నంతలో

హరిశ్చంద్రుడు : సార్వభౌముని కుమారునకునేడన్నోదకములకు గూడ కరువయ్యెగా' అని బాధనొంది.

'దేవీ!! నీనిందెందైన నీరు దొరకునేమో పోయివత్తును' అని బయలు దేరినాడు. వెంటనే ప్రేక్షకులు 'ఎక్కడికో వెళ్లటమెందుకండీ? నీవెనకనే కాలువుందిగా' అనటంతో వెనుక తెరవైపు చూచి పొరపాటున కట్టబడిన నీటికాలువ ఉండిన కర్టెనును గమనించి

"దేవీ! తిరిగితిరిగి వేసారియుండుటచే పరిసరములను సైతము పరికింపనైతిని గదా! అదిగో జల ప్రవాహము. సమీపముననే యుండినది పోయి నీరు తెచ్చెదను" అని ఆ ప్రవాహమువేపు నిష్క్రమించుటతో సభ్యులెంతయో ఆనందమును ప్రకటించినారు

(తెరలు కట్టుట మొదలుగా, రంగాలంకరణ మొనర్చు వారికిని ఆయా దృశ్యములను గూర్చిన అవగాహన ఎంత ముఖ్యమో గమనార్హము).

## మరొక సన్నివేశం :

అది భువనవిజయసభ

అష్టదిగ్గజకవులు ఆసీనులై ఉన్నారు. వందిమాగధ స్తోత్రాలు వినిపిస్తూ ఉండగా శ్రీకృష్ణదేవరాయలవారు, వారివెంట అప్పాజీ ప్రవేశించారు. సభాసదులు

సభ్యతను పాటించి నిలుచుండినారు. రాయలవారాసీనులయిన పిమ్మట అందఱును ఉపవిష్టులైనారు. సభ ప్రారంభమయింది. ఒక వరుస కవులందఱూ రాయలవారి వైభవాన్ని కీర్తిస్తూ శ్రవణపేయంగా పద్యపఠనం గావించారు.

ఇంక రెండవ వరుస రాయలవారు, అప్పాజీవారు సమస్య లీయటం, కవి శేఖరులు రసభరితంగా, చమత్కార జనకంగా పూరించటం జరుగుతున్నది.

అందులో ఒక కవికి రాయలవారు సమస్యనిచ్చారు. కవిగారు ఆలోచిస్తూ లేచి, తలపంకించి "Ok Ok చమత్కారము స్ఫురించినది." అన్నారు. సభ్యులు ఆ ఆంగ్ల పదములను విని గొల్లుమని నవ్వినారు.

"సభాసదులారా! ఎందుకలకిట్లవహేళన మొనర్చుచుంటిరి? ఇప్పుడు నేనేమంటినని?

'ఒకే ఒక చమత్కారము స్ఫురించినది' అనినాను. ఇందు పరిహసింపదగిన తప్పిదమేమున్నది?" అని కవిగారు సమయస్ఫూర్తితో సమర్థించుకొనినారు.

Ok Ok అన్న పొరపాటును 'ఒకేఒక' అని మలుచుకోవటంతో సభ్యులు ప్రశంసలజల్లు కురిపించారు.

## మరొక పర్యాయం :

'శ్రీకృష్ణతులాభారం' ప్రదర్శన జరుగుతోంది.

అది చివరి సన్నివేశం. రుక్మిణీదేవి భక్తిపూర్వకంగా ఒక పద్యం చదివి త్రాసు రెండవప్రక్క తక్కెడలో ఒక తులసీదళం ఉంచటంతో. శ్రీకృష్ణుడు కూర్చుండిన తక్కెడ లేవాలి. ఒక తీగ లాగటంతో అలా జరిగేటట్లు ఏర్పాటు చేసికొనినారు. కాని ఆ రోజు నాటకంలో ఆ తీగ ఒక కొక్కెమునకు తగులుకోవటంతో తులసీదళం ఉంచినా కృష్ణుని వేపు తక్కెడ లేవలేదు.

పాత్రధారులు నిశ్చేష్టులయ్యారు. ప్రేక్షకులు నవ్వుతూ ఏం జరుగుతుందో చూడాలని కుతూహలపడుతున్నారు. ఆ సమయంలో సత్యభామవేషధారి స్థానంవారు రుక్మిణీ దేవిని

సమీపించి "అక్కా! మన భర్తకు ఇలాంటి స్థితిపట్టినదే అన్న ఆవేదనలో, నీ ధ్యానము నిలుకడ తప్పినట్లున్నది. మఱియొకసారి మనసార ప్రార్థనగావించి తులసీదళము నుంచుము." అనుటయు, ఆలాగుననే రుక్మిణీదేవి పద్యం చదివి తులసీదళం త్రాసునందుంచుటయు జరిగినది.

కాని యిక్కడ మరొక చిక్కు వచ్చిపడింది. త్రాసును చక్కపఱచటంతో తులసీదళం త్రాసులో ఉంచక ముందే తక్కెడ లేచింది.

దీనినెలా సమర్థించటం!

స్థానంవారే, "అక్కా! ఇప్పుడు నీ భక్తి మధ్యలోనే పరాకాష్ఠను పొందుటచేత దళం వేయకుండానే కృష్ణుడు కూర్చుండిన తక్కెడ పైకి లేచింది. ఇక ఆ దళమే వేస్తే మన కృష్ణుడు మనకందకుండా అంతరిక్షంలోకి ఎగసిపోతాడేమో, కనుక వేయవద్దు" అని వారించి అంతరాయాల నధిగమించి సన్నివేశాన్ని రక్తి కట్టించారట.

ఒక్కొక్కతఱి పెల్లుబికే ఆనందంతో జనసందోహం చేసే కరతాళ ధ్వనులు, అనూహ్యంగా అప్పటికప్పుడు వారు చేసే సత్కారాలు పాత్రధారిలో కూడా ఉత్సాహాన్ని రేకెత్తించి, మెచ్చుకోలుగా సమయోచితంగా మాటాడి, వారిని మురిపించాలనిపించటం సహజం.

అలాటి సందర్భమొకటి ముచ్చటించుకుందామా!

రాజమహేంద్రవరం దేవీచౌక్‌లో దేవీ నవరాత్రమహోత్సవ సందర్భంగా ఒకరోజు 'పాండవోద్యోగ విజయాలు' ప్రదర్శన జరుగుతోంది. అది కౌరవ సభ. శ్రీకృష్ణ రాయబార దృశ్యం. శ్రీకృష్ణపాత్రధారి షణ్ముఖి ఆంజనేయరాజుగారు. భీష్మ ద్రోణాదులు, ధృతరాష్ట్ర మహారాజు, కర్ణ దుర్యోధనాదులు ఉచితాసనముల ఆసీనులైయన్నారు.

అశ్వత్థామ, విదురాదులు వెంటరాగా శ్రీకృష్ణుడు సభాస్థలిని ప్రవేశించినారు. సభ్యులు షణ్ముఖి వారిమీది ఎనలేని అభిమానంతో హర్షధ్వానాలు చేశారు. రంగస్థలం మీదికి వచ్చి శ్రీకృష్ణుని పూలమాలలతో సత్కరించారు.

దుర్యోధన పాత్రధారినైన నేను ఒక చణుకు వేయాలనే కుతూహలంతో శ్రీకృష్ణునివంక చూచి, "వాసుదేవా! మీరు మా సభా భవనమున ప్రవేశించుటతోడనే,

అత్యాదరమున మా సభాసదులు హర్షధ్వానములు గావించుటయు మిమ్ములను పుష్పమాలాలంకృతులను చేయుటయు మావారి సభ్యతా సంస్కారములను సూచించు చున్నది కదూ!" అని చమత్కరించాను.

వెంటనే శ్రీకృష్ణ పాత్రధారి షణ్ముఖివారు. "మీ సభాసదుల సభ్యతా సంస్కారముల విషయమున నాకేమాత్రమును సందియము లేదు. నీ విషయముననే....!" అని ఒక చిరునవ్వు విసరటంతో వారి ప్రతిస్పందనా పూర్వక సంభాషణమునకు జనులెంత ఆనందించారో, నేనంత నివ్వెరపడి, వెంటనే తేరుకొని, "యథారాజా తథాప్రజా" ప్రభువుల సంస్కారమును బట్టియే ప్రజల సంస్కార ముండును. కావున మమ్ము సందేహింప పనిలేదు" అని సమాధానమివ్వటం జరిగింది.

"అట్లయిన మంచిదియే కదా!" అంటూ తదుపరి రాయబార ఘట్టమును నిర్వహించినాడు శ్రీకృష్ణుడు.

సందర్భోచితికి భంగం కలిగించని సంభాషణలు సభ్యుల హృదయాలనెంత అలరిస్తాయో!

అది అనుభవైకవేద్యం.

**మరొక ప్రదర్శన :** కురుక్షేత్రమే

సుయోధనుడిగా మయసభలో ప్రవేశించాను. ఒకటికంటె మరొకటి మిన్నగా ఉండిన ఆ అద్భుతావహ దృశ్యాలను తిలకిస్తూ, సంభ్రమాశ్చర్యాలను ప్రకటిస్తూ, ముందడుగు వేస్తూన్నానే తప్ప క్రిందికి చూడలేదు.

మైక్‌వైర్ కాలికి అడ్డుపడి మోకాలు నేలకు ఆనునట్లు కూలబడ్డాను. అంతలో మదిలో ఒక మెరుపు మెరిసింది. మెల్లగా తలయెత్తి "ఏమిది! మయసభా భవనమున ప్రవేశించుటతోడనే యిట్టి సంఘటన జరిగినదే! మమ్ములను పరాభవించుటకై దుష్టులైన పాండవులు ఇంకనూ ఎన్ని కుయుక్తులు పన్నియుండిరో! జాగరూకత వహించెద గాక" అంటూ లేచాను.

అరెరే పడిపోయాడే! అనుకుంటూ నావైపు చూస్తున్న వారు, తేరుకొని ఎంత సంతోషించారో!

**మరొక్క సంఘటన చెప్పనా :**

నరసరావుపేట రాజావారికోటలో 'కురుక్షేత్ర' నాటక ప్రదర్శనం. శ్రీకృష్ణ పాత్రధారి ఆరాధ్యుల వెంకట సుబ్బారావు (ఎ.వి.సుబ్బారావు) గారు రాయబార ఘట్టంలో మురళీరవళిని మరిపించే మధురస్వరంలో "చెల్లియొ చెల్లకో..." అనే పద్యాన్ని ఆలపిస్తే ప్రేక్షకులు ముమ్మారు పాడించుకొని మైమరచి హర్షధ్వానాలు చేశారు.

ఆరోజూ దుర్యోధన పాత్రధారిని నేనే. ఆ సరంభంలో ప్రేక్షకులను నావేపెలా త్రిప్పుకోవాలా? అని ఒక్కక్షణం ఆలోచించి పకపక నవ్వుతూ కృష్ణుని సమీపించి. "వాసుదేవా! కపటోపాయధురీణుడవైన నీ మాయమాటలకు లోబడి అమాయకులైన మా ప్రజలు ఒకటికి మూడుమారులు నీ మాటలు వినుటకు ఉత్సహించుచున్ననూ, ఈ సుయోధన సార్వభౌముడు మాత్రము నీ మాటలకు లొంగువాడు కాడు, నిన్ను తగు విధమున సమ్మానింపకనుమానడు" అనటంతో హర్షాతిరేకంతో ఆ డైలాగ్‌ను మళ్లీ మళ్లీ చెప్పించుకొని కరతాళధ్వనులు గావించారు.

రంగస్థలం నుంచి నిష్క్రమించిన పిమ్మట శ్రీకృష్ణ పాత్రధారియైన సుబ్బారావు గారు 'ఏమి దుర్యోధనుడివి దొరికావు బావా! నా పాటకు వన్స్‌మోరైతే నీ మాటకు వన్స్‌మోరా! సభ్యులనెంత ఆకట్టుకుందో! అలా ఉండాలి ఆర్టిస్ట్ అంటే!' అంటూ ఎంత మనస్ఫూర్తిగా అభినందించారో!



**"తుర్లపాటి"**

# వేషధారి - పాత్రధారి

కోదండం పట్టినమాత్రాన శ్రీరాముడు కాలేడు.

పింఛం పెట్టిన మాత్రాన కృష్ణుడు కాలేడు.

తానేపాత్ర వహిస్తున్నాడో ఆ పాత్ర తత్వాన్ని మనసుకు పట్టించుకోనంత కాలం వేషం వేసికొని ఎన్ని ప్రదర్శనలిచ్చినా ఆ వ్యక్తి వేషధారిగానే ఉంటాడు కాని పాత్రధారి కాలేడు. అంటే తానే కన్పిస్తాడు కాని పాత్ర కనిపించదు.

నాటక ప్రదర్శనలో కావలసింది పాత్రధారులే కాని వేషధారులు కాదు. పాత్రను ప్రత్యక్షం చేయలేని వ్యక్తి ఆ పాత్రకెలా న్యాయం చేయగలుగుతాడు? ప్రేక్షకుల నెలా రంజింపజేయ గలుగుతాడు? ముఖంలో భావాన్ని పండించలేనివాడు ప్రేక్షకుల హృదయాలలో ఆనందాన్నెలా నిండించగలుగుతాడు?

కనుక పాత్రధారి కావాలి అంటే ఏం చేయాలి?

ఆ పాత్రకు సంబంధించిన అంగవర్తనం (Make-up), వస్త్రధారణం (Costume), అలంకరణ (Decoration) లతో తన రూపుమార్చుకొని తాను నిరూపించదలచుకొనిన పాత్రరూపాన్ని ఎలా పొందాడో, అలాగే తన మనస్తత్వాన్ని మఱుగుపఱచి, ఆ పాత్ర మనస్తత్వాన్ని తనకు ఆపాదించుకోవాలి.

శ్రీరాముని వేషం ధరించిన తాను శ్రీరామచంద్రుడననే భావనను పొందాలి. ఆ పాత్ర స్వభావాదులనే ప్రదర్శించాలి. వాచికం, ఆంగికం, సాత్త్వికం ఆ పాత్ర ధర్మాన్ననుసరించి ప్రకటింపబడాలి. అంటే,

ఆయా గ్రంథాలను పరిశీలించిగాని, నాటకంలోని ఆ పాత్ర వైఖరిని గమనించి గాని ఆ పాత్ర గుణగణాలను గ్రహించి రంగానికి సిద్ధంకావాలి.

శ్రీరాముడు ధీరోదాత్తుడు

ధీరశ్చ అసౌ ఉదాత్తః ధీరోదాత్తః

అంటే ధీరత్వమును ఉదాత్తత్వమును గలవాడు ధీరోదాత్తుడు అని. ధీరుడన క్లేశమును సహించువాడు. (క్లేశము = దుఃఖము) ఉదాత్తుడనగా ఆత్మశ్లాఘ లేనివాడు (శ్లాఘ = ప్రశంస, స్తుతి)

'రామో విగ్రహవాన్ ధర్మః' = రాముడు ధర్మస్వరూపుడు

'స్మితభాషీచరాఘవః' = నవ్వుతూ మాటాడువాడు

'మృదుభాషీచ రాఘవః' = లలితముగ భాషించువాడు

'పూర్వభాషీచ రాఘవః' = ముందుగనే పలుకరించువాడు

ఇలాగే మహాసత్త్వుడని, దృఢవ్రతుడని, సాధువర్తనుడని, సకల సద్గుణ సంపన్నుడని కీర్తింపబడినవాడు శ్రీరామచంద్రుడు - శ్రీరామ శబ్దమునకు చంద్ర శబ్దమును జోడించటంలోనే ఆతడెంతటి ప్రశాంత చిత్తుడో, ప్రసన్నవదనుడో స్ఫురిస్తుంది. (మఱెవరి నామమునకు చంద్రశబ్దమును చేర్చి పలుకుట కాన్పింపదు).

పై లక్షణములను దృష్టిలో ఉంచుకొని నటుడు ఆ పాత్రను ప్రదర్శిస్తే అలనాటి దాశరధిని ఈనాటి ప్రేక్షకులకు సాక్షాత్కరింపజేసినట్లౌతుంది.

అలాగే తదితర పాత్రల విషయంలోనూ ఆయా పాత్రల తత్వమును గుర్తించి వర్తించవలెను.

ఇంతకూ నే చెప్పదలచినది అర్థమయింది గదా!

వేషధారులుగానే ఉండకండి, పాత్రధారులు కండి.

**పాత్రధర్మాన్ని నిర్వర్తించండి.**

అలాగని తాదాత్మ్యం చెందకూడదు. తనను తాను మఱువరాదు. అటు పాత్ర ధర్మాన్ని నిర్వరిస్తూనే, తనను తాను మఱువకుండా ఉండటం సాధ్యమా! అనే సందిగ్ధం కొందఱికి కలుగవచ్చు. కానీ అది సాధ్యమే. అభ్యాసవశాన సాధ్యమౌతుంది. ఇది అనుభవజ్ఞులైన నటులకు సువిదితమే.

# అభినయ కళాభిజ్ఞులుగా ఎదగాలంటే అలవరచుకోవలసిన లక్షణాలు

పిరికివాడు ముందడుగు వేయలేడు.
ధైర్యవంతుడు వెనకడుగు వేయబోడు,
భీరుకుడేమీ సాధించలేడు,
ధీరుడు సాధించలేనిది లేదు.
ఇంతటి ధైర్యం ఎలా లభ్యమౌతుంది?

**ఆత్మవిశ్వాసబలంవల్ల లభిస్తుంది. ధైర్యం, స్థైర్యం ఉన్నవాడు సాహసికుడౌతాడు, సాధకుడౌతాడు.**

ఇంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే, మంచి విగ్రహం ఉండి, నటించ గలిగిన నేర్పు ఉండి, పద్యాలు, పాటలు పాడగలిగిన కమ్మని కంఠస్వరం ఉండి, రిహార్సల్స్‌లో చక్కగా వేషధర్మాన్ని నిర్వహించగలవారై ఉండికూడా, వేషం వేసికొని వేదికమీదికి వచ్చి, జనసందోహాన్ని చూచేసరికి, ముచ్చెమటలు పట్టి, గాత్రం మూగవోయి, బిత్తర చూపులు చూస్తూ అవహేళనకు లోనైన వారిని అనేకులను చూచాం. అందువల్ల ఇంతగా చెప్పవలసి వచ్చింది.

కనుక నటుడు ముందుగా ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించుకోవాలి. భీరుకత్వాన్ని విడనాడాలి. ధైర్యాన్ని గుండెనిండా నింపుకోవాలి. చంచలత్వాన్ని విడనాడాలి. స్థైర్యానికి (స్థిరత్వానికి) పీఠం వేయాలి. ఏకాగ్రమనస్కులై అంకిత భావంతో, పట్టుదలతో, శ్రద్ధాసక్తులతో అవిశ్రాంతంగా అభ్యాసం చేస్తే అద్భుతాలను సృష్టించగలరు.

"నే నీపాత్ర సమర్ధవంతంగా నిర్వహించగలను" అన్న ఆత్మవిశ్వాసం; "ఎందటి సమక్షంలోనైనా నిర్భయంగా నిస్సందేహంగా ఎలాటి భావాన్నైనా ప్రకటించగలను" అన్న ధైర్యం ఉన్ననటుడు పాత్రధారియై రంగస్థలాన ప్రవేశించి తన కళాప్రతిభను

ప్రదర్శిస్తూ అజేయమైన రీతిలో విహరిస్తుంటే ప్రజలు బ్రహ్మరథం పట్టకుండా ఎలా ఉండగలరు! ఆతని కీర్తిపతాక వారి హృదయాకాశంలో రెపరెపలాడకుండా ఎలా నిలువగలదు!

కనుక నటునకు

ఆత్మ విశ్వాసం రథమై

ధైర్యస్థైర్యాలు ధవళాశ్వాలై

కళాప్రతిభ చోదక స్థానంలో నిలిచి ఏకాగ్రతతో

సారధ్యం నెఱపుతుంటే అగ్రగామి కావటంలో

ఆశ్చర్యపడాల్సిందేమీ లేదు.

ఇంతకూ తేలిందేమిటంటే ఆత్మ విశ్వాసం, ధైర్యం, స్థైర్యం, అంకితభావం, శ్రద్ధ, ఏకాగ్రత నటుడికి ఉండవలసిన ముఖ్యలక్షణాలు అని. ఇవి అన్నీ సమగ్రంగా ఉండి నిరంతరమైన అభ్యాసం చేయాలి.

"You can improve the faculty by practice, or impair it by negligance"

అభ్యాసంవల్ల అభివృద్ధి సాధ్యమౌతుంది. నిర్లక్ష్యం వల్ల నిష్ప్రయోజన మౌతుంది అన్న మౌల్టన్ అభిప్రాయం ప్రత్యక్షరసత్యం.

"Fortune favours the brave and energetic."

ధీరులు, సమర్థులూ అయిన కార్యసాధకులనే అదృష్టం వరిస్తుంది అని అనుభవజ్ఞులయిన పెద్దల అభిప్రాయం.



# దర్శకుడు

నాటకప్రదర్శనస్థాయి, ముఖ్యంగా దర్శకుని ప్రతిభా పాటవాలపై ఆధారపడి ఉంటుంది. సునిశిత పరిశీలనాదక్షుడు, బహుముఖప్రజ్ఞాసమన్వితుడు అయిన దర్శకుడు ప్రదర్శనను ఏ కోణంలో నుండి చూచినా హృద్యంగా, అనవద్యంగా, కమనీయ మహనీయంగా రూపొందిస్తాడే కాని వ్రేలెత్తి చూపే అవకాశాన్నీయడు.

ప్రప్రథమంగా, ప్రదర్శింపబోయే నాటకాన్ని ఆమూలాగ్రంగా పఠించి, చక్కగా అవగాహన చేసుకుంటాడు. ఉన్నది ఉన్నట్లుగా ప్రదర్శిస్తే ఎంత సమయం తీసుకుంటుందో గ్రహించి, తాము ఎంత కాలపరిమితిలో ప్రదర్శింపవలసి ఉందో అందుకు తగిన విధంగా, కథాగమనానికి అంతరాయం కలుగని రీతిలో, రచయిత లక్ష్యానికి భంగం కలుగకుండేలా స్క్రిప్టును పరిమితం చేసికొని వేరే ప్రతి వ్రాసుకుంటాడు.

ఆ పిమ్మట మోమాటానికి తావీయకుండా నిష్పక్షపాత వైఖరితో ఏయే పాత్రలు ఎవరు ధరిస్తే సముచితంగా ఉంటుందో నిర్ణయించుకొని, తన నిర్ణయాన్ని ఆయా నటులకు తెలిపి, ముందుగా నాటకం మొత్తం వారి ముందు చదివి, వారి పాత్రల తత్వం, తదితర పాత్రలతో గల సంబంధం వారికి స్పష్టమయేవిధంగా వివరిస్తాడు.

స్క్రిప్టు చదువుకొని అందరూ సిద్ధమయిన తరువాత సిట్టింగ్ రిహార్సల్స్ చేయిస్తాడు. ఈ రిహార్సల్స్‌లో ఎవరి పాఠం వారు చదవటంలో మెరుగులు దిద్దటం, వాచికం విషయంలో ఎవరికైనా సందేహాలుంటే నివృత్తి చేయటం, స్పష్టంగా భావస్ఫోరకంగా పలకటానికి వలసిన మెలకువలను వారికి తేటతెల్లమయ్యేలా చదివి వినిపించి అనిపించటం, అక్షరదోషాలను అరికట్టటం జరుగుతుంది.

ఇక స్టాండింగ్ రిహార్సల్స్.

ఈ రిహార్సల్స్ నుండే యే సన్నివేశాలలో ఏయే సామగ్రినుపయోగించుకోవాలో వాటిని కూడా సిద్ధపఱచుకొని, ఆయా సన్నివేశాలను చేస్తే రంగస్థలంపైన చేసేటప్పుడు క్రొత్త అనిపించదు. అనుకోకుండానే ఆయా వస్తువులను తగిన సమయంలో అతి సహజంగా వాడుకునే అలవాటు వచ్చేస్తుంది.

రంగాలంకరణ, లైటింగ్, మైక్, నేపథ్య సంగీతం, ఆయా పాత్రల ప్రవేశం, వాచికం, అంగవిక్షేపణం, గతి ప్రచారం (నడవటం), భావ ప్రకటనం, పాత్రల నిష్క్రమణం – ఇలా అన్ని కోణాలలో తాను సిద్ధపఱచుకొనిన ప్రణాళిక ప్రకారం నడిపించి ప్రేక్షక హృదయాలను రంజింప జేయటం దర్శకుని ప్రజ్ఞా విశేషానికి, నిరంతర శ్రమైకదీక్షకు ప్రబల నిదర్శనం.

కళాప్రతిభ కలిగిన నటునకు తన పాత్ర ఎలా నటిస్తే సహజంగా, సముచితంగా ఉంటుందో ఒక అవగాహన, ఒక ఊహ ఉంటుంది. కనుక అతనిని స్వతహాగా చేయనివ్వాలి. అవసరమయితే సవరణలు చేయాలి. వారివారి ఉనికి, కదలిక ఎవరెవరికీ అడ్డంకాని విధంగా నిర్దేశించాలి.

విభిన్న మనస్తత్వాలుగల నటీనటులను ఒక్క త్రాటిపై నడిపించటానికి ఎంత చాకచక్యం ప్రదర్శించాలో, ఎంత ఓర్పు, నేర్పు వహించవలసి ఉంటుందో రిహార్సల్స్ నిర్వహించే అదనులో గమనిస్తే తెలియవలసిందే కాని విన్నమాత్రాన అర్థమయేది కాదు.

అలా వారి వారిని ఎలా తనదారిలో పెట్టుకోవాలో, తన లక్ష్యాన్ని సాధించుకోవటంలో ఎలా వినియోగించుకోవాలో తెలిసికొని మసలుకోవటం దర్శకుని తెలివి తేటలపై, తేనె మాటలపై ఆధారపడి ఉంటుంది.

## నాటక ప్రదర్శనం సమష్టి కృషి

అందరూ సహకరించి తమతమ బాధ్యతలను చిత్తశుద్ధితో, అంకిత భావంతో సక్రమంగా నిర్వహించినపుడే నాటకం విజయవంతమౌతుంది. అలా నడిపించటం దర్శకుని బాధ్యత. ఆయన కనుసన్నలలో మెలగటం నాటక సమాజ సభ్యులందరి కర్తవ్యం.

శిక్షణతోపాటు వారిని క్రమశిక్షణాబద్ధుల్ని చేయఁగలిగితేనే యిది సాధ్యమౌతుంది.

అచంచలమైన ఆత్మవిశ్వాసంతో, అకుంఠితమైన కర్తవ్యదీక్షతో ఇటు నటశ్రేణి, అటు సాంకేతిక వర్గం దర్శకుని అభీష్టం మేరకు తమ తమ కర్తవ్యాలను నిర్వహిస్తే ప్రదర్శనం అనూహ్యమైన ఫలితాన్నిస్తుందనటంలో రవంతయైనా సందేహం లేదు.

**మరొక మాట :**

రిహార్సల్స్ జరిగే సమయంలో గాని, రంగానికి సిద్ధమయే తరుణంలో గాని ఇతరుల నెవ్వరినీ లోనికనుమతించకుండా ఉంటే నటుల ఏకాగ్రతకు భంగం కలుగకుండా ఉంటుంది. ప్రదర్శన విజయవంతమౌతుంది.

"All the secret of success is to pay as much attention to the means as to the end."

"లక్ష్యంపై ఉన్నంత శ్రద్ధాసక్తుల్ని, లక్ష్యసాధనలో సైతం చూపించాలి. విజయ రహస్యమంతా ఇదే.

**- స్వామి వివేకానంద.**



**దర్శకుడు "తుర్లపాటి"**

# అనుకరణ

కళాప్రియులమైన మనం పరిసర ప్రదేశాలలో ఎక్కడ కళాత్మక ప్రదర్శన జరిగినా వెళ్లకుండా ఉండగలమా! వెళతాం, వెళ్లాలి కూడా.

ఆ ప్రదర్శనను చూచి ఆనందించటమే కాదు, కళాకారులం కనుక ఎవరెవరు వారివారి పాత్రలను పోషించటంలో తమ నటనాకౌశలాన్ని ప్రదర్శించారో, ఎవరెలాంటి లోటుపాట్లు చేశారో గ్రహించగలుగుతాం. ఇంకా ఎలా నటిస్తే బాగుంటుందో భావించగలుగుతాం. ప్రదర్శనలు చూచేకొద్దీ ఆవిధంగా ఒక విశ్లేషణాత్మకమైన దృష్టి నలవరచుకోగలుగుతాం, అనుభవాన్ని గడించగలుగుతాం.

మనం పాత్రధారణ చేయవలసి వచ్చినప్పుడు మనం గడించిన ఆ అనుభవం మనకెంతో సహకరిస్తుంది. మనలో బెరుకుతనం లేకుండా చేస్తుంది. రంగస్థలం మీద చొరవగా నటించే ఆత్మస్థైర్యాన్ని పెంచుతుంది. ప్రదర్శనలిచ్చేకొద్దీ నటనలో నేర్పరితనం పెరుగుతుంది, సులువు దొరుకుతుంది.

కనుక నాటక ప్రదర్శనలు చూడటం మంచిదే. అలా చూచి ప్రతి నటునిలోని మంచినీ గ్రహించటం అభిలషించదగిన అంశమే. అయితే, ఆ మంచిని నీ ఒరవడిలో ఒదిగేటట్లు చేసుకోవాలే కాని, ఆ పాత్రధారి నటనను యథాతథంగా అనుకరించాలనుకోవటం ఏ మాత్రం అభిలషణీయం కాదు.

అనుకరణ శీలి ఎవరినో ఒకరిని దృష్టిలో పెట్టుకొని తాను ధరించిన పాత్రను వారిలాగా చేస్తాడే తప్ప, ఎన్ని ప్రదర్శనలిచ్చినా అంతకంటె వేరేవిధంగా నటించలేడు. తనదైన సృజనాత్మక శక్తిని కోల్పోతాడు. **పదిమందిలో ఒకడుగా ఉంటాడేతప్ప ప్రథమశ్రేణిలో నిలిచే అర్హతను కోల్పోతాడు.**

అలాకాక, తాను పాత్రధారణ చేయబోయే నాటకాన్ని ఆద్యంతం క్షుణ్ణంగా చదివి, అందలి ప్రతి సన్నివేశాన్ని, ప్రతిపాత్రను నిశితంగా పరిశీలించి, చక్కగా

అవగాహన చేసికొని, తనదైన బాణీకి శ్రీకారం చుట్టి, నటించటం ప్రారంభిస్తే, ప్రదర్శనలిచ్చే కొద్దీ అనుభవం, అవగాహన పెరుగుతాయి, ఇంకా మెరుగులు దిద్దుకోవాలనే దృక్పథం ఏర్పడుతుంది.

అలా క్రమక్రమంగా ఎన్నో శిఖరాలను అధిరోహించి, ప్రేక్షకుల హృదయాలలో సుస్థిర స్థానాన్ని పొంది తన నటజీవితాన్ని సఫలం చేసికొనే తరుణం ముందు నిలుస్తుంది.

అలాంటి నటశేఖరుడు తన అనుభవాలను ముందుతరాలకు అందించి నాటకరంగాన్ని సుసంపన్నం చేయగలిగే అవకాశం కలుగుతుంది.

అనుకరణ శీలియైన నటునికి ఆ అదృష్టం దక్కే అవకాశమే లేదు.

కనుక,

**అనుకరణ శీలం అనుచితం**

**స్వతంత్ర భావనం సముచితం**

'Learn Everything that is good from others, but bring it in, and in your own way absorb it, do not become others."

'ఇతరులలోని మంచినంతటినీ గ్రహించండి. మీదయిన పద్ధతిలో దాన్ని మీలో లీనం చేసుకోండి. ఎవరినీ గ్రుడ్డిగా అనుకరించకండి.'

**- స్వామి వివేకానంద**

'సంగీత కళానిధి' శ్రీ బాలమురళీకృష్ణ గారు తన నిరంతరమైన అభ్యాసాన్ని గురించి వివరిస్తూ "ఈ నాటికీ కచేరీలు చేస్తూ ఉంటే ఇంకా ఏదో తెలుసుకోవలసి ఉంది అనే స్ఫురణ నాకు కలుగుతూ ఉంటుంది" అన్నారు.

కళాకారుడు 'నిరంతరాధ్యయన శీలియే.'



# రంగాలంకరణాది విశేషాంశాలు

పాత్రోచితమైన వేషధారణ ఎంతముఖ్యమో, సన్నివేశానుగుణమైన రంగాలంకరణ కూడ అంతే ముఖ్యం. తెరతీయటంతోనే అది సభా భవనమా, ఉద్యానవనమా, మున్యాశ్రమోపాంతమా, అరణ్యమా, నదీ పరిసరమా, పర్వత ప్రదేశమా, రణరంగ మధ్యమా అనేది సుగ్రాహ్యం కావాలి. అలాగే అది ప్రాతః కాలమా, సాయంతనమా, అర్ధరాత్రమా అనేది కూడా లైటింగ్ ఎఫెక్ట్స్ ద్వారా రూపొందించి చూపగలిగితే సభ్యహృదయాలు, ఎంతగా ఆయాదృశ్యాలను తిలకించటంలో లగ్నమైపోతాయో!

అలా, జరుగనున్న సన్నివేశానికి తగిన వాతావరణాన్ని చిత్రీకరించగలిగితే ప్రేక్షకులకెంత కుతూహలం కలుగుతుందో! అలాగే నటీనటుల మనస్సులో కూడ పాత్రయందు లగ్నమై, ఎంతో అంకిత భావంతో సందర్భానుసారంగా నటించి ఆ పాత్రకు న్యాయం చేకూర్చాలనే ఉత్సుకత రేకెత్తుతుంది. ఇది అనుభవం పలికించిన మాట.

రంగాలంకరణ అలాలేక, ఏదో ఒక తెరపై మాత్రమే చేయవలసివచ్చినప్పుడు ఆ దృశ్యాన్ని ప్రేక్షకులకు అనుభూతం చేయటానికి నటుడు అధికంగా శ్రమించ వలసి వస్తుంది.

ఏమైనా, దృశ్యం దృగ్గోచరమైనపుడున్న తీరేవేఱు. నేను మొట్టమొదటగా ప్రముఖ రంగస్థలనటులు పి. సూరిబాబుగారి నాటక ప్రదర్శనలు చూచాను. వారి 'భూకైలాస్' నాటకంలో నారదుడు దైవ సంకీర్తనం చేసుకుంటూ ఆకాశమార్గాన పయనించటం, శేషపాన్పుపై శయనించియుండిన విష్ణువు లేచి పూలమాలలతో అలంకరింపబడిన ద్వారాల నుండి ముందుకు రావటం, రావణబ్రహ్మ పూనికతో ఎత్తేకొద్ది అంతకంతకూ పెరిగిపోతూ ఉండిన శివలింగం మొదలుగా గల దృశ్యాలు నా మనసును ఆశ్చర్య చకితంచేశాయి, ఆనందమగ్నం చేశాయి. ఇప్పటికీ తలచుకొనే కొద్ది నా మన సాదృశ్యాలకు పునరంకితమైపోతుందంటే కించిన్మాత్రం కూడ అతిశయోక్తి లేదు.

అలాగే నా మనసు నాకట్టుకొన్న మఱొక దృశ్యం వారి 'తారాశశాంకం' నాటకంలోని మున్యాశ్రమ ప్రశాంత వాతావరణం. వృక్షాలకు అల్లుకొని ఉండిన పూదీవెలు, నిజమైన ఆశ్రమంలో లాగానే ఆ తలుపులు తీసికొని పాత్రధారులు రావటం, అలాగే లోనికి వెళ్లటం సహజమైనవిగానే భ్రమింపజేస్తూ ఆహ్లాదపఱచాయి.

అలాగే సురభి లీలాపాపారావుగారి 'షిరిడి సాయిబాబా' నాటకంలో బాబావారు సటకాతో అలా స్పృశించినంతలోనే నిప్పురావటం, నీరు పొంగటం లాంటి అద్భుతాలు నన్నెంతో ఆకర్షించాయి.

కనుక అలంకరణలు, అద్భుతాలు నాటక సందర్శనేచ్ఛను ఇనుమడింప చేయటానికి ఎంతో దోహదం చేస్తాయనటంలో సందేహం లేదు.

మేము నాటక ప్రదర్శనలివ్వటం ప్రారంభించిన తరువాత కూడ వెనుక తెర ముందు తెరలతోనే ప్రదర్శనలిచ్చాం. మేము ప్రదర్శించినవి ఎక్కువగా కాంట్రాక్ట్ నాటకాలు కావటంతో రంగాలంకరణ, వారి యేర్పాటు మీదనే ఆధారపడి ఉండేది.

కొన్ని పెద్ద సంస్థలవారు మాత్రం నటీనటులను వారే ఎంపిక చేసికొని ప్రదర్శనలను ఏర్పాటు చేసేవారు. వారే రంగస్థలాలంకరణను ఎంతో శ్రద్ధగా ఏర్పాటు చేయించేవారు.

అలాటి నాటకాలలో నన్ను మిక్కిలిగ ఆకర్షించినది విశాఖ పట్టణం షిప్‌యార్డు వారు ఏర్పాటు చేసిన నాటకం. ప్రదర్శన రోజు ఉదయం రంగస్థలం చూడటానికి ఆర్టిస్టుల మందఱం వెళ్లాం. అలంకరణ చేసే నిపుణులు సన్నివేశక్రమం, ఏయే సన్నివేశాలలో ఏమేంకావాలో మమ్ములను అడిగి తెలుసుకున్నారు.

ప్రదర్శన నిమిత్తం సాయంకాలం 7 గంటలకు అక్కడకు చేరి చూతుము గదా! వారు రూపొందించిన అద్భుతావహమైన సన్నివేశ దృశ్యాలను చూచి 'మనం ప్రొద్దునవచ్చి చూచిన చోటికే వచ్చామా! ఏమైనా పొరపాటు పడ్డామా!' అన్నంత ఆశ్చర్యానికి లోనయాం.

నేను సుయోధన పాత్రలో మయసభలో ప్రవేశించి ఆ సాలభంజికలు, ఉద్యానవనం, విద్యుత్కాంతి ప్రసారంతో ఏర్పాటైన సరోవరం, ద్వారం ఉన్నట్లు భ్రమింపజేసే చిత్రణ కలిగిన కుడ్యభాగం మొదలుగా గల దృశ్యాలు తిలకిస్తూ

ఉప్పొంగిన ఆశ్చర్యంతో నిజంగానే దుర్యోధనుణ్ణైపోయానంటే నమ్మండి. ఇరువురు నాట్యకత్తెలు అలా నాట్యంచేస్తూ 'స్వాగతం సుస్వాగతం' అనే పాటనందుకొని, పూలజల్లు కురిపిస్తూ ఆహ్వానిస్తుంటే ఎంత హుందాగా నడిచానో, ఎన్ని భంగిమలిచ్చానో, ఎంత అచ్చెరువును ప్రకటించానో మిన్నంటే విధంగా హర్షధ్వానాలు చేస్తూ తమ ఆనందాతిరేకాన్ని వెలువరించిన ఆ ప్రేక్షకులకే తెలియాలి.

మా నటమిత్రులు కురిటి సత్యంనాయుడుగారు, ఆ దృశ్యం యిప్పటికి కనులముందు మెదలుతుంటుందని చెప్పి ముచ్చట పడుతుంటారు. అది సన్నివేశాన్ని అద్భుతావహంగా చిత్రించటంవల్ల కలిగిన మఱువరాని మహత్తరదృశ్యకల్పనా విశేష ఫలితం.

అలాగే నంది నాటక మహోత్సవాలలో దీక్షిత్ డి.యస్. గారి దర్శకత్వంలో గుమ్మడి గోపాలకృష్ణగారి శ్రీకృష్ణ పాత్రధారణతో ప్రదర్శింపబడిన "శ్రీకృష్ణ తులాభారం" చూచి రసవత్తరంగా ప్రదర్శింపబడిన ఆ నాటకంలోని దృశ్యనిర్మాణచాతురికి చకచ్చకితుణ్ణైపోయాను.

అలాగే వెనుకటి రోజుల్లో సుప్రసిద్ధులు వల్లూరి వెంకట్రామయ్య చౌదరిగారు, వేమవరపు శ్రీధరరావుగారు, బి.యన్. సూరి మొదలగువారు తమ సమాజ నాటక ప్రదర్శనలలో ఎలాంటి అద్భుతాలు సృష్టించేవారో తలచుకుంటుంటే నా దృష్టి అప్పటి రోజులలోకి వెళ్లిపోతుంది.

ఈ మధ్య తిరుపతిలో ప్రపంచ తెలుగు మహాసభలలో సురభివారి 'పాతాళ భైరవి' నాటకం చూచాను. అంతలోనే రాజభవనం, అంతలోనే అరణ్య ప్రదేశం, ఇలా కన్నుమూసి కన్ను తెరిచే అంతలో కర్టెన్స్ మార్చటం, ఆకాశమార్గాన "మాయా మహల్" వెళుతూ ఉండటం చూచి ఎంత అబ్బురమందానో!

అలాగే కోటముందు వీధి వాతారణాన్ని స్ఫురింపజేయటం కోసం, అటూయిటూ రకరకాల జనం తిరుగుతూ ఉండటం చూపారు సరికదా! చిన్న చిన్న పిల్లలు ఎంతో హుషారుగా పల్టీలు కొడుతూ ఆడుకోవటం చూపించిన తీరు కాంచి నేను, నా ప్రక్కనే కూర్చొనియుండిన మిత్రులు కందిమళ్ల సాంబశివరావు గారు ఎంత ముచ్చటపడ్డామో!

దీనిని బట్టి నాటకప్రదర్శనం రక్తికట్టడానికి నటీనటుల నటనా సామర్థ్యానికి దోహదంగా రంగాలంకరణ విషయంలోను, అటు అద్భుతదృశ్యాలను చూపటంలోను, ఇటు సహజత్వాన్ని రూపొందించటంలోను మనమెంత విశేషమయిన శ్రద్ధతీసుకోవలసి ఉంటుందో ఇలాంటి దృశ్యాలు చూచినమీదట స్పష్టమవుతుంది.

అలాగే ఆయా సన్నివేశాలలో ఎక్కడ ఏయే సామగ్రినమర్చి ఉంచాలో, ఏ సమయంలో నటుడు లోనికి వెళ్లి ఏయే వస్తువులను రంగస్థలిపైకి తీసుకు రావలసి ఉంటుందో, సాహాయ్యకులుగా నియమింపబడిన వారికి క్షుణ్ణంగా తెలిసి ఉండాలి. తెలిసినవారైతేనే సమయానికి సిద్ధంగా ఉంచి అందించగలుగుతారు.

మేము మా సంగీతదర్శకులు రామానుజసూరిగారి పలనాటియుద్ధ ప్రదర్శనలో అలరాజుకు విషమిచ్చే దృశ్యంలో, యుద్ధరంగంలో నరసింగరాజు శిరస్సును రక్తమోడుతూ ఉండినట్లు సిద్ధంచేసి బాలచంద్రుని కందించటానికి ఒక కుఱ్ఱవానిని నియమించి ఉంచే వాళ్లం.

చెన్నైలాంటి మహానగరంలో కూడా బాలచంద్ర పాత్రధారి (గుమ్మడి జైరాజ్) విజయోత్సాహంతో గర్జిస్తూ ఆ శిరస్సును జుట్టుపట్టుకొని రంగంలోనికి దుమికితే మొదటి వరుసలో ఉండిన ప్రేక్షకులు భయంతో వెఱ్ఱి కేకలువేస్తూ ఎగిరి దుమికి వెనుకకు పరుగెత్తారంటే, ఆ దృశ్యం ఎంత భయానకంగా ఉండి ఉంటుందో ఊహించండి.

అలాగే లైటింగ్ వారు కూడా ఎక్కడెక్కడ ఎలాంటి లైట్స్ ఫోకస్ చేయాలో తెలిసి చేస్తే దాని ఎఫెక్ట్ వేరుగా ఉంటుంది.

అలాగే రంగాలంకరణ మొదలుగా, సందర్భానుసారంగా నేపథ్యం నుంచి వినిపించవలసిన ధ్వనులు (చప్పట్లు, డెక్కల చప్పుడు, గజఘీంకారాలు, కత్తుల ఒరపిడి మొదలగునవి) ప్రదర్శనాంశాలను ప్రేక్షక హృదయాలకు హత్తుకొనేటట్లు చేయటానికి ఎంతగానో సహకరిస్తాయి.

నాటకాన్ని అన్ని కోణాలలో ఎన్నదగిన విధంగా రూపొందించటం దర్శకుడు, సాంకేతిక నిపుణులు, సాహాయ్యకులు, నటీనటుల అంకితభావానికి నిదర్శనమై నిలుస్తుంది.

# ఉచ్చారణ - దోషాలు

చిన్ననాడు చదువుకొనే అవకాశం అందఱికీ లేకపోవచ్చు. అలాటి నటీనటులను విజ్ఞులయిన దర్శకులు, సాహితీవేత్తలు తీర్చిదిద్దటం తమ బాధ్యతగా స్వీకరించవలసియున్నది.

నా అనుభవంలో అటు రంగస్థలం మీద ఇటు లోకవ్యవహారంలో నేను విన్న శబ్దదోషాలను వివరించటం మంచిదనిపించి జ్ఞప్తి ఉన్నంతమేరకు ఈ క్రింద ఉదహరిస్తున్నాను. సహృదయంతో పరికించగలరని ఆశిస్తున్నాను.

శబ్ద పరిజ్ఞానం లేకపోవటంవల్లగాని, అజాగ్రత్త వల్లగాని ఒత్తులున్నచోట లేకుండా పలకటం, ఒత్తులు లేని తావులలో ఒత్తులు పలకటం జరుగుతూ ఉంటుంది. అలాగే దీర్ఘంలేనిచోట ఉన్నట్లు పలకటం. ద్విత్వము లేనిచోట ద్విత్వమున్నట్లు పలకటం కూడా జరుగుతుంటాయి.

(ద్విత్వమంటే ఒక అక్షరం క్రింద అదే ఒత్తు ఉంచటం 'ద్ద', 'న్న' ఇలాంటివి)

| తప్పు | ఒప్పు |
|---|---|
| అంబోధి | అంభోధి = సముద్రము |
| అంభుధి | అంబుధి = సముద్రము |
| అధిష్టించు | అధిష్ఠించు = ఆశ్రయించియుండు |
| అబేధ్యము | అభేద్యము = వేఱుచేయుటకు వీలు కానిది |
| అవస్త | అవస్థ = స్థితి |
| ఉచ్ఛము | ఉచ్చము = ఉన్నతము |
| కనిష్టుడు | కనిష్ఠుడు = చిన్నవాడు |
| క్షోప | క్షోభ = కలత |
| గరిష్టము | గరిష్ఠము = మిక్కిలి గొప్పది |
| గోష్టి | గోష్ఠి = సభ, సల్లాపము |

| | |
|---|---|
| జేష్టుడు | జ్యేష్ఠుడు = అగ్రజుడు, పెద్దవాడు |
| దవష్టము | దవిష్ఠము = మిక్కిలి దూరము |
| ద్రౌపతి | ద్రౌపది = ద్రుపదుని కూతురు |
| ధోవతి | దోవతి = వస్త్రము |
| ధనుర్దరుడు | ధనుర్ధరుడు = విల్లుపట్టిన వాడు |
| ధృడము | దృఢము = గట్టి |
| నిష్ట | నిష్ఠ = ఉనికి, స్థిరము |
| నిష్టూరము | నిష్ఠురము = కఠినము |
| పాలాక్షుడు | ఫాలాక్షుడు = శివుడు |
| ప్రగల్బములు | ప్రగల్భములు = గొప్పలు పలుకుట |
| ప్రతిష్ట | ప్రతిష్ఠ = గౌరవము |
| బంధుగులు | బందుగులు = చుట్టములు |
| భాద | బాధ = దుఃఖము |
| భాధ్యత | బాధ్యత = బాధ్యత్వము, తాను చేయునది అంగీకరించుట |
| భోదించు | బోధించు = తెలియచేయు |
| బక్ష్యము | భక్ష్యము = తినదగినది |
| బిక్షాటనము | భిక్షాటనము = బిచ్చమెత్తుకొనుట |
| మధాందుడు | మదాంధుడు = మదముచేత గ్రుడ్డివాడు |
| మధిర | మదిర = మద్యము |
| విజృంబించు | విజృంభించు = చెలరేగు |
| విధ్యార్థి | విద్యార్థి = చదువుకొనువాడు |
| వైఢూర్యము | వైడూర్యము = వైడూర్యము అను పేరుగల రత్నము |
| స్కందము | స్కంధము = చెట్టుబోదె, యుద్ధము |
| స్వార్దము | స్వార్థము = తనకొఱకైనది |
| స్నిగ్దము | స్నిగ్ధము = నునుపైనది |
| సౌష్టవం | సౌష్ఠవము = నాట్యాంగ విశేషము, సుష్ఠు భావము |

| | |
|---|---|
| జగదాంబ | జగదంబ = జగమునకు తల్లి జగజ్జనని |
| దురూక్తి | దురుక్తి = చెడ్డమాట |
| ఫలహారము | ఫలాహారము = పండ్లతోడి ఆహారము |
| శివన్నారాయణ | శివనారాయణ = శివుడు నారాయణుడు ఇరువురి నామములతో పేరు. |

ఒత్తి పలకటంవల్ల ఒక అర్థం, ఒత్తు లేకుండా పలకటంవల్ల వేరొక అర్థం వచ్చే పదాలు ఉన్నై. వాటిని ఎక్కడ ఏ పదాన్ని వాడాలో తెలిసికొని మరీ ఉపయోగించాలి.

సామాన్యంగా కొందఱికి ఒత్తిపలికే అలవాటుంటుంది. ఇలాంటి పొరపాట్లు వారివల్లనే ఎక్కువగా జరుగుతూ ఉంటాయి.

"నిన్న శాస్త్రిగారి షష్ఠిపూర్తి ఎంతో ఘనంగా జరిగిందండీ" అన్నారొక పండితులవారు. అయితే యీ పొరపాటు వారికి తెలియక జరిగింది కాదు. ఒత్తి పలికే అలవాటు అలా చేసింది. అందుకే కాబోలు "ప్రమాదో ధీమతామపి" అంటారు. తెలిసిచేసినా, తెలియక చేసినా తప్పు తప్పే కదా!

"ఇంతకూ ఆ తప్పేమిటండీ" అంటారా?

షష్ఠిపూర్తి అనకూడదు. షష్టిపూర్తి అనాలి.

షష్ఠి అంటే ఆరు. షష్టి అంటే అరవై.

అరువది యేండ్లు పూర్తయినప్పుడు జరిపే ఉత్సవాన్ని యేమనాలి?

'షష్టిపూర్తి' అనేగా! అదేమరి. ఇలాగే ఒత్తివ్వటం వల్ల ఒక అర్థం, ఒత్తు లేకుంటే మరొక అర్థంవచ్చేవి మఱికొన్ని.

| | |
|---|---|
| బావి = నుయ్యి | భావి = భవిష్యత్కాలము |
| కరము = చేయి, మిక్కిలి | ఖరము = గాడిద |
| కాళి = పార్వతి | ఖాళి = శూన్యము |

| | |
|---|---|
| పలితము = నరసినది | ఫలితము = ఫలించినది, నెరవేరినది |
| కలము = లేఖని | ఖలము = క్రూరము, నీచము, పాపము |
| దార = భార్య | ధార = ప్రవాహము |
| దాత = ఇచ్చువాడు | ధాత = బ్రహ్మ |

ఇలాటిదే మఱొకటి చెప్పనా!

మనం పనిమీద యే పట్టణమో వెళ్లినప్పుడు పనులన్నీ చూచుకొని భోజనం చేయటానికి దగ్గరలో ఉన్న భోజనశాలకు వెళతాం. అక్కడ పెద్దబోర్డు కనబడుతుంది. ఏమని?

"శాఖాహార భోజనశాల" అని. శాఖాహారమేమిటండీ? శాఖలు అంటే కొమ్మలు అని అర్థం. అంటేవారు అన్నంతోపాటు కొమ్మలు కూడా వడ్డిస్తారా యేమిటి?

ఇంతకూ వారి ఉద్దేశ్యమేమిటంటే "శాకాహారము" అని. శాకములు = ఆకులు. కనుక ఆకు కూరలతోడి భోజనము అని. చూచారా! ఒక్క అక్షరం మారినమాత్రాన అర్థమే మారిపోయింది గదూ!

ఇలాగే అక్షరంమారితే అర్థం మారిపోయే పదాలు ఎన్నో ఉన్నాయి. కనుక మనం పదాలను ఉచ్చరించటంలో ఎంతో జాగరూకత వహించాలి.

ఇలాంటివెన్నో పదదోషాలో, సమాసదోషాలో నిత్యవ్యవహారంలో వినిపిస్తూనే ఉంటాయి. మొన్న ఏమీతోచక మా స్నేహితుడింటికెళ్ళాను. "అరె, నువ్వేవచ్చావా! వెతకబోయినతీగ కాలికి తగినట్లయింది. నేనే నీకోసం వద్దామనుకుంటున్నాను. నువ్వు తెలుగు మాస్టారు గదా! మావాడు తెలుగులో శుద్ధ తప్పులు రాస్తున్నాడురా. వాణ్ణి నువ్వే కాస్త దోవలో పెట్టాలి" అన్నాడు.

చూచారా! తన కొడుకు తప్పులు వ్రాస్తున్నాడని చెప్పటానికి వీడు 'శుద్ధతప్పు' చేశాడు. ఆ తప్పేమిటంటారా! "శుద్ధతప్పే" తప్పు. 'శుద్ధ' సంస్కృత పదం, 'తప్పు' తెలుగు పదం. ఆరెండిటిని కలిపి సమాసం చేయరాదు. 'శుద్ధ తప్పు' తప్పేగా మరి! ఇక ఒక్క అక్షరం మారటం వల్ల పదాల అర్థాలు ఎలా మారతాయో మరికొన్ని పరిశీలించుదాం.

అగము = కొండ, చెట్టు, పాము   అఘము = పాపము
అడగు = తగ్గు   అడుగు = పాదము, ప్రశ్నించు, యాచించు ప్రార్థించు
అడరు = అతిశయించు   అడలు = శోకించు
అత్యంతము = తుట్టతుద   ఆద్యంతము = మొదటి నుండి చివరి వఱకు
అనలము = అగ్ని   అనిలము = గాలి
ఆలానము = ఏనుగుకట్టు స్తంభము   ఆలాపము = నిందుమాట, రాగముతీయుట
ఆశ్రమము = పర్ణశాల   ఆశ్రయము = అండ, ఇల్లు
ఆసాంతము = చివరి వఱకు   ఆశాంతము = దిగంతము
ఇల్లు = గృహము   విల్లు = ధనువు
ఈహ = కోరిక   ఊహ = తలచు, భావించు
ఉక్తి = మాట   యుక్తి = ఉపాయము
ఒండు = ఒకటి   వండు = వంటచేయు
ఒడలు = దేహము   వడలు = వాడిపోవు, భక్ష్యవిశేషములు
ఒడి = తొడపై భాగము   వడి = వేగము
కందరము = గుహ   కంధరము = మెడ
కంది = ధాన్యవిశేషము   కంధి = సముద్రము
కంప = ముండ్లమండ   గంప = వెదురుబద్దలతో అల్లినది
కటిక = మాంసమమ్మువాడు   కటికి = అధికమైన
కట్టు = బంధము   గట్టు = తీరము
కడ = అంతము   గడ = నిడువైనకోల
కడగు = యత్నించు   కడుగు = ప్రక్షాళనము చేయు, నీటితో కడుగు, శుభ్రము చేయు.
కతము = కారణము   గతము = జరిగిపోయిన కాలము
కదనము = యుద్ధము   కథనము = చెప్పుట
కల = స్వప్నము, శిల్పము   కళ = శిల్పము
కల్లు = మద్యము, ఱాయి   కళ్లు = కన్నులు

| | |
|---|---|
| కసరు = కోపించు | కసురు = లేతకాయ, పిందె |
| కళ్లము = ధాన్యమునుతిచెడిచోటు | కళ్లెము = గుఱ్ఱమునోట తగిలించునది. |
| కాలము = సమయము | గాలము = చేపలు పట్టు సాధనము |
| కాలుడు = యముడు, శివుడు,శని | కాళియుడు = సర్పవిశేషము |
| కింకరుడు = పరిచారకుడు | శంకరుడు = శివుడు |
| కుటీరము = గుడిసె | కోటీరము = కిరీటము |
| | కోటరము = చెట్టుతొఱ్ఱ |
| కోల = దండము | గోల = రొద |
| గుబిలి = కర్ణ మలము | గుబులు = భయము |
| ఘర్మము = చెమట | కర్మము = పని |
| చేలి = శీతలము | చెలి = స్నేహితురాలు |
| చేవి = రుచి | చెవి = శ్రవణము, కర్ణము |
| చాపము = విల్లు | శాపము = తిట్టు |
| చీమ = పిపీలిక | సీమ = ప్రదేశము |
| చీరు = పిలుచు, చీలుచు | చేరు = సమీపించు |
| చెఱుపు = కీడు | చెఱువు = తటాకము |
| చేరు = సమీపించు | శేరు = పరిమాణము |
| చేందము = విధము, ఛందస్సు | ఛందము = పద్య లక్షణము |
| చేంపు = వధించు | జేంపు = సన్నని |
| తపస్సు = తపము | తమస్సు = చీకటి |
| తరంగము = అల | తురంగము = గుఱ్ఱము |
| తరణి = సూర్యుడు | తరుణి = స్త్రీ |
| తరణము = దాటుట | తరుణము = సమయము |
| తఱచు = మిక్కిలి | తరుచు = చిలుకు |
| తఱి = సమయము | దరి = గట్టు |
| తరువు = చెట్టు | దరువు = తాళము |
| తలపు = భావన | తలుపు = కవాటము |

| | |
|---|---|
| త్రాచు = సర్పము | త్రాసు = తూచెడు తుల |
| తురంగము = గుఱ్ఱము | కురంగము = జింక |
| దక్కు = లభించు | తక్కు = మిగులు |
| దడి = ఏర్పఱచినమఱుగు | తడి = తేమ |
| దామము = హారము | ధామము = ఇల్లు |
| దార = పెండ్లాము | తార = నక్షత్రము, కనుగ్రుడ్డు |
| ధరణి = భూమి | తరణి = సూర్యుడు |
| నగము = కొండ | నాగము = పాము, ఏనుగు, కొండ |
| నాణెము = ముద్రింపబడిన బిళ్ల | నాణ్యము = శ్రేష్ఠము |
| నితాంతము = అధికము | నిశాంతము = ఇల్లు, వేకువ |
| నియోగము = ఆజ్ఞ | వియోగము = ఎడబాటు |
| నిరోధము = అడ్డు | విరోధము = పగ |
| పణము = పందెము | ఫణము = పాముపడగ |
| పథము = మార్గము | పదము= స్థానము, పాదము, శబ్దము |
| పన్నగము = పాము | పన్నాగము = పల్లకి మీద కప్పు |
| పరిక్రమించు = విహరించు | పరిశ్రమించు = కష్టపడు, అలసటచెందు |
| పరిణామము = మార్పుచెందుట | పరిమాణము = కొలత |
| పల్లు = దంతము, పల్లము | పన్ను = కప్పము |
| పాములు = సర్పములు | బాములు = బాధలు |
| పారువము = పావురము | వావురము = అశ్వము |
| పిండి = బియ్యములోనగు వానిపొడి | పిండు = సమూహము, పితుకు |
| ప్రచారము = సంచారము | ప్రసారము = వ్యాపనము |
| ప్రణయము = ప్రేమ | ప్రళయము = కల్పాంతము, అపాయము |
| ప్రణామము = నమస్కారము | ప్రమాణము = సత్యము |
| ప్రమోదము = సంతసము | ప్రమాదము = ఏమఱుపాటు |
| బిట్టు = శీఘ్రము | బెట్టు = అతిశయము |
| మందిరము = ఇల్లు | మందురము = అశ్వశాల |

| | |
|---|---|
| మఖము = యజ్ఞము | ముఖము = మొగము |
| మరుగు = పరిచితమగు | మఱుగు = చాటు |
| యోచనము = ఆలోచన | యోజనము = ఆమడ |
| రవడి = అప్పు | రవళి = ధ్వని |
| సాంత్వము = మధురమైనది | స్వాంతము = మనస్సు |
| సమ్మె = కట్టుబాటు | సెమ్మె = దీపస్తంభము |

ఇలాగే శబ్ద స్వరూపం సరిగా తెలియకపోవటం వల్ల అనేక విధాలుగా తప్పులు దొర్లుతుంటాయి. అలాంటివి చూతమా!

| తప్పు | ఒప్పు |
|---|---|
| అయిష్టము | అనిష్టము |
| క్రిష్ణ | కృష్ణ |
| భీభత్సం | బీభత్సం |
| తెలవదు | తెలియదు |
| మధుసూధనుడు | మధుసూదనుడు |
| మల్లిఖార్జునుడు | మల్లికార్జునుడు |
| మిట్ట మధ్యాహ్నము | మట్టమధ్యాహ్నము |
| వాయిద్యము | వాద్యము |
| శృతి | శ్రుతి |
| సమిష్టి | సమష్టి |

మరొక్క విషయము - చ, శ, ష, స అను అక్షరముల ఉత్పత్తిస్థానములు బహుసామీప్యములగుటచే తగుజాగరూకత వహింపకుండిన ఒక అక్షరము స్థానమున వేరొక యక్షరము దొరలెడి అవకాశములేకపోలేదు. అట్టి యెడ అర్థము మారుటయో, అర్థరహితమగుటయో జరుగును. ఉదాహరణకు చూలి అనవలసినచోట శూలి అని పొరపాటుగ పలికినచో అర్థము మారును. చూలి అనగా బిడ్డ, శూలి అనగా శివుడు అర్థమే మారిపోయినదిగదా అట్లే చరణము అనవలసిన చోట శరణము అనినచో అర్థము మారిపోవును.

చరణము = పాదము

శరణము = రక్షకము

ఇట్లే శ్రుతి – స్మృతి (శ్రుతి = చెవి, స్మృతి = త్రోవ)

శ్రవణము – స్రవణము (శ్రవణము = వినికిడి, స్రవణము = కారుట) ఇట్టివనేకములు దొరలునవకాశము కలదు. కనుక పలుకుటయందు జాగరూకత వహించవలెను. ఇట్లే అంశుమంతుడు అను పదమును అంసుమంతుడు అను విధమున పలికినచో అర్థరహితమగును.

తెలుగులో సంస్కృతపదాలు కూడా కలిసి ఉన్నాయి కనుక సంస్కృత భాషా సంప్రదాయాలు కూడా మనకు తెలియాలి. కొన్ని పదాలలోని సంయుక్తములు వ్రాసినట్లుగాక మరియొక విధముగ మాటాడే విధానం కూడా ఉంది. అది తెలిసికొని ఉచ్చరించవలెను.

**ఉదాహరణ :** అపరాహ్ణము అని వ్రాయటం జరుగుతుంది. కాని అపరాణ్హము అని చదువవలెను. అట్లే మధ్యాహ్నము అని వ్రాసి మధ్యాన్హము అని చదువవలెను. అలాటివే వహ్ని, బ్రహ్మ, మున్నగు పదములు. వీటినన్నిటిని దృష్టిలో పెట్టుకొని ఉచ్చారణలో దోషములు రాకుండ చూచుకొనవలెను. ఇలాటివి గురుముఖతః గ్రహించుట మంచిది.

ప్రస్తుతం ప్రచురంగా ప్రదర్శింపబడుతున్న నాటకాలలో కొన్నింటిని స్వీకరించి, ప్రదర్శనలలో సామాన్యంగా దొరలుతూ ఉండే దొసగులను సరిదిద్దుకుందాం.

శ్రీ తిరుపతి వేంకటకవుల నాటకాలలో బహుళంగా ప్రదర్శింపబడి ప్రజాదరణకు పాత్రములయినవి.



1. పాండవోద్యోగము, 2. పాండవ విజయము.

**పాండవోద్యోగ ప్రదర్శనలు** - కొన్ని ఉదాహరణలు, సవరణలు.

(పద్యాలలో విరామమీయవలసిన స్థానాలు నిలువగీట్లతో సూచింపబడినవి గమనించగలరు)

## పాండవోద్యోగము - ప్రథమాంకము

"ద్రుపదుని పంపునంజనె పురోహితుడు । ఆ ధృతరాష్ట్రసూతి బల్
కపటి । వినందు । సంధిచెడగా గమకించెదుగాని । తప్ప దా
లపుఁబని । సర్వమున్ గడపు లావుగలందు యశోదపట్టి । ఆ
రిపుజన కాలు । తోడుగ వరించెద । సర్వము నిర్వహించెదన్."

ఇందులో 'తప్పదాలపుబని' అనవలసిన తావున "తప్ప దాలపుంబని" అని పఠిస్తున్నారు.

తప్ప దాలపుంబని ✗ తప్పదాలపుఁబని ✓

'తప్పదాలపుంబని' అనిన యెడల ఛందోభంగమగును.

**తరవాతి పద్యం**

"అదిగో ద్వారక । ఆలమందలవిగో అందందు గోరాడు । అ
య్యదియేకోట । అదే అగడ్త । అవెరధ్యల్ । వారలే యాదవుల్ ।
యదుసింహుండు వసించుమేడ అదిగో । ఆలానదంతావళా
భ్యుదయంబై । వరమందురాంతర తురంగోచ్చండమైపర్వెడిన్."

ఈ పద్యంలో 'అయ్యదియే కోట' అంటూ చూపించవలసిన యెత్తులో చూపటం సరియైన ఆంగికమే. కాని, ఆ వెంటనే 'అదే అగడ్త' అంటూ అదే యెత్తులో చూపటం సరికాదు. 'అగడ్త' అంటే కోట ప్రాకారంచుట్టూ త్రవ్వి నీరునింపబడిన కందకం కనుక భూతల సమస్థానంలోనే చూపాలి. ఆ తరువాత,

'వరమందురాంతర' అన్నచోట 'మందుర' శబ్దం తప్పుగా భావించి 'మందిర' అని పఠిస్తున్నారు. ఇక్కడ

మందిరాంతర ✗ మందురాంతర ✓

మందురము అంటే అశ్వశాల

**అర్జునుని మఱొక పద్యం :**

"అరవిందాక్షుడు । శేషశాయి । జగదేకారాధ్యుడు । అంభోధిజా
వరుడు । ఆర్తావనుడు । అంగజాంగజుడు । శ్రీవత్సాంకుడు । ఏమో నిరం
తరనిర్నిద్రుడు నిద్రజెందెడిపవల్ । తచ్ఛీర్షపుం బ్రక్కన । అ
క్కురునాథుండదెకూరుచుండె తళుకుల్ కుల్కంగ । పీఠంబునన్"

ఈ పద్యంలో "ఏమో నిరంతర నిర్నిద్రుడు నిద్రజెందెడి పవల్" అనే పదాలను మధ్య విరామమిచ్చి వేర్వేరుగా పలకటం సరికాదు. ఎప్పుడూ నిద్ర లేనటువంటి స్వామి పగలు నిద్రపోతున్నాడేమిటి! అని ఆశ్చర్యం.

కనుక 'ఏమో నిరంతర నిర్నిద్రుడు నిద్రజెందెడిపవల్' అంతవఱకు మధ్య విరామం లేకుండా పలకాలి. ఎలా? ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ. తరువాత ఇందులోనే అంభోధిజావరుడు అన్నతావున అంబోధిజావరుడు అంటున్నారు

అంబోధిజావరుడు ✗ అంభోధిజావరుడు ✓

**శ్రీకృష్ణుని పద్యం :**

"నీవచ్చిన పనిదెల్పి । ము
దావహుడవుగమ్ము నాకు । అఖిలావని పా
లావళి మౌళిమణీ సం
భావిత చరణుడవు । నీవువచ్చుట అసదే."

ఈ పద్యంలో "అఖిలావని పాలావళి..." అనే సమాసంలో "అఖిలావని పాలావని..." అని పఠిస్తున్న వారున్నారు. "అఖిలావని పాలావళి" అంటే సర్వభూపాల సమూహము అని అర్థం. కనుక

అఖిలావనిపాలావని ✗ అఖిలావనిపాలావళి ✓

**దుర్యోధనుని పద్యం**

"కౌరవపాండవుల్ పెనగుకాలము చేరువయయ్యె, । మాకును, అ
వ్వారికి గూడ ఎక్కుడగు బంధుసముద్రుడ వీవుగాన । నీ
చేరిక మాకు నిర్వురకు సేమము గూర్చెడిదౌట । సాయమున్
గోరగ నేగుదెంచితిమి । గోపకులైక శిరోవిభూషణా!"

ఈ పద్యం తుదినిగల 'గోపకులైక శిరోవిభూషణా!' సంబోధనార్థక సమాసాన్ని 'గోపకులైక' అని విరామమిచ్చి 'శిరోవిభూషణా' అని చదువుతున్నారు. అది సరికాదు.

గోపకులైక । శిరోవిభూషణా ✗

గోపకులైకశిరోవిభూషణా! ✓ కలిపే చదవాలి.

**ఇదీ దుర్యోధనుని పద్యమే :**

"ఇరువురకు సముడవగు నిన్ను ।
అరసితినే ప్రప్రథమమునందు । అటు గానన్ ।
సరసిజలోచన । నాకున్
కరమనుకూలుడవు గమ్ము కయ్యమ్మునెడన్"

పై విధంగా విభజించి పఠించటం సరియైన పద్ధతి.

**శ్రీకృష్ణుని పద్యం :**

"యుద్ధమొనరింత్రు వారలు । అ
బద్ధమ్మొందులకు, నేను పరమాప్తుడనై
యుద్ధమ్ముత్రోవబోవక ।
బుద్ధికి దోచిన సహాయమును బొనరింతున్"

పై నిలుపుగీట్లుంచిన విరామములు సరియైనవి. అలా కాక,

"యుద్ధమొనరింత్రు వారల
బద్ధమ్మేందులకు ..............."

అని కలిపి అనటం సరికాదు. కారణం,

"వాళ్లు యుద్ధానికి వస్తారు, యుద్ధం చేస్తారు
నేనో, ఏదో తోచిన సహాయం చేస్తాను కాని
అబద్ధమెందుకు, యుద్ధం మాత్రం చేయును"

అని శ్రీకృష్ణుని అభిప్రాయం. కనుక,

"యుద్ధమొనరింత్రు వారలు అబద్ధమ్మేందులకు" ✗
"యుద్ధమొనరింత్రువారలు । అబద్ధమ్మేందులకు.... ✓

నేను పరమాప్తుడనై" అని విభజించుకోవాలి.



"తుర్లపాటి"

## పాండవోద్యోగము - ద్వితీయాంకము

శ్రీకృష్ణుని పద్యం (ధర్మ రాజుతో)

"నాల్గుపయోధులో యనగ, నాలుగు దిక్కరులో యనంగ నీ
నల్గురు తమ్ములున్ ప్రమథనాథ సమానులు...."

ఇందులో 'నాలుగు దిక్కరులో' అన్న తావున
'నాలుగుధిక్కరులో' అని పఠిస్తున్నారు.

'నాలుగు ధిక్కరులు' ✗ నాలుగు దిక్కరులు ✓

**దిక్కరులు** : నాలుగు దిక్కులలో నాలుగు ఏనుగులు భూమిని మోస్తూ ఉంటాయని ప్రతీతి. ఆ దిగంతములనుండెడి ఏనుగులని అర్థం.

**శ్రీకృష్ణుని వచనము :**

"భీమ మనశ్చతుష్పథంబునంగ్రోధ న్యగ్రోధంబు మోసులెత్తుచున్నది."

ప్రదర్శనములయందు 'క్రోధన్య క్రోధము' అని చతువుతున్నవారున్నారు.

క్రోధన్యక్రోధము" ✗ క్రోధన్యగ్రోధము ✓

క్రోధన్యగ్రోధము = క్రోధమనెడి వటవృక్షము.

**అర్జునుని వచనము :**

"..... ఈ మహానుభావుని దురుక్తులాడి విరక్తునిం జేయుచున్నావు."

కొందఱి పఠనమున 'దురూక్తులాడి' అని వినబడుతోంది.

దురూక్తులాడి ✗ దురుక్తులాడి ✓

**భీముని పద్యం :**

"వెలదిని కొల్వులో పరిభవింపగ జూచుచునున్న కూళ । చే
తుల నినుదాల్చి నిక్కముగ దుర్యశమున్ గొని తెచ్చె నీకు । త

త్పులముగ నేడు వానితలవ్రయ్యలుజేసి । యశమ్ముగొమ్ము నీ
తలపకు వీరపుంగవుని తావునకు జని । నీకు మ్రొక్కెదన్."

పై పద్యమున నిలువుగీట్లు గీచిన రీతిలో పఠించటం సరియైన పద్ధతి.

**భీముని పద్యం:**

"ఇంతిని కొప్పు పట్టికొని యీడ్వగజూచితి నెందు చేతనో ।
వంత దురంతమైన వనవాసము జేసితి నెందుచేతనో ।
శ్రాంతి సహించి । ఒక్కని దెసన్ కొలువుండితి నెందుచేతనో
శాంతి వహించి । ఈపగిది సంధికొడంబడుట అందుచేతనే."

ఈ పద్యం మూడవ పాదంలో 'శ్రాంతి సహించి' అని

నాల్గవ పాదంలో "శాంతి వహించి' అని ఉండగా పై రెండు పాదాలలోనూ శాంతి అనే చదువుతున్నారు. అది సరికాదు.

శాంతిసహించి ✗ శ్రాంతి సహించి ✓

శాంతి = శమము, కామక్రోధాదులు లేనిస్థితి శ్రాంతి = ఊఅట

**నకులుని పద్యం :**

"పోరికి సిద్ధమై అడుగబోయినవారముగాన । వారు మా
దారికి రాకపోవుట । విదారిత కౌరవకంఠ రక్త ధా
రా రమణీయ రక్తిమము । అరాళకరాళ పృథాకుమారసే
వారతివీగియున్న కరవాలములంబడు యోగముండినన్"

మనం పోరికి సిద్ధమైయుండీ చివరి ప్రయత్నంగా సంధికుదుర్చుకునే ఉద్దేశ్యంతో వారి యొద్దకు వెళుతున్నాం. సంధికంగీకరించారా! బ్రతికిపోతారు.

లేదా చీల్చబడిన లేక ఖండింపబడిన వారి కంఠముల నుండి స్రవిస్తున్న రక్తంయొక్క ఎఱ్ఱదనం, పాండవుల సేవించే ఉత్సాహంతో ఉన్న భయంకరమైన కరవాలములకు అంటుకొనే యోగమున్నచో సంధికంగీకరింపరు.

## పాండవోద్యోగము - తృతీయాంకము

**వికర్ణుని పద్యం :**

"పరులన్ దూఱగనేల । వారినిటు పిల్వంబంచి యీవేళ ఉ
ర్వర సర్వంబును ధారవోయగ స్వతంత్రమ్ము లేకుంటివో ।
ధరణీ నాయక । ఏలయిట్లతిథి చేతన్ పాము జంపించు నే
ర్పరి చందంబున మెచ్చులాడెదవు? । మీవారందఱాలింపగన్"

ఈ పద్యలో 'ఉర్వర' అనే పదాన్ని తప్పుగా భావించి 'ఇర్వుర' అని చదువుతున్న వారున్నారు.

ఇర్వుర ✗ ఉర్వర ✓

ఉర్వర అంటే నేల అని అర్థం.

**ధృతరాష్ట్రుని పద్యం :**

"కుంతి కొడుకులు తుదకింత కూడొసంగ
బ్రతుకుమని వ్రాసె కాబోలు బ్రహ్మ । నొసట ।
బ్రతుకనీయడు వీడొక్క సుతునినేని ।
ముసలివాండ్రకు కేలూత యొసగు కొఱకు."

పై పద్యమున 'బ్రహ్మనొసట' అని కలిపి చదువుతున్నారు.

"బ్రతుకుమని వ్రాసెకాబోలు బ్రహ్మ । నొసట'

అలా బ్రహ్మ అన్న తరువాత చిన్న విరామమిచ్చి 'నొసట' అని చదవాలి.

**భీష్ముని పద్యం :**

"కవ్వడితోడిపోరితము కర్ణుని కిష్టము...." అనే పద్యంలో చివర

"ఎల్లరాజులున్ జివ్వకు బాసి । సంతసముచేమని । చూచెదరాలు బిడ్డలన్"

అని పాఠం.

"ఎల్లరాజులున్ చివ్వకు బాసి' అని అనవలసియుండగా జిహ్వాకు అన్న విధంగా కొందఱు పలుకుతున్నారు.

జిహ్వా ✗ చివ్వ ✓

చివ్వ అంటే కలహము అని అర్థము.

**ద్రోణుని పద్యం :**

"పాశుపతంబుచేకొనియె భర్గుని యుద్ధములో నెదిర్చి । నా
కేశుని లోకమేగి అతడెక్కిన గద్దియ యెక్కె । సర్వభూ
మీశులగెల్చి । చేసె పృథివీశ్వరు నగ్రజు నశ్వమేధి । నీ
కాశయ కాని । ఆలమున అర్జునుదాకునె కర్ణుడు । అద్దిరా!"

ఇందులో "సర్వభూమీశులగెల్చిచేసె । పృథివీశ్వరునగ్రజునశ్వమేధి" ✗

అని విడదీసి చదవటం సరికాదు.

"సర్వభూమీశుల గెల్చి । చేసె పృథివీశ్వరునగ్రజు, అశ్వమేధి" ✓

అని పఠించాలి.

**దుర్యోధనుని పద్యం :**

"పాండవ పక్షపాతము భవన్మతమున్ మఱలించె గాక! ఆ
ఖండలనందనుండు తమకంటె పరాక్రమశాలియె!..."

ఇందులో 'ఆ అని విరామమిచ్చి ఖండల నందనుండు' అని చదువుతున్నారు. అది సరికాదు :

ఆ ఖండలనందనుడు ✗ ఆఖండలనందనుండు ✓

ఆఖండలుడు = ఇంద్రుడు

ఆఖండలనందనుడు అంటే అర్జునుడని అర్థం.

కనుక

'ఆఖండలనందనుండు' అని కలిపి చదవాలి.

ద్రోణని పద్యం :

"ముదిసితిమి భోగముల । సం
పదలన్‌కుడిచితిమి । మేము బ్రతుకదలచి యీ
కదనము వలదంచున్ చె
ప్పెదమే । వీతిడివిగాక వీరమ్మన్యా!"

"వీతిడివి" "వీరమ్మన్యా" అనే పదాలకు అర్థం

'వీతిడి' అంటే అవివేకి

'వీరమ్మన్యుడు' వీరులలో అధముడు.

దుర్యోధనుని పద్యం :

"తల్లిందండ్రియు తాత మీరు మొదలాప్త శ్రేణియుం జెప్పుట । అ
స్మల్లాభంబునకే । ఎటుల్‌రిపులతో సంధింతుసిగ్గేది!"

ఎటుల్ రిపులతో సంధింతు । సిగ్గేది? అలా విరామమిచ్చి చదువుతున్నారు. అది సరికాదు.

'సిగ్గేది' అంటే సిగ్గు విడిచి, సిగ్గులేకుండ అని అర్థం. సిగ్గులేకుండ రిపులతో ఎలా సంధించేస్తాను? అని. ఆ అర్థం దృష్టిలో ఉంచుకొని చదవాలి.

కనుక "ఎటుల్ రిపులతో సంధింతు సిగ్గేది!! అని కలిపి చదవాలి.

శ్రీకృష్ణుని పద్యం :

"సేవాధర్మము సూతధర్మమును రాశీభూతమై యొప్ప । వా
చావాత్సల్యము జూవెకర్ణుడిటు । మాత్సర్యంబు మీకేల? రా
జేవేళన్ మిముకోరునో అనికి । నాడేపాండుపోరాడ, । లే
దావర్జింపుడు కర్ణుచావువఱకో । అత్యంతమో యుద్ధమున్."

ఈ పద్యం 'రాజేవేళన్ మిముకోరునో అనికినాడేపొందు

✗ పోరాడ..." అనుటలో మిము కోరునో తరువాత విరామమిస్తున్నారు. అది సరికాదు.

"రాజేవేళన్ మిముకోరునో అనికి। నాడేపొందుపోరాడ" అని చదువవలెను. ✓

**శ్రీకృష్ణుని పద్యం :**

'చెల్లియొచెల్లకో। తమకు చేసిన యెగ్గులు సైచిరందరఋన్ తొల్లి। గతించె..."

పై నిలువుగీట్లు నిలిపిన తావులనే విరామంగా భావించాలి.

కొందఱు 'తొల్లిగతించె' అని కలుపుతున్నారు అని సరికాదు.

తొల్లిగతించె ✗ సైచిరందఋన్తొల్లి। గతించె ✓

**శ్రీకృష్ణుని పద్యం :**

"జెండాపై కపిరాజు। ముందు సితవాజిశ్రేణియుంగూర్చి। నే
దండంబున్ గొని తోలు। స్యందనముమీదన్। నారిసారించుచున్..."

ఇందు 'నే దండంబున్ గొని తోలు స్యందనము మీదన్' అని కొందఱి పాఠం. అదిసరికాదు. ✗

నేదండంబున్గొని తోలు । స్యందనముమీదన్ ✓

"తోలుస్యందనము' అని అపార్థం రాకూడదు గదా!



కాటికాపరిగా షిర్డిబాబా మహాత్మ్యంలో "తుర్లపాటి"

## పాండవోద్యోగము - చతుర్థాంకము

**శ్రీకృష్ణుని పద్యం :**

"సేవా ధర్మముగాన । రాజ్యమును శాసింపగనేజాలనంచు

నీ వాడన్ జనునయ్య! ......"

ఆ మాటలలో అర్థం తెలీక భావప్రకటన చేయలేకపోతున్నారు. "రాజ్యమును శాసించుటకు నేనర్హుడనుకాను అని నీవు మాటడవచ్చు నటయ్య!" అని అర్థం.

**కర్ణుని పద్యం :**

మనమప్పార్థుల వంకకున్‌జనదు । కర్మంబెట్టిదో । సారె చె
ప్పిన లాభంబికలేదు । కీర్తికయి పృథ్వీనాయకుల్ పోరిచ
చ్చినచానిమ్ము । ఇది భారతావనికి సుశ్రీదెచ్చి దృష్టాంతమై
చనుగాకెల్లెడ । మేటిసత్కవుల వాచాశుద్ధికిన్ మూలమై."

ఇందులో "దృష్టాంతమైచనుగాక । ఎల్లెడల మేటిసత్కవుల వాచాశుద్ధికిన్ మూలమై" అని చదవటం సరికాదు. ✗

"దృష్టాంతమై చనుగాకెల్లెడ । మేటిసత్కవుల వాచాశుద్ధికిన్ మూలమై." ✓

పైగా 'ఎల్లెడల' అంటున్నారు. ఛందో భంగమౌతుంది.

'ఎల్లెడల' ✗ ఎల్లెడ ✓

ఇది సరియైన పాఠం.



**దుర్యోధన "తుర్లపాటి"**

# పాండవ విజయము - శ్రీతిరుపతివేంకట కవులు

## తృతీయాంకము

**ధర్మరాజు పద్యం : (అభిమన్యునితో)**

"కయ్యముసేయరమ్మని..." అనే పద్యం నాల్గవ పాదంలో

"ఏది తెరువయ్యె! వచింపుము మాకు బుత్రకా!"

అనియుండగా 'ఏది తెరవయ్యె' అను చదువుతున్నారు. అది సరికాదు.

తెరవు ✗ తెరువు ✓

తెరువు = మార్గము

**నకులని పద్యం : (అభిమన్యునితో)**

"ఒరులకు జేరగాదు..." అన్న పద్యంలో పద్యాంతం

"కుంతిభోజు సుతకంటెను కోడలువీరమాతగన్"

అని ఉండగా, "కుంతిభోజు సుతుకంటెను' అని పఠించటం సరికాదు.

కుంతిభోజు సుతుకంటెను ✗ కుంతిభోజు సుతకంటెను ✓

కుంతిభోజుసుత = కుంతీదేవి

**సహదేవుని పద్యం : (అభిమన్యునితో)**

"చేతిలావుజూపి! చిన్నన్నదగ్గఱ
లేకయున్న వెలితి లేకయుండ!
మొగ్గరంబుసొచ్చి మొనసించి । పాండు భూ
పాలు కీర్తి నిలుపవలయునయ్య" ✓

పై నిలువుగీట్లుంచిన స్థానములు విరామమునకు సరియైనవి.

**ధర్మరాజు పద్యం :**

"అడి యెన్నడు బొంకని వాడనేని ।
ధార్మికుడనేని । అజాత శాత్రవుడనేని
పదుగురొకటయి నిను గవయుదురు గాక
నీక । విజయంబుసుమి సుభద్రాకుమార!

పై విభజనము సరియైనది.

"ధార్మికుడ । నేనజాత శాత్రవుడనేని'

అని చదువుతున్నారు. అది తప్పు.

"నీక । విజయంబు సుమి సుభద్రాకుమార!",

'నీక' అంటే నీకే' అని అర్థం. ✓

'నీక' కించిద్విరామంతో "విజయంబుసుమి..." అనవలెను.

✗ కాని "నీకవిజయము సుమి' నీకపజయమగునుసుమి అన్నట్లు చదువరాదు.

తర్వాత భీముడు అశ్లీలార్థము స్ఫురించుచున్నదే అని బాధపడినాడు. అంతియ కాని ధర్మజుడు 'నీక/విజయంబుసుమి' అనియే పలుకవలెను.

**ధర్మరాజు (కరండకునితో)**

"ముష్టి రణమికేటి ముష్టిరణము"

ఈ రెండు ముష్టులేమిటాయని కొందఱి సందియము.

మొదటి 'ముష్టి' దరిద్రము, పనికిమాలిన అని. రెండవ 'ముష్టి రణము' పిడికిళ్లతో గ్రుద్దుకొనెడి ద్వంద్వయుద్ధము.

**అర్జునుని పద్యం :**

"అకటా! దిక్కఱివోయెనే హరికి మేనల్లుండు..."

కొందఱు 'ధిక్కఱి' అని చదువుతున్నారు.

ధిక్కతి ✗ దిక్కతి ✓

దిక్కతిపోయెనే = దిక్కులేని వాడాయెనే

**శ్రీకృష్ణుడు కర్ణునితో :**

"పెల్బనచాలక । అలమున పెక్కురు గూడి ధనంజయాత్మజున్
గూల్చుట ధర్మమా! కొడుకుకుఱ్ఱల కుంతిని లక్కయింటిలో
గూల్చుట ధర్మమా । కనులుగానక ద్రౌపది చీరెలెల్ల నా
డొల్చుట ధర్మమా! అలదురోదరమందలిగెల్పు ధర్మమా!"

పై విధమున విరామస్థానముల పాటించిన అర్ధవంతముగ నుండును.

పెల్బనచాలకాలమున ✗

పెల్బన చాలక । అలమున ✓

పెల్బన = ఆటోపము, ఆధిక్యము

**ధర్మరాజు మడుగున దాగిన దుర్యోధనుని సంబోధించి,**

"చచ్చిరి సోదరుల్ । సుతులు చచ్చిరి । చచ్చిరి రాజులెల్లరు । ఈ
కచ్చెకు మూలకందమగు కర్ణుడు మామయు చచ్చిరి । ఈగతిన్
పచ్చని కొంపమాపితివి । బాపురే! కౌరవనాథ! నీసగం
బిచ్చెద । జీవితేచ్ఛగలదేని బయల్పడుమయ్యగ్రక్కునన్.

పై విధముగ విరామములు పాటించి పఠించవలెను.

కొందఱు 'చచ్చిరి సోదరుల్ సుతులు చచ్చిరి చచ్చిరి రాజులెల్ల" అంటున్నారు అది సరికాదు.

రాజులెల్ల ✗ రాజులెల్లరు ✓

# శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి "గయోపాఖ్యానము"లో

1. శ్రీకృష్ణుడు సూర్యునకు అర్ఘ్యప్రదానం చేస్తున్న సమయంలో స్తుతి :

   "శతమఖ చతుర్ముఖ ప్రముఖ నిఖిలబర్హిర్ముఖ సంస్తూయ
   మాన మహోమహిమాభిశోభితాయ..."

   ఇందు మొదటనున్న 'శతమఖ' అన్న సమాసాన్ని 'శతముఖ' అని పఠిస్తున్నారు.

   శతముఖ ✗ శతమఖ ✓

   'మఖము' అంటే యజ్ఞము. 'శతమఖుడు' అంటే నూరు యజ్ఞములు చేసినవాడని అర్థం.

2. 'అర్ఘ్యప్రదానలోలుండనై' అన్న తావున 'అర్ఘ్య ప్రధానలోలుడనై' అని పఠిస్తున్నారు.

   అర్ఘ్యప్రధానము ✗ అర్ఘ్యప్రదానము ✓

   ప్రదానము అనగా ఇచ్చుట అని అర్థం.

3. అక్రూరుడు పాండవులయొద్దకేగి తిరిగి వచ్చిన పిమ్మట శ్రీకృష్ణుడు అక్రూరునితో మాటాడే సందర్భంలో పాండవుల క్షేమ సమాచారాలు ప్రశ్నిస్తూ

   'కృష్ణ సేమమే?' అనినాడు

   శ్రీకృష్ణుడు 'కృష్ణ సేమమే' అని అడగడమేమిటి? అని కొందఱి అనుమానం.

   ఇక్కడ 'కృష్ణ సేమమే?" అంటే ద్రౌపది సేమమేనా?' అని అర్థం.

   ద్రౌపది పేరు 'కృష్ణ'

   ద్రుపదుని కూతురు గనుక ద్రౌపది అనికూడ అనవచ్చు. అయితే ద్రౌపది అన్న వాడుకే ప్రసిద్ధమయింది.

**నారదుని పద్యం :**

"కలహాభోక్తవు కమ్మని..." అని ప్రారంభమయే ఈ పద్యాన్ని పెక్కురు ఏ పాదాని కాపాదమే విరామమిచ్చుకుంటూ పఠిస్తున్నారు. అలా చదవటం అర్థవంతం కాదు.

"కలహాభోక్తవు కమ్మని । కమల భవుడు
నాకు విధియించినను । కొన్నినాళ్లనుండి
కటికి ఉపవాసముల్‌జేసి గడుపవలెసె ।
కడుపునిండిన జగడముల్ కలుగకునికి" ।

అలా గీటులుంచినవి విరామస్థానాలుగా గుర్తించి, ఆ ప్రకారం పఠించటం సరియైన పద్ధతి.

4. "చెలిమియొనర్చినారమటు...." అన్న కృష్ణుని పద్యంలో

'త్రుంపగజేతులురావునిన్ననిన్' అన్నచోట 'త్రుంపగజేతులురావు' అని విరామమిచ్చి 'నిన్ననిన్' అని చదువుతున్నారు. అది సరికాదు. చదివితే మొత్తం ఒకసారిగా చదవాలి లేదా 'త్రుంపగ జేతులు రావునిన్ను అని చిన్న విరామంతో 'అనిన్' అనైనా చదవాలి.

త్రుంపగ జేతులు రావు । నిన్ననిన్ ✗

త్రుంపగ జేతులరావునిన్ను, । అనిన్ ✓

5. శ్రీకృష్ణుని మాటలలో

"భార్గవ రాముండు పితృనియోగంబున తల్లితల గండ్రగొడ్డటద్రెవ్వనేసె' అని వాక్యం.

'పితృనియోగంబున' అన్న స్థానంలో 'పితృ వియోగంబున' అని పలుకుతున్నారు.

పితృవియోగము ✗ పితృనియోగము ✓

వియోగము = ఎడబాటు నియోగము = ఆజ్ఞ

6. 'నా వాక్యములందలి యథార్థము నెఱుంగగోరెదవేని' అని శ్రీకృష్ణుని వచనం. 'యదార్థము' అని 'దా'కు ఒత్తులేకుండ చదువుతున్నారు. అది సరికాదు.

యదార్థము ✗ యథార్థము ✓

7. 'కడిమి నభయంబు నిడకపోవదు కిరీటి అనే నారదుని పద్యంలో 'నిరుపమానంద వారిధి నేనుదేల' అని చివరి పాదం 'ఆనందవారధి' అని కొందఱు చదువుతున్నారు.

ఆనందవారధి ✗ ఆనందవారిధి ✓

వారధి = వంతెన వారిధి = సముద్రము

8. "ఉదయారంభముగ । మృగయోత్సవంబు
ప్రీతి నెఱపితిమి గద కిరాతులార!
మట్టమధ్యాహ్నమయ్యె । ఇప్పట్టున నిక
వేట చాలించి యిండ్లకు వేగఁబొండు"

అని తెరలోపలి పద్యం

ఇందు మూడవ పాదంలో 'మట్టమధ్యాహ్న'మని పాఠం. మిట్టమధ్యాహ్నమని చదువుతున్నారు.

మిట్టమధ్యాహ్నము ✗ మట్టమధ్యాహ్నము ✓

9. నలినగర్భునిగన్న నారాయణుడు తాను
బాంధవుండగుట మా భాగ్యమనుము' అనే పద్యంలో

'గయుని క్షమియించి పార్థుని గావుమనుము' అని ఉండగా,

'గయుని క్షమించి పార్థుని గావుమనుము' అని చదువుతున్నారు. ఈ సందర్భంలో.

క్షమించి ✗ క్షమియించి ✓

'క్షమించి' అంటే ఛందోభంగమవుతుంది.

10. "ఎన్నిదినంబులయ్యెగని యేనభిమన్యుని గన్నలార' అన్న పద్యంలో

'నా కన్నకుమారు మోమునెల కాయునెవెన్నెలమున్నువోలె'

అన్న పాదంలో 'నెల' అనే పదమేమిటని సందేహం.

నెల అంటే చంద్రుడు. మోమునెల = ముఖమనెడి చందమామ

11. "అవినయ ప్రవర్తనము లాప్రియ పూర్వకభాషణంబులు' అన్న శ్రీకృష్ణుని పద్యంలో

'ఈ విధి భంగపుచ్చునని యేఁ గలనైనఁ దలంప నెమ్మదిన్'

అన్న పాదంలో 'ఏఁగలనైనఁదలంప; నన్న తావున

నేనే కలలోను దలపనైతిని అన్న భావంతో పఠిస్తున్నారు. ఏను కలనైన దలపలేదన్న భావంతో పఠిస్తే సముచితంగా ఉంటుంది.

ఏను = నేను. ఏ కలనైన దలంపనెమ్మదిన్

12. "చనినారార్యురు చక్రవర్తులు..." అని మొదలయే అర్జునుని పద్యంలో

"చనినారు షోడశమహారాజుల్ మహేంద్రాభులై" అని ఉండగా, 'మహేంద్రాదులై' అని పలుకుతున్నారు.

మహేంద్రాదులై ✗ మహేంద్రాభులై ✓

మహేంద్రాభులై అంటే మహేంద్రునివలె దీప్తిమంతులై అని అర్థం. ఆభ శబ్దమునకు మిక్కిలి దీప్తి, ప్రభ అని అర్థములు.

13. "అనిన మాటను దప్పుటనుచితంబని గదా
దశరథేశుడు కాలధర్మమందె"

అన్న అర్జునుని పద్యంలో చివరి తేటగీతి చివరి రెండు పాదాలు.

"అఖిల సంపదలను బాసి యడవులందు
తగనియిడుములుగుడుచు మా ధర్మరాజు."

అని. ఇందులో 'అఖిలసంపదలను బాసియడవులందు' అని విరామమిచ్చి "తగని యిడుములుగుడుచు మా ధర్మరాజు" అని పఠిస్తున్నారు. అది సరికాదు. ✗

'అఖిల సంపదలను బాసి' అని విరామమిచ్చి 'అడవులందుతగని యిడుములు గుడుచు మా ధర్మరాజు' అని పఠించాలి. ✓

14. అర్జునుని పద్యం

"అల్లుడా రమ్మని యాదరంబున బిల్వ
బంపుమామను బట్టి చంపగలమె"

అని పాదం. అల్లుడారమ్మని యాదరమున బిల్వ. అని విరామమిచ్చి 'పంపు మామను బట్టి చంపగలమె' అంటున్నారు. ఆ విభజన సరికాదు. "పిల్వబంపు( అని కలిపి చదవాలి.

అల్లుడారమ్మని యాదరంబున బిల్వ ।
బంపుమామను బట్టి చంపగలమె ✗

అల్లుడారమ్మని । ఆదరమ్మున బిల్వ
బంపు మామను బట్టి చంపగలమె ✓

అదే పద్యంలో

"జలకేళి సవరించు జవరాండ్రకోకల
నెత్తుకపోయి చెట్లెక్కగలమె"

అన్న పాదంలో 'జవరాండ్ర' అన్న పదాన్ని తాలవ్యంగా ఉచ్చరిస్తున్నారు. అది సరికాదు. దంత్యంగా చదవాలి.

జవరాండ్ర ✗ జ‌వరాండ్ర ✓

# "సత్యహరిశ్చంద్రీయము"

– బలిజేపల్లి లక్ష్మీకాంత కవి

## తృతీయాంకము

**హరిశ్చంద్రుడు ప్రవేశము**

హరి: ఓ క్రూర వ్యాఘ్రమా! నిలునిలుము.

**పద్యం :**

✓ "నిలువక నిర్మనుష్య ధరణీ ధరఘోరదరీచయంబులన్ ।
మెలగుచు పక్కణంపు పొలిమేరలలో । రుచిజూచుచుంటివే
పలువ! మనుష్యమాంసముల । పాఱకు మిప్పుడు । మచ్ఛరాహతిన్
కలుగు సుఖోపజీవనము గ్రామజనాళికి నేటి నుండియున్"

✗ "నిలువక నిర్మనుష్య ధరణీ ధరఘోరదరీచయంబులన్
మెలగుచు" అని అక్కడ విరామమిస్తున్నారు. అది సరికాదు.

**హరిశ్చంద్రుని పద్యం**

"వనవాసవ్రత కర్మఠోత్తమ భువస్స్వాహేతినాదంబదే ।
కనుగొమ్ము అచ్చట గాలిచేత నెగయంగా । కొమ్మలందార వే
సిన చెంగావిమడుంగుదోవతుల వాసిన్జేసి । చెట్టుల్ చిగి
ర్చిన రీతిన్ బొలిచెన్ । వసంతసమయ శ్రీ విభ్రమాదభ్రతన్"

విరామ స్థానములు పైన గురుతులుంచిన విధంగా ఉండవలెను. కొందఱు 'భువస్స్వాహేతి నాదంబదే కనుగొమ్ము' అనే వఱకు విరామమిచ్చుట లేదు.

✗ 'నాదంబదే కనుగొమ్ము' ఏమిటి. నాదాన్ని చూస్తామా! కనుక అలా అనరాదు.

✓ నాదంబదే । కనుగొమ్మచ్చటగాలిచేతనెగయంగా...

"అన్యాలోచనలేల? యిచ్చితి వివాహంబాడుమానేడు.. అనే పద్యంలో

'భూరిసౌజన్య శ్రీలవహింపుమింకను ప్రశస్త శ్రీసుఖాభోగమున్' అని కలిపి చదువుతున్నారు. అది సరికాదు.

'భూరిసౌజన్యశ్రీల/ వహింపుమింకను ప్రశస్తశ్రీ సుఖాభోగమున్ అని పఠించాలి.

**మాతంగ కన్య : పద్యం**

"రాజులకు మిన్నవట । రతిరాజు వోని
చక్కదనమట । మిక్కిలి జాణవునట
జవ్వనులమట । పాటలో చతురల మట
తెలిసికొనుమీవె । ఎవరేల తెలుపవలయు."

ఇందులో 'జవ్వనులమట' ఈ పదంలో జకారమును తాలవ్యంగా పలుకరాదు. దంత్యంగా పలకాలి.

జవ్వనులమట ✗ జవ్వనులమట అనాలి.

ఈ భేదాన్ని గమనించి పాటిస్తే బాగుంటుంది.

**హరిశ్చంద్రుని పద్యం**

"అరయన్ వంశము నిల్ప నేకద వివాహంబు" అనే పద్యంలో

✓ వర్ణసంకరపుబెండిలియేల చుట్టెదవు నా కంఠంబునన్ । కౌశికా!"
విరామముపై గీటు గీచిన విధమున నుండవలసియుండగా,

✗ "వర్ణసంకరంపుబెండిలియేలచుట్టెదవు । నా కంఠంబునన్ కౌశికా!
అను విధమున విరామమిచ్చుచున్నారు. ఇది సరికాదు.

**హరిశ్చంద్రుని పద్యం :**

"సిగ్గేలాగున లేకపోయె తనకు"... । ఇస్సీ । గాంధిరాట్పుత్రి యే
లగ్గో కూర్చెదనన్న ఆసవడి । ఇల్లాలుండ । నిర్భీతినే
యోగ్యూహింపక మాలకన్నియల దోయింబొంది, అర్కాన్వయం
బగ్గిం ద్రోసెనటంచు । ఛీయనరెనన్ను । ఆబాలగోపాలమున్."

పై విరామ స్థానములు సరియైనవి కాని.

✗ "ఛీ యనరె!, (ఆపి) నన్నాబాలగోపాలమున్"

అంటున్నారు. ఆ విరామం సరికాదు.

**చంద్రమతి పద్యం :**

"మేనన్ బ్రాణములున్న యంతవఱకున్" అని ప్రారంభమయే పద్యంలో
"లే లెండనూచా నుండిమ్మునికిందు దానముగ రాజ్యంబున్ యశంబున్గనన్"

'అనూచానుదు' అంటే వేదాధ్యయనము చేసినవాడు అని అర్థం. వినయ సంపన్నుడు అని కూడా చెప్పవచ్చును.

✗ ఇందులో "ఇమ్మునికిందుదానముగ । రాజ్యంబున్ యశంబున్గనన్"
అని చదువుతున్నారు. అది సరికాదు.

✓ "ఇమ్మునికిందు దానముగ రాజ్యంబున్ । అని విరామమిచ్చి
యశంబున్గనన్ అని చదువుట సరియైన విధానం.

**హరిశ్చంద్రుని పద్యం :**

"దేవ బ్రాహ్మణ మాన్యముల్ విడిచి । భక్తిన్ । సప్తాపాథోధి వే
లావిభ్రాజదఖండభూవలయమెల్లన్ । మీకు దానంబుగా
భావంబందొక శంకలేకొసగితిన్ బ్రహ్మార్పణంబంచు । దే
వా! । విశ్రాంతిగనేలుకొమ్మికను నీవు । ఆచంద్రాతారార్కమున్."

✗ కొందఱు 'అఖండ' అని విరామమిచ్చి 'భూవలయ మెల్లన్'
అని చదువుచున్నారు. అది సరికాదు.

✓ 'సప్తపాథోధి వేలావిభ్రాజదఖండభూవలయమెల్లన్'
అలా మొత్తం ఒకటిగా చదువవలెను.

ఆ తరువాత

✗ "విశ్రాంతిగనేలు కొమ్మికను । నీవా చంద్రతారార్కరమున్" అని చదువుతున్నారు.
ఆ విరామ స్థానం సరికాదు

✓ "విశ్రాంతిగ నేలుకొమ్మికను నీవు । ఆచంద్రతారార్కమున్' ఇది సరియైనది.

**హరిశ్చంద్రుని పద్యం :**

"సతతదాన క్రియారతుడనంచు...' ఇందులో చివరి పాదం "శ్రీగుణోద్దామ, రాజ్యలక్ష్మీలలామ!"

కొందఱు "శ్రీగుణోద్ధామ' అని చదువుతున్నారు.

శ్రీగుణోద్ధామ ✗ శ్రీగుణోద్దామ ✓ సరియైన పాఠం.

**సత్యకీర్తి పద్యం**

"చిన్నతనంబు నుండి నను జేరగదీసి......' అనే పద్యంలో

✗ 'నాకన్నగురండవీగతిని । కానలపాలయి వోవుచుండ'
అలా విరామమిచ్చి చదువుతున్నారు. అది సరికాదు.

✓ 'నాకన్న గురుండవు । ఈగతిని కానలపాలయి వోవచుండ'
ఈ విరామ స్థానం సరియైనది.

**హరిశ్చంద్రుని పద్యం :**

"ఇదివఱకెన్నడున్ గుణనిధీ! జవదాటవు నాదు మాట...." అనే పద్యంలో

"కలదేని ఋణాను బంధమే యొదవుపునస్సమాగమ సుఖోన్నతులే మనకీ జగాననే" అనే తావున

✗ "కలదేని ఋణానుబంధమే ఒదవు । పునస్సమాగమ సుఖోన్నతులే ।
మనకీ జగాననే; అని చదువుతున్నారు, ఆ విరామస్థానములు సరికావు.

✓ "కలదేని ఋణానుబంధమే । ఒదవు పునస్సమాగమసుఖోన్నతులే
మనకు । ఈ జగాననే; ఇది సరియైన పద్ధతి.

**హరిశ్చంద్రుని పద్యం :**

"ఆకల్పాంతము నంతముంగనని..." అనే పద్యంలో

"ఏ యిడుములనైన్‌కోరి జన్మాంతమెంతో కౌతూహలవృత్తిచే

ననుభవింతున్" అన్న వాక్యంలో విరామం

✓ "ఏ యిడుములైనన్ । కోరిజన్మాంతమెంతో కౌతూహలవృత్తిచే

అనుభవింతున్, అని పై విధంగా పఠిస్తే ఎంతో అర్థవంతంగా ఉంటుంది.

✗ ఏ యిడుములైనన్‌కోరి । జన్మాంతమెంతో కౌతుహలవృత్తిచే అనుభవింతున్.

## సత్యహరిశ్చంద్రీయము

## పంచమాంకము

**నక్షత్రకుడు :**

"వైదికవృత్తి సంపాదింతునంటివా....." అనే పద్యంలో

"ఇందునేదేని వ్యాపారమందగిన

యంతపున్నెంబుపుట్టిన యింతధనము

గంటుకట్టునె యీ స్వల్ప కాలమునను'

ఇందులో

✗ 'ఇందునేదేని వ్యాపరామందదగిన (అని విరామమిచ్చి)

యంతపున్నెంబు పుట్టిన' (అని చదువుట సరికాదు).

✓ "ఇందునేదేని వ్యాపారమంద దగిన

యంతపున్నెంబు పుట్టిన" అని కలిపి చదవాలి.

**తరువాత ఈ పద్యంలోనే**

✗ 'గడచు నీనాటితోడ మాగడువు దినము'

✓ 'కడచు నీనాటితోడ మాగడువు దినము' 'గడచు' అని అనరాదు.

**హరిశ్చంద్రుడు :**

"హృదయమున నెగ్గుసిగ్గులు వదలివేసి ।
దాసిగానిన్ను అమ్ముకోదలచినాడ ।
వాడవాడల నిన్గొనువారి నూర
వెదకికొన పోవుదము పదవే । లతాంగి!"

✗ కొందఱు 'అమ్ముకోదలచినాడ వాడవాడల'
అని చదువుతున్నారు. అని సరికాదు.

✓ "అమ్ముకోదలచినాడ । వాడవాడల నిన్గొనువారి నూర
వెదకికొనపోవుదము పదవే లతాంగి!"

ఇది సరియైన విధము

**హరిశ్చంద్రుడు :**

"ఇటులెంతైన ధనంబు వచ్చినను రానీ..." అనే పద్యంలో

✗ 'సత్యముందప్ప । నేనిటుసూర్యుండటుతోచెనేనియు వినుండీ
మీరుముమ్మాటికిన్" అని చదువుతున్నారు. అది సరికాదు.

✓ "సత్యముందప్పనేను । ఇటు సూర్యుండటుతోచెనేనియు । వినుండీ మీరు
ముమ్మాటికిన్" ఇది సరియైన పఠనము

**చంద్రమతి :**

"కదలవేయని విప్రుడదలించుటకుమున్ను" అనే పద్యంలో

ఇంపుగామిము కౌగిలింపనుండు' అని ఉండగా

'ఇంపుగామిము కౌగలింపనిండు' అని పఠిస్తున్నారు.

కౌగలింపనిండు ✗ కౌగిలింపనిండు ✓

**అదే పద్యం తుదిని :**

"వెడలు కన్నీట పాదముల్ కడిగి । మీకు
ప్రణతులిడుచున్నదాన । సద్గుణనిధాన!" అని పాఠం.

✓ ప్రణతులు సరియైన పాఠం.

✗ కొందఱు ప్రణుతులు అనుచున్నారు. అదిసరికాదు.

'ప్రణతులిడుచున్నదాన' = నమస్కరించుచున్నదానను అని

**హరిశ్చంద్రుని పద్యం :**

"గళమునం దాల్పవలసిన యలరుదండ
పాదమర్దన కొప్పించుభంగి కాగ."

కొందఱు "పాదమర్ధన" అని పఠిస్తున్నారు.

పాదమర్ధన ✗ పాదమర్దన ✓

**చంద్రమతి పద్యం :**

"కాలవశమున గల్గిన కష్టచయము
లెల్ల । వెంటనె నిలుచునే యేకరీతి ।
మిహిర మండలమున గప్పు మేఘ పటలి ।
తూలిపోకుండునే యెల్లకాలమటుల?'

విరామ స్థానములు చూపబడినవి.

మిహిరమండలము = సూర్యమండలము

# షష్ఠాంకం

**హరిశ్చంద్రుడు :**

"కాటిసుంకంబు చెల్లింపకయె శవాల
మసనమున కాల్పరేకద మనుజులార" అని మొదలగు పద్యమున

✗ "కాటిసుంకంబు చెల్లింపకయెశవాల । అని విరామమిడి
మసనమున కాల్పరే కద' అని చదవటం సరికాదు.

✓ 'కాటిసుంకంబు చెల్లింపకయె । శవాల
మసనమున కాల్పరేకద మనుజులార'



ఇది సరియైన పఠనం

**హరిశ్చంద్రుడు :**

'మాయామేయజగంబె' అను పద్యం

"మాయామేయజగంబె నిత్యమని సంభావించి మోహంబునన్' అని విరామమిచ్చి

✗ 'నా యిల్లాలని, నా కుమారుడని....' అని పఠించటం సరికాదు
'మాయామేయజగంబె నిత్యమని సంభావించి' । అని విరామమిడి

✓ 'మోహంబునన్నాయిల్లాలని, నా కుమారుడని..." అని
చదవటం సరియైన విధానం.

ప్రస్తుతం విస్తృతంగా ప్రదర్శింపబడుతున్న నాటకాలలోని నాల్గింటిని గ్రహించి ప్రదర్శనలో కొందఱు పాత్రధారులనోట దొరలుతున్న దొసగులను చూపి, వాటినెలా సరిదిద్దుకోవాలో తెలిపే ప్రయత్నం చేయటం జరిగింది.

మఱొక విషయమేమంటే గ్రంథంలో ఒప్పులే ఉన్నా, వాటిని తప్పులుగా భావించి వేరే విధంగా మార్చి చదవటం కూడా జరుగుతున్నది.

**ఉదాహరణకు :**

శ్రీకృష్ణతులాభారంలో, కృష్ణుని పద్యం. "ప్రమదలగూడిమాడగనె వారి మనోగతులెల్ల తేటతెల్లముగ స్ఫురించెనంచును తలంతురుపో మగవారలు." అనే పద్యంలో "కూడిమాడగనె" అనే తావున "కూడియాడగనె" అని మార్చి పఠించేవారున్నారు.

మాడు అనే పదాన్ని అచ్చుతప్పుగా భావించి అలా మార్చి చదువుతున్నారు. కాని మాడు అనేపదం తప్పుకాదు. మాడు అనగా వర్తించు, మెలగు అని అర్థం.

'కూడిమాడు' అంటే కలిసిమెలగు అని.

అలాగే, గయోపాఖ్యానంలోని 'చనినార్వురు చక్రవర్తులు..." అనే పద్యంలో 'మహేంద్రాభులై' అన్నచోట 'మహేంద్రాదులై' అని.

సత్యహరిశ్చంద్రలో ' మున్యాశ్రమోపాంతము' అన్న తావున మున్నాశ్రమ ప్రాంతము' అనీ తప్పుగా భావించి మార్చబడినవే.

ఇది సరియైన పదమేనా? అచ్చుతప్పైన దొరలిందా? అన్న అనుమానం కలిగినప్పుడు ఎవరినైన సాహితీపరులనడిగి తెలిసికోవటం సముచితమైన పద్ధతి.

అలా కాక తమంత తామే ఒక నిర్ణయానికి వచ్చి ఉన్నపదాలను మార్చటం తగని పని. ఇక్కడ మఱో విషయం చెప్పుకోవాలి.

పుస్తకంలో ఉన్నది ఉన్నట్లే చదివినా కొన్నితావులలో తప్పులు దొరిలే అవకాశం లేకపోలేదు. ఒక కళాకారుడు ఒక పర్యాయం రిహార్సల్స్ రూంలో విజయరామరాజు పద్యాలు చదువుతుంటే వింటూ కూర్చున్నాను. పద్యం :

"అరయగ మేకవన్నె పులులా వెలమల్, పయికెంతొమెత్తగాఁ
బెరిమకలారువోలె కనిపింతురు, తారదనైన నగ్గలై
పరులను గాల్చివైతురు..." అలా నడుస్తుంది.

పద్యమంతా రాయగయుక్తంగా అన్న తరువాత

'మాష్టరుగారూ! దోషాలేమన్నా ఉంటే చెప్పండి' అన్నాడు.

"పుస్తకంలో ఉన్నది ఉన్నట్లే అన్నావు. అలా అనటంలో కూడా ఒక చిన్నదొసగు చోటుచేసుకుంది. ఏమిటంటే, రెండవ పాదం మొదట ఉన్నది. బెరిమ కాదు. పెరిమ. పెరిమ అంటే ప్రేమ.

ప్రేమ (ప్రకృతి) పెరిమ (వికృతి) వ్యాకరణరీత్యా బెరిమ అయింది. 'పయికెంతొ మెత్తగాఁ బెరిమకలారువోలె కనిపింతురు' అని ఏకధాటిగా అంటే తప్పేమీ కాదు. కాని, నీవు 'పయికెంతొ మెత్తగా' అనటంలో తుదిని ఒకచిన్న సంగీతపు చెణుకుతో ఆగి తరువాత,

'బెరిమ కలారువోలె కనిపింతురు' అన్నావు. అలా విరామమిచ్చి అనవలసినట్లయితే 'పెరిమ కలారువోలె కనిపింతురు' అనే అనాలి." అని వివరించటం జరిగింది. 'బొబ్బిలియుద్ధం' కొన్నివేల నాటక ప్రదర్శనలిప్పించినవారు ఆహోర్మొనిస్టుగారు. ఆయన ఇది విని ఎంతో విస్మయంగా 'మాస్టరుగారూ! ఎన్నో యేండ్లుగా కొన్నివేల ప్రదర్శనలిచ్చామే కాని అది 'బెరిమ' కాదు, 'పెరిమ' అని యీ పదాన్ని గురించి యేనాడూ ఆలోచించకపోవటం నాకెంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తుందండీ' అంటూ నాకు ఎంతో వినయంగా కృతజ్ఞతలు తెలిపారు. ఆ తరుణంలో 'గురువులేని విద్య గుఱుతుగా దొరకదు' అన్న వేమన్న పలుకు నా మదిలో మెదిలింది.

ఇలా కొందఱు చేస్తున్న దోషాలనుగూర్చి వ్రాస్తున్న సమయంలో నటమిత్రులు యం.వి.యల్. నరసింహారావు (మందపాటి) గారిని కలియటం జరిగింది. వారు, వారినాన్నగారు "నాట్యకళానిధి" రామలింగేశ్వరరావు గారు తెలిపిన ఒక ఘోరమైన అన్వయ దోషాన్ని వివరించారు.

'గయోపాఖ్యానం' నాటకంలో అర్జునుడు సుభద్రతో నుడివిన పద్యం.

"అనుగుంజెల్లెలివై ముకుందునకు। నాకర్ధాంగివై। పాండరాజునకుం గోడలివై ।.... అని పద్యం మొదలౌతుంది. నాటి అర్జున పాత్రధారి,

"అనుగుంజెల్లెలివై (అని కొంచెంరాగం సారించి ఆపి)

"ముకుందునకు నాకర్ధాంగివై." అని చదివాడట ఇది ఎంతటి అన్వయదోషమో చూడండి! కనుక ముందుగా సాహిత్య పరిజ్ఞానం ఉన్నవారి ద్వారా తెలిసికోవటం ఎంత ఆవశ్యకమో గ్రహించగలరు.



# ఒక్క సూచన

ఎవరి పాత్రను వారు చక్కగా అవగాహన చేసికొని, సహపాత్రలతోడి అనుబంధాన్ని గుర్తెరిగి, పాత్రానుగుణమైన రీతిలో నటించి ప్రదర్శనను రక్తకట్టించటం నటీనటుల కర్తవ్యం. నటీనటులు, సాంకేతిక నిపుణులు, సంగీతసారథులు అందఱూ తమ బాధ్యతను దృష్టియందుంచుకొని, దర్శకుని సూచనల మేరకు తగిన రీతిని శ్రద్ధాసక్తులతో నడుచుకొనినప్పుడే ప్రదర్శన జనబాహుళ్యాన్ని ఆకట్టుకుంటుంది. ఈ సమష్టికృషి సమాజాలపరమైన నాటక ప్రదర్శనలలో సక్రమంగానే నిర్వహింపబడుతోంది.

కాని, ఎక్కడెక్కడినుంచో పేరెన్నికగన్న మేటినటీనటులను రావించి వారి ద్వారా పదర్శింపబడుతున్న నాటకాలు ఎంతగా ప్రేక్షకుల మన్ననలు పొందుతున్నా, కొందఱు పాత్రధారుల దృక్పథవిభేదం వలన తమస్థాయిని కోల్పోతున్నాయి.

వ్యక్తిగతమైన పేరు ప్రఖ్యాతులను ఇనుమడింపజేసికొనే దృక్పథంతో తమ పరిధుల నధిగమించి ఒకరిని మించి ఒకరు నటిస్తూ, సంగీతపరంగా సమన్వయ ధోరణిని విడిచి, శ్రుతులు పెంచుకుంటూ పద్యాంతంతో ముగించకుండ సంగీతాన్ని విస్తరించి కచేరీలోలా ప్రస్తారంగావించుకుంటూ నాటకీయతకు భంగం కలిగిస్తున్న మాట వాస్తవం.

కనుక ఈ అనౌచిత్యం వైదొలగాలంటే నటీనటుల దృక్పథంలో మార్పురావాలి. ఎవరి పాత్రకు వారు న్యాయం చేకూర్చాలనే అభిప్రాయం సముచితమైనదే. ఎదుటి పాత్రధారిని అధిగమించి ముందుకు సాగాలనుకోవటం వాంఛనీయంకాదు. నటీనటుల ప్రావీణ్యం తన పాత్రను పోషించుకుంటూ సన్నివేశాన్ని రక్తికట్టించటంలో తనవంతు కృషి తానుచేయటంలో ఉంటుంది తప్ప, సంయమనాన్ని కోల్పోయి వర్తించటంలో ఉండదు.

## రచనా సారళ్యం - ప్రయోగ సౌలభ్యం

ఎన్నో నాటకాలు కొంతకాలంపాటు ప్రదర్శింపబడి కనుమరుగౌతుంటాయి. ఏవో కొద్దిపాటి నాటకాలు మాత్రం తరాలుమారుతున్నా అవిచ్ఛిన్నంగా కొనసాగుతూనే ఉంటాయి. కొదువలేని ప్రజాభిమానాన్ని పొందుతూనే ఉంటాయి. కారణం!

కథాగమనంలోగాని, పాత్రచిత్రణలో గాని, పద ప్రయోగంలో గాని, పద్యరచనా పాటవంలో గాని, రసపోషణలో గాని, చమత్కృతీ వైభవంలో గాని క్లిష్టతకు తావులేని విధంగా రూపొంది ఎల్లరనూ అలరించగలిగిన నాటకం శోభాయమానంగా రంగస్థలాన ప్రదర్శింపబడుతూనే ఉంటుంది. అంతరంగాలను ఆనంద తరంగాలలో ఓలలాడిస్తూనే ఉంటుంది.

**ఉదాహరణకు :**

తిరుపతి వేంకటకవుల 'పాండవోద్యోగవిజయ' ప్రదర్శనలు అలాంటి ప్రయోగ సౌలభ్యానికి ప్రబల నిదర్శనలు అంటే అతిశయోక్తి కాదు.

ఏనోట విన్నా 'చెల్లియొ చెల్లకో..." పద్యాలే.

ఏ చోటకన్నా పాండవోద్యోగ ప్రదర్శనలే.

పాడుకోవటానికి ఎంత అనువుగా ఉంటాయో ఆ పద్యాలు!

"చెల్లియొ చెల్లకో తమకు చేసిన యెగ్గులు సైచిరందఱున్
తొల్లి, గతించె, నేడు నను దూతగ బంపిరి సంధిసేయ, నీ
పిల్లలు పాపలున్ బ్రజలు పెంపు వహింపగ పొందు చేసెదో,
యెల్లి రణంబు గూర్చెదవొ యేర్పడ తెల్పుము కౌరవేశ్వరా!"

ఎక్కడనైన ఒక్కగొట్టు పదముందా! ఇంచుకైన అన్వయ క్లిష్టత ఉందా! కనుకనే నాటినుంచి నేటి వఱకు ఆ పద్యాలు తెలుగు వారి నాలుకలపై లాస్యం చేస్తున్నాయి, చేస్తూనే ఉంటాయి.

అవసరంలేని పదం కనిపించదు, అనవసరమైన పద్యం వినిపించదు. పదపదంలోను, ప్రతిపద్యంలోను భావం ఉరవళ్లు త్రొక్కుతూ ఉంటుంది. నాటకం చూచేకొద్దీ శ్రీకృష్ణ పాండవులు కనిపిస్తేచాలు పైరగాలిలో తేలిపోతున్నట్లుంటుంది. కౌరవులు కంటపడ్డారో పడమటిగాలి భగ్గుమన్నట్లుంటుంది. ధర్మానికీ అధర్మానికీ సంకులసమరం జరిగిందనీ, తుట్టతుదకు ధర్మానికే విజయం పట్టం కట్టిందనీ అవగతమౌతుంది. ప్రేక్షకుడి హృదయం అనందతుందిలమౌతుంది.

అదీ నాటకమంటే!

"ఆంధ్రదేశాన్నే ఉర్రూతలూగించి, అశేష ఆంధ్ర ప్రజానీకపు మన్ననకు పాత్రమైనవి తిరుపతి వేంకటకవుల నాటకాలు. వీరి 'పాండవోద్యోగ విజయ' నాటకాలు ప్రదర్శనలో మిక్కిలి ప్రచారం పొందాయి. ఈ నాటకాలకు తెలుగు నాటక సాహిత్యంలో సమున్నత స్థానముందంటే అత్యుక్తికాదు."

అన్న ఆప్తమిత్రులు ఆచార్య "శ్రీ యస్. గంగప్పగారి మాటకు తిరుగేముంది!"

"తిరుపతి వేంకటకవులుగా ప్రసిద్ధులయిన దివాకర్ల తిరుపతిశాస్త్రి గారు, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారు రచించిన పాండవ నాటకాలలో 'పాండవోద్యోగము', 'పాండవ విజయము' విశేష ప్రాచుర్యం పొందాయి. నాటక రంగంలో వాటికి శాశ్వత స్థానం లభించింది. నాటి నుంచి నేటి వఱకు ఎందఱో నటులకు ఈ నాటకాలు అన్నం పెడుతున్నాయి" - అన్న మాన్యశ్రీ జి.యస్.యన్. శాస్త్రి గారి మాటలలో అసత్యమేముంది!

ఎందఱో నటకాగ్రేసరులు తమ రంగస్థల జీవితానికి పాండవోద్యోగ విజయాలతో నాందివలికినవారే - తమ భవితవ్యాన్ని సుందరంగా తీర్చిదిద్దుకున్నవారే.

**ప్రదర్శన యోగ్యమైనపుడే నాటక రచన,**
**ప్రేక్షక హృదయ రంజకమైనపుడే నాటక ప్రదర్శన సార్థకమౌతాయి.**

# నాటక ప్రదర్శనం - ప్రయోజనం

పిన్నలనక, పెద్దలనక అందఱూ ఎంతదూరమైనా సరే, ఎంతో శ్రమకోర్చి మరీవెళ్లి, తెల్లవార్లూ మేల్కొని నాటక ప్రదర్శనలు చూడటానికి అంత ఉత్సాహంగా ఎందుకు పరువులెత్తుతారో చెప్పండి!

ఉత్సవనాటకాలయితే చేతిచమురొదలకుండా చూడొచ్చు. వెళతారు సరే. టికెట్ నాటకాలే అయినా నాటకం నాటికి టికెట్ దొరక్కపోతే ఎలా అని, డబ్బులు సంతనచేసికొని ముందుగానే టికెట్ కొనుక్కొని ఆ రోజుకోసం ఎదురుచూస్తూ సిద్ధంగా ఉంటారే! ఏమిటబ్బా అంతకుతూహలం!

అదే మరి, నాటకకళకున్న ప్రత్యేకత!

పూర్వం పల్లెపట్టులలో అందఱూ తీరికగా ఉండే కాలంలో భారత రామాయణాదులను పౌరాణికుడిచేత చెప్పించుకొని విని సంతసించేవారు. నాటక ప్రదర్శనలలో వినటం మాత్రమే కాదు, ఆయాపాత్రలు కట్టెదుట కన్పించి, ఆడుతూపాడుతూ ప్రేక్షకుణ్ణి కథాగమనంలోకి లాక్కెళతాయి. ఆనందంలో ముంచెత్తుతాయి.

ఇక్కడొక ముఖ్యవిషయం చెప్పుకోవాలి. లోకంలో సహజంగా శుభావహమయిన సన్నివేశంచూచినప్పుడు ఆనందం కలుగుతుంది. అది, యేవిషాద సన్నివేశమో అయినప్పుడు దుఃఖాన్నే కలిగిస్తుంది.

కాని, విచిత్రమేమంటే, నాటక ప్రదర్శన చూడటం వలన అలా కాదు. అది సుఖాంతమే అయినా, విషాదాంతమే అయినా ఆనందానుభూతిని కలిగిస్తుంది.

"Imitation begets pleasure."
(అనుకరణము ఆనందమును గూర్చును)

అనే ఆంగ్లోక్తి కూడా పై అభిప్రాయాన్నే ధ్రువీకరిస్తుంది. అనుకరణము అంటే 'లోకవృత్తానుకరణం నాట్యం' అని కదా!

"అట్లగుచో హరిశ్చంద్రాది నాటక ప్రదర్శనముల వలన ఏల అశ్రుపాతాదులు కలుగుచున్నవి? అనవచ్చును. అవి దుఃఖము వలన కాదు. దుఃఖమే కలుగుచో మనమానాటకములు చూడబోవుదుమా? ఎవడేని కావలెనని దుఃఖమును కొనితెచ్చుకొనునా? ఇకనేమన, హృదయము కరిగి కన్నులవెంట నీరైవచ్చును. ఇవి ఆనందబాష్పములు. కావున, కావ్యమున శోకాదికారణముల వలనను, ఆనందమే కలుగును."

– కావ్యాలంకార సంగ్రహమునందలి సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారి వివరణము.

ఇక, ఆనందముతోపాటు కావ్యము ధర్మోపదేశకమైయుండవలెననియు మన లాక్షణికులు భావించినారు.

వైదిక వాఙ్మయము ఏ కర్తవ్య ధర్మాన్ని శాసనరూపంగా బోధిస్తుందో దానిని పురాణాలు సహేతుకంగా సోదాహరణంగా బోధిస్తాయి. ఆ కర్తవ్యధర్మాన్నే కావ్య వాఙ్మయము శైలీ గుణఅలంకారాలచే జనచిత్తాన్నాకర్షిస్తూ హృద్యంగా బోధిస్తుందని సన్నిధానంవారు సోదాహరణంగా వివరించారు.

**ఉదా:** 'సత్యం వద' వేదశాసనము.

పురాణము 'సత్యహరిశ్చంద్ర' కథా ద్వారా బోధించినది. శ్రవ్య దృశ్య కావ్యములు అంతకన్న మనోరంజకముగ ఆ ధర్మమును మఱింత లెస్సగా నాటుకొనునట్లు బోధించినవి. ఈ క్రమమును బట్టి చూడగా కావ్యము (అది శ్రవ్యమే అయిననూ, దృశ్యమే అయిననూ) తప్పక ధర్మోపదేశకమై యుండవలెనని మనలాక్షణికులు భావించిరనుట సత్యము.

"ధర్మ్యం, యశస్యమాయుష్యం, హితం, బుద్ధివివర్ధనమ్,
లోకోపదేశ జననం, నాట్యమేతద్భవిష్యతి." – **నాట్యశాస్త్రము**

నాట్యము ధర్మప్రబోధమును గావించునదియై, యశస్సును, ఆయువును, హితమును, బుద్ధి వికాసమును కలిగించుటయే కాక లోకోపదేశకము కాగలదని వివరించుటయు పై అభిప్రాయమును స్థిరీకరించుచున్నది.

మన ఆలంకారికులు భావించినట్లే మన పురాణేతివృత్తము లాధారముగా

1) భక్తిప్రబోధకములు  4) ప్రణయగాధా సమ్మోహకములు

2) ధర్మోపదేశకములు  5) కల్పితగాధా సంశోభితములు

3) నీతి సందేశాత్మకములు  6) వీరగాథా విశృంఖలములు

అయిన నాటకములెన్నియో ప్రచురముగ ప్రచురింపబడినవి, విరివిగా ప్రదర్శింపబడినవి.

అటులనే సాంఘిక సమస్యలను, సాంఘిక దురాచారములను ఎత్తిచూపుచూ వరవిక్రయం, కన్యాశుల్కం, చింతామణి, సాని-సంసారి, మధుసేవ మున్నగు నాటకములును, జాతీయోద్యమ స్ఫూర్తితో 'గాంధీవిజయధ్వజం, చలో ఢిల్లీ, మొదలగు నాటకములు వెలువడి ప్రదర్శింపబడటం ప్రశంసనీయం. (పై నుదాహృతములైన వానిలో కొన్ని గద్యనాటకములును కలవు)

నాటక ప్రయోజనాలను వివరిస్తూ -

"నాటకం ఆకర్షించగలిగేది, ఆనందపరిచేది, ఆలోచింపజేసేది, చైతన్యపరిచేది - ప్రేక్షకుడి మీద సమ్మోహనాస్త్రాలు సంధించగలిగే శక్తివంతమైన ప్రయోగం" ప్రముఖ నాటక రచయితలు, దర్శకులు, నటులు మాన్యశ్రీ కె.యస్.టి. శాయి గారి నోట వెలువడిన ఈ మాట అనేక అనుభవాల ఊట.

ఇటీవలి నంది నాటక మహోత్సవాలలో ఎన్నియో కొంగ్రొత్త నాటకములు రంగస్థలినలంకరించుటయు, సలక్షణమైన రీతిలో ప్రదర్శనమును తీర్చిదిద్దెడి సమర్థులయిన దర్శకులు లభించుటయు, అంకిత భావంతో అభ్యసించుటకు నటీనటులు సిద్ధమగుటయు, నాటకీయతకు భంగము కలిగించు పోకడలకు తావీయక ప్రదర్శనా ప్రామాణ్యమును పెంచుకొని నాట్యకళాసరస్వతికి సువర్ణహారములై వెలుగొందుట నాటకరంగ భవిష్యత్ శుభ సూచకములేయని భావింపనగును.

# నటప్రస్థానం - నాడు, నేడు

తరాలుమారుతున్నై. ఆంతర్యాలు మారుతున్నై. పరిణామశీలమైన ప్రపంచంలో ఎన్నో మార్పులు సంభవిస్తూనే ఉంటై. అలాగే నాటక ప్రదర్శన విషయంలో కూడా పరిణామం చోటుచేసుకోవటం సహజం.

వెనుకటి రోజులలో ప్రేక్షకులు తెలతెలవారేంతవఅకు నాటకం చూడటానికి సమాయత్తమై ఎంతో కుతూహలంతో వచ్చేవారు. అంతనిడివిగా ప్రద్శన జరిగితేనే గాని వారెంతో సంతృప్తిని పొందేవారు కారు. అలాకాక ఏ రెండింటికో ప్రదర్శన ముగిస్తే వారెంత మథనపడేవారో, ఎంతనొచ్చుకునేవారో ఆనాటి నుండి ప్రదర్శనలిస్తూ ఉండిన సోదరనటులకు అనుభవైకవేద్యమే. ఇది నాటి ప్రేక్షకుల విషయం.

ఇక నటుల విషయానికివస్తే – రంగస్థలం మీదినుంచి చూస్తే కనుచూపుమేర జనమే. వారికోసం మైకులులేని రోజులలో చివరి వారికి గూడ వినబడేటంత బిగ్గరగా శ్రుతిపెంచి మాటగాని, పాటగాని, పద్యంగాని వీలయినంత నాదం పూరించి అనవలసి వచ్చేది. అందువల్లనూ వేగంకొంత కుంటువడేది. దానిని బట్టే అభినయం కూడా ఉండేది.

ఇక యీనాడు వెనుకటి మాదిరికాదు. జనజీవనగమనంలో వేగం పెరిగింది. ప్రజ ప్రభంజనంలా పరువులెత్తుతోంది. అనేకములైన కార్యక్రమాలతో, సమస్యలతో సతమతమవుతున్న మానవుడికి నాటకం చూడటానికి ఎక్కువ సమయం కేటాయించే అవకాశం లేదు. కాని, నాటకం చూడాలనే ఆసక్తి మాత్రం లేకపోలేదు.

మరో విషయం. నగరాలలో 9½ గంటలు దాటితే ప్రయాణసౌకర్యం ఉండదు. కనుక నాటక ప్రదర్శన ఆలోపుగా ముగించాలి. మనం ముగించినా ముగించకపోయినా ప్రేక్షకులుండరు. దానికితోడు మైకులు గూడా ఉండటంతో వెనుకటంత బిగ్గరగా శ్రుతులు పెంచి అనవలసిన అగత్యం లేదు. అందువలన నాటకప్రదర్శనవేగం కూడా పెరిగింది.

రచయిత కాలాన్ని, పరిస్థితులను అనుసరించి రచన కావిస్తుంటాడు. ఆయా కాలాలలోని సమస్యలకూ అద్దంపడతాడు. అలాగే నటుడు కూడా అందిన సౌకర్యాలను వినియోగించుకుంటూ, ప్రదర్శనాప్రమాణాలను పెంచుకుంటూ ముందుకు సాగవలసి ఉంటుంది.

పాత్రోచితమైన ఆహార్యం

సుస్పష్టమైన వాచికం

అవగాహనా పూర్వకమయిన అభినయం

భావానుగుణమైన పద్యపఠనం

పరిమితమైన సంగీతం

సన్నివేశానుగుణమైన రంగాలంకరణం

సాంకేతిక నిపుణుల సహకారం

సమర్థవంతమైన దర్శకత్వం

మొదలయిన అంశాలలో తగుజాగరూకత వహిస్తూ, ఆధునిక ధోరణులను అవగాహన చేసుకుంటూ, కాలానుగుణమైన సవరణలు గావించుకుంటూ ముందుకు పయనిస్తుంటే, మన పద్యనాటకం హృద్యమై పండువునాటి ముత్తైదువులా కలకాలం కళకళలాడుతూనే ఉంటుంది.

మన నాటక జైత్రయాత్ర మంగళతూర్యధ్వనులతో చిరకాలం కొనసాగుతూనే ఉంటుంది.

**ఇది సత్యం,**

**ఇతి రమ్యం.**

# ఇంతకూ,
# నా నట జీవన ప్రస్థానం ఎలా సాగిందంటే... !

ప్రప్రథమంగా నాచేత చీరెకట్టించిన ద్రౌపదిపాత్ర మొదలుగా, ఎందఱో అభిమానుల పురస్కారాలను, సువర్ణమయబహూకృతులను అందుకొనిన సుయోధనుని వఱకు నేను వహించిన అన్ని పాత్రలూ నా అనుభవాలకు ఆలంబనాలే, నాలోని నటుణ్ణి మేలుకొలిపి మెలకువలు నేర్పినవియే.

నిజం చెప్పొద్దూ! మొదట్లో నేను వేషాలేయాలనుకోలేదు. మా నాన్నగారు హరికథలు చెపుతుంటే విన్నాను. మా పెదనాన్నగారు వెంకటసుబ్బయ్యగారూ (మురికిపూడి) కథకులే. వారినీ చూచాను. పట్టుబట్టలు ధరించి, కాలికి గజ్జెకట్టి, చిరతలు చేతబట్టి నృత్యంచేస్తూ వారు కథాగానం మొదలిడితే ముగ్ధుణ్ణై నేను కూడా గజ్జెకట్టి అతి త్వరలో కథకు సిద్ధంకావాలని ఉబలాటపడ్డాను. పరిమివారి భారతం తీసి ఒక చిన్నకథ ఎన్నుకున్నాను. అదే పద్మవ్యూహం. నేను ముందు చదివి, తరువాత మా నాన్నగారి వద్ద చెప్పుకోవాలనుకున్నా.

అంతలో చిననందిపాటి నుంచి మా మేనత్తగారు రావడమేమిటి! చదువుకునే నిమిత్తం మా ఊరు (కలవకూరు) నుంచి నన్ను తీసికెళ్లడమేమిటి! అనుకోకుండా జరిగిపోయింది. ఇంకెక్కడి కథ. పద్మవ్యూహంలో ప్రవేశించిన అభిమన్యుడు బయటకు వచ్చాడా! నా కథకూడా అలాగే ఆగిపోయింది.

## ఇదీ నా హరికథ కథ.

ఇక చిననందిపాడులో ఎలిమెంటరీ స్కూలు చదువయిపోయి, పెదనందిపాడు హైస్కూలులో చేరాను. ఫస్టు పారం నుండి యస్.యస్.యల్.సి., వరకూ అక్కడే.

నేను పదవతరగతి (ఫిఫ్తుఫారం) లో ఉండగా, చిననందిపాడులో కుఱ్ఱవాళ్లంతా "పాండవోద్యోగం" నాటకం వేయాలని సిద్ధపడుతున్నారు. ఆ విషయం మా

అత్తయ్యకు తెలిసి, వాళ్లను పిలిచి "అబ్బాయిలూ!" మావాడికక్కాడా ఒక వేషమివ్వండిరా!" అని అడిగింది.

"అన్ని వేషాలూ అయిపోయాయి అక్కయ్యగారూ! ద్రౌపది వేషానికే యింకా ఎవ్వరినీ అనుకోలేదు" అన్నారు. 'అయితే యింకేం! మావాడిచేత వేయించండి' అని ఎంతో సంతోషంగా చెప్పిందామె. ఆ సంతోషానికి కారణమేమిటంటే ఆమెకు పిల్లలు లేరు. మగపిల్లవాణ్ణి ఇంట్లో నేనున్నాను. ఆడపిల్లలేదే అనే కొరత ఆమెలో ఉంది. అందుకే నా చేత ద్రౌపది వేయించి చూడాలని ముచ్చటపడింది.

నా ద్రౌపది ఎంతో ముద్దుగా ఉన్నదని అందఱూ చెప్పుకున్నారు. మా అత్తయ్య నన్ను ఇంటికి తీసికెళ్లి దిష్టి తీసేసింది. ఏం లాభం! అప్పుడు ఫొటోలు తీయించుకోలేదు. ఇప్పుడు చూచుకోవటానికి లేదు.

**అలా, నా రంగస్థల నటజీవితానికి నాంది పలికిన పాత్ర ద్రౌపది.**

మరో విషయం. కారణాంతరాలవల్ల ఆ నాటకంలో అశ్వత్థామ పాత్రకూడ నాచేతనే వేయించారు.

చూచారా! మొదట్లో ఉన్నవారందఱికీ ఒక్కొకవేషమే. చివరలో సమాజంలో చేరిన నాకో, రెండు వేషాలు. అదీ అదృష్టమంటే!

అదే సంవత్సరం మా హైస్కూలు వార్షికోత్సవాలలో పాండవోద్యోగంలో ప్రథమ దృశ్యం ఏర్పాటు చేశారు మా కోలా కోటేశ్వరరావు మాష్టరుగారు. అందులో నాచేత దుర్యోధన పాత్ర వేయించారు. నాతో శ్రీకృష్ణపాత్ర మొట్టమొదట ధరించిన మిత్రుడు ఎ.వి. కృష్ణారావు. అభినందనల జల్లు కురిసింది. అప్పుడు నా వయస్సు పదునైదు వత్సరాలు.

ఆ పిమ్మట వి.ఆర్.యస్. కాలేజి, చీరాలలో ఇంటర్ చదివినప్పుడుగాని, ఆంధ్ర విశ్వవిద్యాలయం,


కోలా కోటేశ్వరరావుగారు

వాల్తేరులో బి.ఏ.ఆనర్స్ చదివినప్పుడు గాని నాటకాల జోలికి పోలేదు. మా లెక్చరర్ శ్రీ యస్వీ జోగారావుగారు వార్షికోత్సవ సందర్భంగా యూనివర్శిటీ స్టేజ్ మీద నాచేత పద్యాలు పాడించారు. అంతే.

తఱచుగా సంస్కృతం క్లాసులకు ఎగనామం పెట్టటం, ఆ రోజు షడంగి మాష్టరుగారు చెప్పిన సంస్కృత పాఠం బీచ్‌లో కూర్చొని మా మిత్రుడు గంగప్పచేత చెప్పించుకోవటం, అతనికి పద్యాలు వినిపించటం పరిపాటయింది.

తరువాత ఆనర్స్‌లో నా క్లాస్‌మేట్ అయిన మిక్కిలి సుందరరావు ద్వారా ఆంధ్రా క్రిష్టియన్ కాలేజిలో ఉద్యోగం లభించటంతో గుంటూరులో స్థిరపడటం జరిగింది. సుందరరావులాంటి హెల్పింగ్‌నేచర్ ఉన్న మిత్రుడు నా రూమ్మేట్ కావటం నా అదృష్టం.

నేను గుంటూరు చేరే సమయానికి మా బాబాయి తుర్లపాటి హనుమంతరావు గారిక్కడే ఉన్నారు. ఆయన ఒకరోజు 'మా రిహార్సల్ రూంకు వెళదాం రారా!' అన్నారు. వెళ్లాను. 'కాళిదాసు' నాటకం రిహార్సల్స్ జరుగుతున్నాయి. కాళిదాసు పాత్రధారి ఎంతో చక్కగా శ్లోకాలు చదివారు. ఆయనే జి.యస్.యన్. శాస్త్రి గారని పరిచయం చేశారు. అంతలో విద్యాధరి పాత్రధారి బుఱ్ఱా సుబ్రహ్మణ్యశాస్త్రి గారు, భోజరాజు పాత్రధారి కందుకూరి చిరంజీవరావుగారు వచ్చారు. వారికి, సంగీత సారథులు వై. రామచంద్రరావుగారికి అందఱికీ వినమ్రుణ్ణై నమస్కరించాను. తరువాత నన్నేదో ఒక పద్యం పాడమన్నారు. **అశ్వత్థామ పద్యం ఫెళఫెళ లాడించాను. తమ నాటకంలో 'కవి రాక్షసుడు' వేషం వేయవలసినదిగా ఆదేశించారు. ఆ తరువాత 'భోజరాజు' పాత్రధరించే అవకాశం కూడా లభించటం విశేషం.**

వారి సమాజంలోనే 'వరూధిని' అనే సంస్కృత నాటకం (కొలచల దీక్షితులు గారి రచన) గుంటూరు, తిరుపతి మున్నగుచోట్ల పరిమితంగానే ప్రదర్శనలు జరిగాయి.

ఇక్కడొక విషయం చెప్పాలి. గుంటూరులోని పట్టాభిపురంలో నాటకం. ఎదురుగా ఆచార్య యస్వీ జోగారావు మాస్టరు గారు, గురుదేవులు కరుణశ్రీ గారు మొదలుగా ఎందఱో సాహితీవేత్తలు కూర్చుని ఉన్నారు.

నాటకం ప్రారంభమయింది. సంస్కృత సమాసాలతో అనర్గళంగా వర్ణన చేస్తూ, చివరలో శ్లోకం చదవాలి. శ్లోకంలో చివరిపాదం గుర్తురావటం లేదు. ఏం చేయాలి? మైకుకు దూరంగా వెళ్లి నటిస్తూ ఆ లయ ప్రకారం నోరుమెదిపా.

నాటకమయిం తరువాత జోగారావు మాస్టరుగారు "అరేయ్! మొద్దులాగా మైక్ దగ్గరే నిలువబడి చదవకుండా, ఎంత బాగా యాక్ట్ చేశావురా!" అన్నారు. అదీ తమాషా. చెప్పటం మఱచాను. వరూధిని : బుఱ్ఱావారు, ప్రవరుడు : జి.యస్.యన్. శాస్త్రిగారు, సిద్ధుడు : నేను. ఆ తరువాత జి.యస్.యన్. శాస్త్రిగారి సమాజంలోనే 'పాండవోద్యోగ విజయాల'లో ధర్మరాజు వేయించారు. అలాగే 'కర్ణుడూ' వేయించారు.

**ఎన్ని పాత్రలు వేసినా, నాకు మనసంతా దుర్యోధనపాత్రమీదే ఉండేది. కారణం?**

నేను యూనివర్శిటీలో చదువుకునే రోజులలో రిజిస్ట్రార్ శ్రీ కూర్మా వేణుగోపాల స్వామి నాయుడుగారి పర్యవేక్షణలో జరిగిన 'పాండవోద్యోగం' ప్రదర్శన చూచాను. పీసపాటి నరసింహమూర్తిగారు కృష్ణుడు, ధూళిపాళ వారు దుర్యోధనుడు, వేమూరి రామయ్యగారు కర్ణపాత్ర ధరించారు. ప్రదర్శనానంతరం సభ జరిగింది. సభాధ్యక్షులు శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావుగారు,

"మా గురువుగారయిన మాధవపెద్ది వెంకట్రామయ్య గారిని గుర్తుకు తెచ్చారు. చాలా సంతోషం" అంటూ దుర్యోధన పాత్రధరించిన ధూళిపాళ వారిని అభిమాన పూర్వకంగా సత్కరించారు. ఆ ప్రదర్శన, సత్కారము చూచిన నాలో, "ఎప్పటికైనా యీ దుర్యోధన పాత్ర నేను ధరించాలి" అనే సంకల్పం ఆనాడు మొలకెత్తింది. నానాటికి బలీయమైంది.

నేను గుంటూరులో ఉద్యోగంలో చేరేనాటికి (1962), పెళ్లూరి శేషగిరిరావు గారు, ధూళిపాళవారు, ఆచంట వెంకటరత్నంనాయుడుగారు దుర్యోధన పాత్రధారులయిన సుప్రసిద్ధనటులు. దాదాపు రెండు సంవత్సరాలు జి.యస్.యన్. శాస్త్రి గారి సమాజంలో ధర్మరాజుగానే కొనసాగాను.

అంతలో పెళ్లూరివారు అకస్మాత్తుగా దివంగతులు కావటం, ధూళిపాళవారు చలనచిత్రసీమకు వెళ్లటంతో ఆచంటవారొక్కరే దుర్యోధన పాత్రధారులయారు. అన్ని సమాజాలవారికి వారు అందటం కష్టమయింది.

మరో దుర్యోధనుడి అవసరం వచ్చింది. అప్పుడు ఎవరు వచ్చి పద్యం పాడమన్నా దుర్యోధనుడి పద్యాలే పాడటం మొదలు పెట్టాను. ఏ సమాజం వారైనా దుర్యోధనుడివేషం ఇవ్వకపోతారా! అని ఆశ.

అంతలో అనుకోకుండా నటరాజనాట్యమండలి నిర్వాహకులు, శ్రీకృష్ణ పాత్రధారి అయిన బోయపాటి లక్ష్మయ్యచౌదరిగారు నన్ను తమ రిహార్సల్ రూముకు రావలసినదిగా కబురంపారు. వెళ్ళాను. అక్కడ మా నటమిత్రులు గుంటుపల్లి ఆంజనేయచౌదరిగారు కూడా ఉన్నారు. లక్ష్మయ్యచౌదరిగారు,

"ఏమండీ! మా సమాజంలో మీ యిరువురు కర్ణదుర్యోధను లయితే బాగుంటుందని అనుకున్నాం. కర్ణుడెవరు వేస్తారో, దుర్యోధనుడెవరు వేస్తారో మీరే నిర్ణయించుకోండి' అన్నారు. నేను ఆ బాధ్యత ఆంజనేయులు చౌదరిగారికే అప్పగించాను. ఆయన కొంచెమాలోచించి "నేను కర్ణుడు వేస్తాను, తుర్లపాటిగారిచేత దుర్యోధనుడు వేయించండి" అన్నారు.

చౌదరిగారు అన్నమాట నాకు మాటలాగా లేదు. రతనాలమూట ఒడిలో పడినట్లయింది. వారం రోజులలో నాటకం. రామచంద్రరావు మాస్టరుగారే సంగీత సారథులు. భావద్యోతకంగా, నా గాత్రానికనువైన రీతిలో పద్యాలు ట్యూన్‌చేసి నాచేత ఆ వారంరోజులూ అనిపించారు. రిహార్సల్సూ చేశాం. ఇందుపల్లిలో నాటకం. అనూహ్యమైన స్పందన వచ్చింది. అంతే, ఆ సమాజంలో దుర్యోధనుడిగా స్థిరపడ్డాను.

అలాగే మిత్రులు ఉప్పలపాడు సైదులుగారి శ్రీకృష్ణపాత్రతో నాటకాలు కాంట్రాక్టిచ్చే యస్. సుబ్రహ్మణ్యంగారు మొదలగు స్థానిక సమాజాలవారు నా దుర్యోధనపాత్రకు ప్రాధాన్యత నివ్వటంతో విరివిగానే ప్రదర్శనలు జరుగుతున్నై.

అంతలో శివరాత్రిపర్వసందర్భంగా కాకాని సాంబశివుని కోవలె ప్రాంగణంలో పాండవోద్యోగ ప్రదర్శనావకాశం కలిగింది. సుప్రసిద్ధనటులు జె. రామమోహనరావు చౌదరిగారు ఆ నాటకంచూచి తాను తెనాలిలో ఏర్పాటు చేయనున్న ప్రఖ్యాత నటులతోడి 'కురుక్షేత్ర' నాటకంలో కర్ణ దుర్యోధనులుగా ఆంజనేయులు చౌదరిగారిని, నన్ను బుక్ చేశారు. కారణమేమోగాని చౌదరిగారు రాలేదు, నేను వెళ్లాను.

పీసపాటి వారు నాటి నాటకంలో రాయబార ఘట్టంలో శ్రీకృష్ణ పాత్రధారులు. వారికి నన్ను దుర్యోధన పాత్రధారిగా పరిచయం చేశారు. నేను తెలుగు లెక్చరర్‌నని కూడా చెప్పారు. పీసపాటి వారికి నన్నొకపట్టుబట్టి చూడాలనిపించింది కాబోలు!

కౌరవ సభలో పాండవుల సౌజన్యాన్ని గురించి, విశేషించి అర్జునుని అస్త్రవిద్యా వైశారద్యాన్ని గురించి వారు వివరించిన తీరు వారెంతటి ఆంధ్రగీర్వాణ వాణీద్వయ వరప్రసాదులో, భారతేతిహాసాన్ని ఎంతగా మథించి ఉంటారో అవగతమయేటట్లు చేసింది.

ఆయన ముగింపు ఇస్తూ "ధార్తరాష్ట్రాగ్రజా! కాలాతీతమైనది కావున ఈ నాటికి నిన్ను విడుచుచున్నాడను, ఇంకను నీకు తెలుపవలసినది చాలకలదు." అని హెచ్చరించటంతో హాలులో గగ్గోలు రేగింది. హర్షాతి రేకంతో జనసందోహం పెట్టిన కేకలు, ఈలలు, చప్పట్లు ఇప్పటికీ నా చెవులలో మార్మోగుతూనే ఉన్నై.

అంత దనుక నేను కవి విరచితమైన సంభాషణలు తప్ప వేరుగా మాటలాడిన వాడనుకాను. ఈ రోజున మాటాడక మిన్నకుంటే నన్నొక అసమర్థునిగా భావిస్తుంది ప్రేక్షకలోకం. అందుకే గళం విప్పాను.

"గోపాలా! ఊరక ప్రగల్భములాడెదేల! కాలపక్వజనసమాజసంహరణ క్రీడనంబు సలుపుశూలిపోలిక, దివామధ్యప్రభాకరు పగిది ప్రభాభాసమానుండై వెలుంగుచు అరదంబున నిల్చిన కర్ణుని గాంచి అర్జునుడు, ఒక్క అర్జునుడే అన

నేల! ఆతడును నీవును కలిసికట్టుగ పారిపోదురో లేక మా మిత్రుడు కర్ణుడు పారిపోవునో చూడక పోదుమా! నేటి నీ ప్రగల్భములకేమి! (అనుటతో)

**శ్రీకృష్ణుడు:** ఆc ఆc! చూడకేమి! నీ మిత్రుని శౌర్యంబును, నీ పరాక్రమంబును ఉత్తరగోగ్రహణ కాలంబున వినియే యుంటిమి. వేరచెప్పవలయునా!

**దుర్యో :** నాడర్జునునిచే ప్రయోగింపబడినది సమ్మోహనాస్త్రము. సమ్మోహనాస్త్రము నెవరు ప్రయోగించినను కొలది క్షణములపాటు అది పరులను నివ్వెరపాటునందునట్లు చేయుట దాని స్వభావము. కావున అది అస్త్రబలము గాని అర్జునుని పరాక్రమము కాదు. (సమాధానము)

**శ్రీకృష్ణ :** అయినచో అట్టి అస్త్రములను మీరే ప్రయోగింపవచ్చును గదా! ఎందులకు మిన్నకుంటిరో! అద్భుతములును, అమోఘములును అయిన అట్టి అస్త్రములను ప్రయోగించుట మీకు సాధ్యము కాదు కాబోలును.

**దుర్యో :** మూర్ఛితులజేయుటవంటి గారడీ విద్యలు క్షత్రియోచితములు కాదని ఊరకుంటిమి కాని, మేమేమి అసమర్థులమై మిన్నకుంటిమనుకొంటిరా!

**శ్రీకృష్ణుడు :** ఓహో అటులనా! అయినచో చిత్రసేనుడు నిన్ను జయించి రథమునకుగట్టి కొంపోవనుంకించునప్పుడు రోషలజ్జాపరాక్రమహీనుండవై మిన్నకుంటివేమి?

**దుర్యో :** గంధర్వులు మాయాకోవిదులు. అదృశ్యులై ఆకసమున సంచరించుచు చిత్రసేనాదులొనరించిన యుద్ధమొక యుద్ధమన నగునా! అట్టిది మీరు శ్లాఘించుటయును కడు విచిత్రముగనే యున్నది. (స్వగతము) ఈతడు మమ్ములను బలహీనులుగనెంచి ఎకసక్కెములాడుచున్నటులున్నది.

అతులితబల పరాక్రమ శౌర్యసంపన్నులయిన భీష్మద్రోణ కర్ణకృపాశ్వత్థామ ప్రభృతులనేకులు మా అండనుండ, దండధరుండైన మమ్మెదిరింప జాలడు. అట్టియెడ ఈతడును పాండవులును మమ్మేమిసేయగలరో! ఏనాడో ఏదియో జరుగబోవునని వాక్స్ఫూరత నెఱపుచున్నాడు. ఈనాడు, ఈ సభాస్థలియందు, ఈ రాజరాజునెదుట

ఈతని గతి ఏమి కానున్నదో ఎఱుగడు పాపము అమాయకుడు" (అంటూ నిష్క్రమించటంతో ఆ వాగ్వాదం ముగిసింది) అంతటి పండితనటుని ప్రశ్నల పరంపరకు సముచితసమాధానాలనీయటంతో అటు ప్రేక్షకులలో, ఇటు సహనటులలో ఆదరాభిమానాలుప్పొంగాయి. హర్షాధ్వానాలు చెలరేగాయి.

నాటి సన్నివేశానంతరం, పూజ్యులు శ్రీ పీసపాటి వారు సహృదయంతో నన్ను ఎంతగానో అభినందించి ఆశీస్సులందించటమే కాక తన సమాజనాటక ప్రదర్శనలలో నాకే యిటు దుర్యోధనుడు, అటు గయోపాఖ్యానంలో గయుడు వేసే అవకాశాన్ని కలిగించటం నా అదృష్టంగాక మరేమిటి! స్నిగ్ధమైన వారి హృదయానికి మనఃపూర్వక నమస్సుమాంజలులు.

మా గురువుగారైన ఆచార్య యస్వీ జోగారావు గారు "మా శిష్యుడి దుర్యోధనుడెలా ఉంది?" అని అడిగినప్పుడు "మీ శిష్యుడు ఘటికుడే! సందేహం లేదు" అన్నమాట వారు వాత్సల్యంతో నా గళానవైచిన మేలిరతనాల పేటలా భావించి మురిసిపోయాను. నాడు పీసపాటి వారి కృష్ణపాత్రతో నా దుర్యోధనుణ్ణి చూచిన ప్రసిద్ధనటులు శ్రీ వల్లూరి వెంకట్రామయ్యచౌదరిగారు నన్ను వెన్నుతట్టి ప్రోత్సహిస్తూ నాకు సూచించిన సలహాలను తప్పక చెప్పాలి. వారి మాటల్లోనే,

"బాబూ! ఈ రోజు నీవు పోరాడింది ఒక నటసింహంతో. ఇది సామాన్యమైన విషయం కాదు. ఇప్పుడు నీకొక సలహా యివ్వాలనుకున్నాను. అది నీకు భవిష్యత్తులో ఎంతగానో ఉపయోగపడుతుంది. విను.

నీది నార్మల్‌హైట్. అయిదడుగుల అయిదంగుళాలో, అయిదూ ఆరో ఉంటావు, అంతేనా? నీ ప్రక్కన ఉన్నవారు నీకంటె ఎత్తరి వారైనాసరే వారికి తగ్గకుండా కన్పించాలంటే నీవొక పనిచేయాలి.

నిలువుచారలున్నదోవతే కట్టుకోవాలి.

నిలువుచారలున్న అంగీనే బిగుతుగా (లూజ్ లేకుండా) కుట్టించుకొని ధరించాలి. అలాగే,

నిలువుచారలున్న హుడ్ బాగా పొడవుగా జీరాడేటట్లు ఏర్పాటు చేసుకోవాలి. 'హుడ్' అంటే రాజులు వెనుకవైపు కట్టుకొనే వస్త్రము. వాటికితోడు నిడివి కలిగిన కిరీటం. ఎత్తైన పాదరక్షలు ధరించాలి.

¾ యాంగిల్‌లోనే ఎక్కువగా కన్పించేటట్లు నిలిచిఉండాలి.

మరొక ముఖ్యమైన విషయం. నీ ప్రక్కవానికంటె ఒక అడుగు ముందుకువేసి నిలబడాలి. అప్పుడు నీ ప్రక్కనున్న ఎత్తైన వారికంటె, లేదా కనీసం వారితో సమానంగానైనా ప్రేక్షకులకు కన్పిస్తావు." అని సలహా యిచ్చారు.

నేనా సలహాను తు.చ. తప్పకుండా పాటించాను. దాని ఫలితమేమో తెలుసాండి! నేనలా రంగస్థలికి సిద్ధమయిన తరువాత చూచినవారు, "ఏమండీ! విడిగా ఉన్నప్పటికంటె స్టేజిమీద అంత ఎత్తుగా కన్పడతారే! ఏమిటండీ విచిత్రం!" అని ఎంతమంది అనేవారో!" "ఏదో ఉందిరహస్యం!" అన్న సన్నిహితులూ లేకపోలేదు.

అలా తెనాలి పట్టణంలో ప్రదర్శించిన "కురుక్షేత్రం", నాట్యకళాభిజ్ఞులు శ్రీ బుఱ్ఱా సుబ్రహ్మణ్య శాస్త్రిగారన్నట్లుగా నా నట జీవిత భవితవ్యానికి పునాది వేసింది. తెలుగు నేల నాలుగు చెరగులకు నా దుర్యోధనుడు తెలిసేలా చేసింది.

పి.వి. స్వామి నాయుడుగారి పర్యవేక్షణలో, పీసపాటి వారు కృష్ణుడు, వేమూరి రామయ్యగారు అర్జునపాత్ర ధరించిన 'గయోపాఖ్యానం'లో గయునిపాత్ర ధరించటంతో, రవీంద్ర భారతిలో ప్రవేశించాను. ఆనాడు, నా చేత ప్రథమంగా గుంటూరులో వేషాలు వేయించిన శ్రీ జి.యస్.యన్. శాస్త్రిగారిని చూచి, ఆప్యాయతను పంచుకొని ఎంత సంబరపడ్డానో!

ఆ సమయంలో రాయలసీమలో ప్రదర్శనలు ముమ్మరంగా ఉండేవి. ఈలపాట రఘురామయ్యగారు, పీసపాటి వారు, ఏ.వి. సుబ్బారావుగారు, షణ్ముఖి ఆంజనేయరాజుగారు కృష్ణులుగ, ఆచంటవారు, నేను దుర్యోధనులుగ కురుక్షేత్రం క్యాంపులు, అలాగే ఏ.వి. సుబ్బారావుగారు శ్రీరాముడు, లక్ష్మణరావు ఆంజనేయ పాత్రధారిగ 'శ్రీ రామాంజనేయ యుద్ధం' క్యాంపులు జరిగేవి. ఆ రెండు క్యాంపులలో దుర్యోధనుడుగ, యయాతిగ నేనుండటం జరిగేది.

అలా వెళ్లినప్పుడే కర్నూలులో రంగస్థల సంగీత దర్శకులు శ్రీ కె.సి. శివారెడ్డి గారు, శ్రీకృష్ణపాత్రధారి కె.వి.రాఘవరావుగారు పరిచయమై అత్యంత సన్నిహితులయ్యారు. వారు వారిసమాజంతో ప్రదర్శించే నాటకాలలో కూడా నన్ను దుర్యోధనుడిగా, గయునిగా ప్రవేశపెట్టారు. శ్రీమతి కోటీశ్వరి, వెల్దుర్తి వెంకటనర్సు నాయుడు, కె.వి. రాఘవరావు శ్రీకృష్ణ పాత్రధారులుగా వారి కురుక్షేత్రాలు జరిగేవి. అలా వారితో ప్రదర్శనలిస్తున్న సమయంలో నా దుర్యోధనుణ్ణి చూచే నిమిత్తం మళ్లీ అదే గ్రామంలో మరునాడు 'కురుక్షేత్రం' ఏర్పాటు చేయటం నాలో మరపురాని మధురస్మృతిగా నిలిచిపోయింది. అలాగే రాఘవరావు కృష్ణుడుగా, వెంకటనర్సునాయుడు అర్జునుడు, నేను గయుడుగా ఎన్ని గయోపాఖ్యానాలో!

అలాగే సహనటులు, ఆప్తశ్రీ కురిటి సత్యంనాయుడు (విశాఖ) గారి గయోపాఖ్యానాలు, శ్రీ కె. వెంకట్రావు గుప్తా (విజయనగరం) గారి కురుక్షేత్రాలు, రాజమండ్రి, దేవీచౌక్ మొదలుగా దేవీ ఉత్సవాలు, గణపతి నవరాత్ర మహోత్సవ నాటకాలు, వార్షికంగా, కృష్ణా గుంటూరు జిల్లాల్లో శ్రీరామనవమి నాటకాలు (ఒక్కొక్క రోజు రెండు ప్రదర్శనలు) ఏటేటా ప్రదిర్శంపబడుతూ కళకళలాడుతూ ఉండేది.

అలాగే విజయవాడ, గుంటూరు, చిలకలూరిపేట, అద్దంకి, త్రోవగుంట, ఒంగోలు, టంగుటూరు, కందుకూరు, కావలి, పామూరు, నెల్లూరు మొదలుగా గల ప్రాంతాలలో కలెక్షన్ నాటకాలు ఏటేటా జరిగేవి.

ఇలా **కురుక్షేత్రాలు, గయోపాఖ్యానాలు, శ్రీరామాంజనేయ యుద్ధాలు** విరివిగా ప్రదర్శిస్తున్న సమయంలోనే సమతా గురుకులం వ్యవస్థాపకుడు, శ్రీ వి. రామానుజ సూరిగారు పరిచయం కావటం, తన 'పలనాటి యుద్ధం' నాటకంలో నన్ను నరసింగరాజుగా ప్రవేశపెట్టటం జరిగింది. **"పలనాటి యుద్ధం" వాడవాడలా కొన్నివేల ప్రదర్శనలిచ్చాం.**

అలా కళాజగత్తులో ఒక్కొకరోజు ఒక్కొక పాత్రవహిస్తూ విహరిస్తున్న తరుణంలోనే **"నటమేరునగధీరులు"** మల్లాది సూర్యనారాయణగారి 'సత్యహరిశ్చంద్ర'లో తొట్టతొలుతగా విశ్వామిత్ర పాత్ర ధరించే అవకాశం లభ్యం

కావటం నా సుకృతం. నాటి ప్రదర్శనలో **'పుంభావ నాట్యకళా సరస్వతి'** బుఱ్ఱావారు చంద్రమతి పాత్రధారి కావటం విశేషం.

అటు పిమ్మట **'నటచూడామణి'** బందారు రామారావుగారు, **'ఆంధ్రా తాన్‌సేన్'** డి.వి. సుబ్బారావుగారి ప్రదర్శనలలోను విశ్వామిత్రుణ్ణయాను.

ఆ తరం నటులతో నటజీవితానికి నాందిపలికిన నేను, కాలచక్రగమన క్రమంలో యువతరంలో ప్రవేశించాను.

ఆ సమయంలో హైదరాబాదు వాస్తవ్యులు శ్రీ గుమ్మడి గోపాలకృష్ణ గారు శ్రీకృష్ణ పాత్రధారులై తన వినూత్నమైన బాణీతో ప్రేక్షకులకు అభిమానపాత్రులై మన్ననలందుకుంటున్నారు. ఎ. వెంకటేశ్వరరావు, కావూరి సత్యనారాయణ, కురిటి సత్యంనాయుడు, గున్నేశ్వరరావు, ఆచంట బాలాజీనాయుడు, ఎ.కోటేశ్వరావు, ఎ.దశరథరామయ్య, ఎ. ఆదినారాయణ, పురాణం కాశీవిశ్వేశ్వరశర్మ, చెరుకూరి శ్రీరాములుచౌదరి, యన్. రవికుమార్, జి. శివశంకర్, చిట్టినేని లక్ష్మీనారాయణ, ప్రసాదరాయచౌదరి, బత్తుల నరసింహారావు, రామలింగయ్య, రాజేశ్వరరావు, చిలుకూరి రామయ్య మున్నగు యువనటులు విభిన్న పాత్రలలో రంగస్థలి నలంకరించి ప్రేక్షక హృదయస్థలి నలరిస్తున్నారు.

ఎన్నో నాటకములలో వీరందఱితోనూ విభిన్న పాత్రలు వహించాను.

మిత్రులు ఇళ్లవెంకట్రావు సహకర్ణ పాత్రధారియై స్పందన ప్రతిస్పందనలతో సహకరించే తీరు ఎంతో వైశిష్ట్యాన్ని సంతరించుకునేది. నా పాత్రకెంతో ఊతమిచ్చేది.

ప్రదర్శనలు ముమ్మరంగా జరుగుతూ ఉన్న రోజులవి. ఒకే రాత్రి రెండు ప్రదర్శనలు, మ్యాట్నీ ప్రదర్శనలు కూడా చేశాము. అలా పద్యనాటకం వేవెలుగులు సంతరించుకొని వర్ధిల్లుతున్న సమయంలో – 1992లో మన ప్రభుత్వం రాష్ట్రస్థాయి పద్యనాటకపోటీలు నిర్వహించింది.

తెనాలి నుండి ఎ. కోటేశ్వరరావు శ్రీకృష్ణ పాత్రధారణతో 'పాండవోద్యోగం' ప్రదర్శనకు శ్రీ వెంకట కనకదుర్గా నాట్యమండలి సిద్ధమయింది. నేనే సుయోధన పాత్రధారిని. గౌరవ్యులు శ్రీ వేమూరి రామయ్య గారిని దర్శకత్వబాధ్యత వహించ

వలసిందిగా కోరారు. అందులకు వారు సుముఖులు కాకపోవటంతో నాకే ఆ బాధ్యతను సైతం అప్పగించారు. **దుర్యోధనపాత్ర చేస్తూనే, దర్శకత్వం వహించాను. అందరమూ అంకితభావంతో కృషి చేశాము. మా కృషి ఫలితమా అన్నట్లు మా నాటకం ఉత్తమ ప్రదర్శనగా ఎంపికయింది. తెనాలి పురప్రముఖులు మమ్ములను ఘనంగా సత్కరించారు.**

ఆ పిమ్మట తెలుగు విశ్వవిద్యాలయం, ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖవారు సంయుక్తంగా 1993 మే 10 నుండి జులై 11 వరకు నిర్వహించిన నటశిక్షణా శిబిరంలో బుఱ్ఱా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, జి.యస్.యన్. శాస్త్రిగారు, డి.యస్. దీక్షిత్ గారు అధ్యాపకులుగా శిక్షణనీయటం జరిగినది. మా ఒరవడిలో కాలానుగుణమైన మెరవడులు దిద్దుకోవటం ఈ శిక్షణలోని విశేషం.

అలాగే సెంటర్‌ఫర్ కల్చరల్ రిసోర్సెస్ అండ్ ట్రైనింగ్ - న్యూ ఢిల్లీవారు విజయవాడలో నిర్వహించిన శిక్షణా శిబిరంలోనూ నటశిక్షణ పొందాము.

ఇక 1993లో : దేవీనవరాత్ర మహోత్సవ సందర్భంగా పుట్టపర్తి క్షేత్రంలో, ప్రశాంతి నిలయంలో భగవాన్ శ్రీ సత్యసాయి స్వామివారి సమక్షంలో శ్రీ ప్రసాదరాయ కులపతిగారి నిర్వహణలో జరిగిన "త్రిభువన విజయం"లో అల్లసాని పెద్దనగా వ్యవహరించి స్వామి అనుగ్రహ సత్కారాలకు పాత్రుణ్ణయాను.

ఆ మరునాడే స్వామివారికి సన్నిహితులు, మన్మిత్రులు అయిన అనిల్‌కుమార్ గారి ద్వారా సాయీశుని సన్నిధానంలో 'మయసభ – దుర్యోధన' ఏకపాత్ర ప్రదర్శించే అవకాశం లభించింది. భక్తజనుల హర్షధ్వానాల మధ్య స్వామివారు వేదికమీదికి వచ్చి **రత్నాంగుళీయకాన్ని** సృష్టించి వ్రేలికి అంలకరించి ఆశీర్వదించి 'ఫోటో తీయించుకో' అనిచెప్పి, తనతో ఫోటో తీయించటం నా అదృష్టంగాక మరేమిటి!

అదే సంవత్సరం భగవాన్ తమ జన్మదిన మహోత్సవంలో మాచే 'పాండవోద్యోగం' ప్రదర్శనయిప్పించి శ్రీకృష్ణపాత్రధారి ఉప్పలపాడు సైదులు, ఉప్పాల వేంకటరత్తయ్య చౌదరి, టి. శేషారావు, కురిటి సత్యం నాయుడు, ఇళ్ల వెంట్రావు, కాళేశ్వరరావు, మంచికంటి కోటేశ్వరరావు మొదలుగా మమ్ములనందఱనూ పట్టుబట్టలతో అనుగ్రహించి వాత్సల్యాన్ని ప్రకటించటం మా భాగ్య విశేషం.

'శాంతిసుధ' (స్వామి మందిరం) గుంటూరు నుండి ఒక టూరిస్టు బస్సులో మమ్ములను స్వామిదరిజేర్చిన శ్రీ సత్యసాయి సేవాసంస్థలు, గుంటూరు జిల్లా ప్రెసిడెంట్ అయిన కోవెలమూడి నారాయణరావు గారికి, పర్తిక్షేత్రంలో మాకు తగిన సహకారాన్నందించిన ప్రొ॥ అనిల్ కుమార్ గారికి ఎంతని కృతజ్ఞతలర్పించను!

ఆ పిమ్మట మరోపర్యాయం డి.జి.పి. హెచ్.జె. దొరగారి నిర్వహణలో స్వామివారి సమక్షంలో గుమ్మడి గోపాలకృష్ణగారి శ్రీకృష్ణ పాత్రధారణతో జరిగిన 'పాండవోద్యోగం' లోనూ వారు నేనే సుయోధనపాత్రవహించే అవకాశాన్నీయటంతో, నాతోపాటు గుంటూరు నుండి పురాణం కాశీవిశ్వేశ్వరశర్మ, మారెళ్ల వెంకటరెడ్డి, బోడేపూడి కుటుంబరావు లాంటి కళాకారులను స్వామి సన్నిధికి తీసికొని వెళ్లగలగటం భగవానుని అనుగ్రహమే.

స్వామివారు నాటకానంతరం రంగస్థలిమీదికి వచ్చి గుమ్మడి వారికి సువర్ణ హస్తాభరణం, అలాగే కొందఱుకళాకారులకు వెండిపళ్లెరములు, మరునాడు అందఱకూ ఇంటర్వ్యూ ఇవ్వటం సామాన్య విషయం కాదు, స్వామి పరిపూర్ణానుగ్రహ ఫలితమే. ఇంటర్వ్యూలో స్వామి అందఱినీ 'బంగారూ!' అని చక్కగా పలకరించి మాట్లాడుతూ జి.యస్.యన్. శాస్త్రిగారికి, సోమయాజులు (సినీ కళాకారులు) గారికి, యనుముల సుబ్బారావుగారు (హార్మోనిస్టు), కనకాంబరంగారు, పురాణం కాశీవిశ్వేశ్వరశర్మగారు మొదలుగా కొందఱు కళాకారులకు సువర్ణాంగులీయకాలను, ద్రౌపది పాత్రధారిణి శ్రీమతి జమునారాయలుకు సువర్ణనవరత్నహారాన్ని బహూకరించటంతో, అందఱకూ పట్టుబట్టలను ఆత్మీయంగా అందించి ఆశీర్వదించటంతో మా జన్మలు ధన్యతమములైనవిగా భావించి పరవశించాము.

అటు ప్రభుత్వం వారు, ఆయా రాష్ట్రాలలో స్థిరపడిన తెలుగువారి సాంస్కృతిక సంస్థలు మమ్ములను ఆహ్వానించి, ప్రదర్శనలిప్పించి, ఎంతో ప్రేమాభిమానాలతో ఘనంగా సత్కరించి పంపటమూ జరుగుతుండేది.

అలా చెన్నై, బెంగుళూరు, జంషెడ్పూరు, ముంబై మున్నగు తావులకు వారి ఆహ్వానాలను పుస్కరించుకొని వెళ్లేవాళ్లం.

మన పల్లెటూళ్లకు కాలక్రమంలో ప్రయాణసౌకర్యాలు పెరిగాయేకాని, మేము నాటకాలాడుతున్న తొలినాళ్లలో కొన్ని మైళ్లదూరం నడచికూడా వెళ్లవలసి వచ్చేది.

“ఎందుకొచ్చిన కష్టంరాయిది!” అనిపించేది. నాటకానంతరం ప్రేక్షకులు ఎంతో అభిమానంతో చుట్టూచేరి “ఎంతబాగా చేశారండీ! అసలు దుర్యోధనుడే దిగివచ్చినట్లుంది!” అని పొగడుతుంటే, ఆ రెండుమాటలు ఎంత శక్తినిచ్చేవో! అంతే మళ్లీ సరంజామా వేసికొని బయలుదేరటమే!

ఇప్పుడో, వయసుపైబడుతోంది, శక్తి సన్నగిలుతోంది. ఇక నాటకాలు మానేస్తే మర్యాదగా ఉంటుంది, అనుకుంటా., అంతలో ఎవరో అభిమానులు రావటం, “ఈ ఒక్క నాటకమాడిపెట్టండి” అని బ్రతిమాలటం, తప్పించుకోలేక స్టేజి ఎక్కటం. మరో రెండురోజులలో అలాగే మరొకరు. ఇలా సాగుతోంది ప్రస్తుతం.

ఇటీవలి కాలంలో ‘భారతీ ధార్మిక విజ్ఞానపరిషత్ అధ్యక్షులు’ మాన్యశ్రీ బొల్లేపల్లి సత్యనారాయణగారి కోరిక మేరకు శ్రీవేంకటేశ్వరస్వామి వారి కోవెల (గుంటూరు బృందావన్ గార్డెన్స్) ప్రాంగణంలో అన్నమయ్య కళావేదికపై ‘పాండవోద్యోగ విజయాలు’ ప్రదర్శించి వారి మన్ననలందుకున్నాము.

శ్రీయుత మిరియాలప్రసాదరావుగారు అన్నదానసమాజఅధ్యక్షులు. వారి కుమారులు గోపీగారి అభ్యర్థనతో అన్నదానసమాజవేదికపై ‘మయసభ’ ‘పాండవోద్యోగ ప్రథమరంగము’ ప్రదర్శించి వారి అభిమానానికి పాత్రులమయాము. **అంతలో బ్రహ్మశ్రీ జి.యస్.యన్.శాస్త్రి గారు, మిత్రశ్రీ గుమ్మడి గోపాలకృష్ణగారి ప్రోత్సాహంతో ‘ప్రపంచ తెలుగు మహాసభలు’లో ‘కురుక్షేత్రం’లో, దుర్యోధనపాత్ర (మయసభ) ప్రదర్శించటము నాకు దక్కిన చక్కని అవకాశమే!**

**మరొక విశేషం : ఇప్పటికి నాలుగు పర్యాయాలు నందినాటక మహోత్సవాలలో ప్రాథమిక పరిశీలనా న్యాయనిర్ణేతగా వ్యవహరించే అవకాశం కూడా లభించింది.**

ఇంతటితో పాత్రధారణ అలాఉంచి. నాటక రచనకుపక్రమించాలని అనుకున్నాను. అనుకున్నానో లేదో,

'కర్ణుడు లేని భారతమా!'

అన్ననుడి నా మదిలో మెదిలింది.

'దుస్సాధప్రక్రమ బాహువీర్యుడు" అని అర్జునునిచేతనే ప్రశంసింపబడిన అంగరాజు అనన్యసామాన్య తేజస్వియై ఎట్టయెదుట సాక్షాత్కరించాడు. ఇంక వేరే గాధకు తావెక్కడిది!

**'మహావీర కర్ణ'**కు నాంది పలికాను.

ఇక ఆ పనిలో ఉంటా మరి!

"ఇంతటితో చాలు అని సర్దుకోవడం
పురోగామి లక్షణం కాదు.
చూపును భవిష్యత్ తీరాలవైపు
ప్రసరించడంలోనే
ప్రగతి శీలం ఉంది."

– డా. సి.నా.రె.



శ్రీ కామరాజు కృష్ణమూర్తి డి.ఎస్.పి. గారిచే తెలుగు దర్బార్, ఏలూరు. కార్యదర్శి కురెళ్ల లక్ష్మణరావుగారి నిర్వహణలో పుష్పకిరీట సత్కారం






కరుణ శ్రీ



స్ఫూర్తి శ్రీ



## పూజ్య గురుదేవులకు ప్రణుతాంజలి

"పద్యమందు భావపరిమళమ్ములు నింపు
కళను గరపినట్టి ఘనులు గురుల
తలచి, అందుకొనెద కలము మహావీరు
కర్ణగాథ నాటకము లిఖింప."

- తుర్లపాటి రాధాకృష్ణమూర్తి




# ధరించిన పాత్రలు

## ప్రాథమిక దశలో

పాండవోద్యోగము - ద్రౌపది

పాండవోద్యోగము - అశ్వత్థామ 15 సం॥ల వయస్సులో.

అదే వయస్సులో హైస్కూలులో దుర్యోధనుడు 1వ రంగము.

## 1962 నుండి నా నటజీవన ప్రస్థానం ప్రారంభం

| | | |
|---|---|---|
| పాండవోద్యోగము | - | ధర్మరాజు |
| పాండవోద్యోగము | - | కర్ణుడు |
| పాండవోద్యోగవిజయములు లేక కురుక్షేత్రం | - | **దుర్యోధనుడు** |
| గయోపాఖ్యానం | - | గయుడు |
| సత్యహరిశ్చంద్రీయం | - | విశ్వామిత్రుడు |
| వేంకటేశ్వర మాహాత్మ్యం | - | భృగు మహర్షి |
| బొబ్బిలి యుద్ధం | - | విజయరామరాజు |
| పల్నాటి యుద్ధం | - | నరసింగరాజు |
| కన్యకాపరమేశ్వరి | - | విష్ణువర్ధనుడు |
| మహాకవి కాళిదాసు | - | భోజరాజు |
| వరూధిని (సంస్కృత నాటకం) | - | సిద్ధుడు |
| సీతారామ కల్యాణం | - | రావణుడు |
| నరకాసుర | - | నరకాసురుడు |
| కాలవాహిని (శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి చరిత్ర నాటకం) | - | పాదుషా |
| సమ్రాట్ జయచంద్ర | - | ప్రహరాజ శర్మ |
| క్రీస్తు జననం (రచన, దర్శకత్వం డా॥ బి.ఏ. లింకన్) | - | హేరోద్ ప్రభువు |
| దావీదు విజయం | - | గొలియాత్ |
| పజరం | - | డాక్టర్ |

## నాకు సహనటత్వ అవకాశం లభించిన

## నాటి అగ్రశ్రేణి నటులైన పెద్దలు మరియు సమవయస్కులైన నటమిత్రులు

"ఈలపాట" కె. రఘురామయ్య, పీసపాటి నరసింహమూర్తి
షణ్ముఖి ఆంజనేయ రాజు, ఎ.వి. సుబ్బరావు,
ధూళిపాళ, ఆచంట వెంకటరత్నం నాయుడు, వేమూరి రామయ్య,
మల్లాది సూర్యనారాయణ, బుఱ్ఱా సుబ్రహ్మణ్య శాస్త్రి,
జి.యస్.యన్. శాస్త్రి, కె.యస్.టి. శాయి, యం.వి.యల్. నరసింహారావు,
బండారు రామారావు, రేబాల రమణ,
డి.వి. సుబ్బారావు, శ్రీమతి గూడూరు సావిత్రి, వై. గోపాలరావు,
జి. చెంచు రామారావు, ఉప్పలపాడు సైదులు, నూతక్కి సుబ్బారావు,
కె.వి. రాఘవరావు, వెల్దుర్తి వెంకటనర్సునాయుడు (రాయలసీమ),
బి. శ్రీనివాసమూర్తి, సిరిగిరి బొల్లయ్యనాయుడు, ఉప్పాల వేంకటరత్తయ్య చౌదరి
గుంటుపల్లి ఆంజనేయ చౌదరి, ఇళ్ల వెంకట్రావు, డా॥ యల్. శ్రీకృష్ణ,
కురిటి సత్యంనాయుడు, కె. వెంకట్రావు గుప్తా, పి.యల్. నరసింహారావు,
జి. నరసింహమూర్తి నాయుడు, పుట్టంరాజు శంకరరావు, ఆశీర్వాదం,
టి. శేషారావు, యం.ఆర్. ఆంజనేయులు, సిరిగిరి అర్జునరావు,
జల్ది సాంబశివరావు, నూతలపాటి వెంకటేశ్వర్లు, రాజారత్నం,
కె. నాగేశ్వరరావు, జి. జైరాజ్, ఆకుల ఆంజనేయులు.
మొదలగు నాటితరం నటవర్గం నుండి నేటి నటులందఱితోను నటించాను.

# పద్య నాటక పరిషత్ పోటీలలో

1962 ఏటుకూరు (గుంటూరు మండలం) పరిషత్ పోటీలు.

శ్రీకృష్ణ పాత్ర (కర్ణ సందేశం) – ప్రథమ బహుమతి.

గుంటూరు జిల్లా పరిషత్ ఛైర్మన్ మేదూరి నాగేశ్వరరావు గారిచే బహుమతి ప్రదానం.

1963 దుర్యోధన – ప్రథమ బహుమతి

(పాండవోద్యోగం ప్రథమ రంగం)

ఏటుకూరు పరిషత్ పోటీలు

మేదూరి నాగేశ్వరావు గారిచే బహుమతి ప్రదానం

1992 **పాండవోద్యోగము – ఉత్తమ ప్రదర్శన.**

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారు నిర్వహించిన

రాష్ట్రస్థాయి పద్యనాటక పోటీలలో – **దుర్యోధనుడు** (పాత్ర నిర్వహణ)

**దర్శకత్వం.**

రవీంద్రభారతి, హైదరాబాదులో ఫైనల్స్ అండ్ బహుమతి ప్రదానం

## పొందిన నట శిక్షణ వివరములు

1993 తెలుగు విశ్వవిద్యాలయం మరియు ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖ సంయుక్త నిర్వహణలో.

నట శిక్షణా శిబిరములో శిక్షణ (మే 10 నుండి జులై 11 వరకు)

1995 సెంటర్ ఫర్ కల్చరల్ రిసోర్సెస్ అండ్ ట్రైనింగ్ – న్యూఢిల్లీ వారు విజయవాడయందు నిర్వహించిన నట శిక్షణా శిబిరంలో శిక్షణ (సెప్టెంబర్ 11 నుండి 26 వరకు)

# ప్రభుత్వము వారి నంది నాటకములలో న్యాయ నిర్ణేతగా

1999 నంది నాటక సప్తాహంలో జోనల్ స్థాయి న్యాయ నిర్ణేతగా.

2001 నంది నాటకోత్సవం ప్రాథమిక పరిశీలనా న్యాయ నిర్ణేతగా.

2003 నంది నాటకోత్సవం ప్రాథమిక పరిశీలనా న్యాయ నిర్ణేతగా.

2004 నంది నాటకోత్సవం ప్రాథమిక పరిశీలనా న్యాయ నిర్ణేతగా వ్యవహరించటం జరిగింది.

2011 నంది నాటకోత్సవం ఆడిటోరియం కమిటీ నిర్వాహకునిగా నియామకం (శ్రీ వేంకటేశ్వర విజ్ఞానమందిరం, గుంటూరు)

ప్రభుత్వం వారు నిర్వహించిన నాటక ప్రదర్శనములలో పలుమారులు హైదరాబాదులోను, అలాగే

2002 అమరావతి మహోత్సవములలో కురుక్షేత్ర ప్రదర్శనమునందు **'దుర్యోధన'** పాత్ర, 'పల్నాటియుద్ధము' నందు **నరసింగరాజు పాత్ర ధారణ**.

2002 కృష్ణా మహోత్సవాల్లో **'పలనాటి యుద్ధం'లో నరసింగరాజు** పాత్ర, **బాంబేలో** ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖ నిర్వహణలో **దుర్యోధన పాత్ర** ధారణ.

**'ప్రపంచ తెలుగు మహాసభలు'** తిరుపతిలో "కురుక్షేత్రం"లో దుర్యోధన పాత్ర నిర్వహణ. ఇలా ఎన్నో ప్రభుత్వ నాటక ప్రదర్శనలు. కాగా,

ఆయా సంస్థలవారి విభిన్న నాటకములలో భిన్నపాత్రలలో ముమ్మరంగా నాటకములు, **వేల ప్రదర్శనములు** మమ్ము వరించినవి.

# సత్కారములు

**సమతా నాటక గురుకులం, గుంటూరు– సువర్ణ ఘంటా కంకణ ప్రదానం.** డాక్టర్ శ్రీ ప్రసాదరాయ కులపతి (కుర్తాళం పీఠాధిపతి) గారిచే

**కళాకారుల సంఘం, గుంటూరు – సువర్ణ ఘంటా కంకణ ప్రదానం.** (అధ్యక్షులు నల్లక శ్రీనివాసరావు గారిచే.)

**శ్రీ సత్యసాయి స్వామివారిచే ప్రశాంతి నిలయం, పుట్టపర్తిలో** – దుర్యోధన పాత్ర ధారణకు – **సువర్ణ రత్నాంగుళీయకం.**

**దేవీచౌక్, రాజమండ్రి వారిచే – దేవీచిత్ర సువర్ణాంగుళీయక ప్రదానం.**

**ఆంధ్ర క్రైస్తవ కళాశాల ప్రిన్సిపాల్** – బి. చంద్రపాల్ గారిచే (కాలేజి ఎంబ్లమ్‌తో) **సువర్ణాంగుళీయక ప్రదానం.**

**తెలుగు దర్బార్, ఏలూరివారిచే** – పుష్పకిరీట సత్కారం (కురెళ్ల లక్ష్మణరావు నిర్వహణలో)

**సత్యసాయి స్వామివారిచే** – సువర్ణ స్థూపచిత్రమయ రజితపాత్ర, అమూల్య ధౌత వస్త్ర ప్రదానం.

**మెమెంటో సహిత అభినందన పూర్వక బహూకృతులు :**

**'నట సమ్రాట్' అక్కినేని జన్మదిన మహోత్సవంలో** – అక్కినేని వారిచే

**సమతా సూరిగారి నిర్వహణలో** – హైదరాబాద్ రవీంద్ర భారతిలో అక్కినేని నాగేశ్వరరావు గారిచే

**సమతా సూరిగారి నిర్వహణలో** – 'పద్మభూషణ' డా. సి. నారాయణరెడ్డి గారిచే, గుంటూరు, వేంకటేశ్వర విజ్ఞాన మందిరంలో

**సమతా సూరిగారి నిర్వహణలో** – మద్రాస్, వాణీ మహల్‌లో 'కళావాచస్పతి' జగ్గయ్య గారు, శ్రీమతి అంజలీదేవి గారిచే

**అజాద్ కల్చరల్ అసోసియేషన్** – చిలకలూరిపేట సాల్‌బుడే గారి నిర్వహణలో కరుణశ్రీ, గుమ్మడి వెంకటేశ్వరరావు గార్లచే

**అఖిలాంధ్ర పౌరాణిక నాటక సభలు, విజయవాడ** – మిక్కిలినేని వారిచే,

**'వాస్తురత్న' గౌరు తిరుపతిరెడ్డి గారి నిర్వహణ, కడపలో** – 'దర్శకరత్న' దాసరి వారిచే

**యువకళావాహిని, హైదరాబాదు** – వై.కె. నాగేశ్వరరావు గారి నిర్వహణలో అల్లు రామలింగయ్య గారిచే

**కాకతీయ కళాపరిషత్, నాగభైరువారి పాలెం** – నాగభైరు సుబ్బారావుగారిచే. నిర్వహణ: కందిమళ్ల సాంబశివరావుగారు

**అఖిలాంధ్ర రంగస్థలనటమహాసభ, నెల్లూరులో** – ధూళిపాళ వారిచే

**ఆంధ్రప్రదేశ్, సాంస్కృతిక శాఖ నిర్వహణ, ముంబైలో** – దీక్షిత్ డి.యస్. గారి నిర్వహణలో జె.వి. సోమయాజులు గారిచే

**అలాగే నేను తొట్టతొలుత ద్రౌపది పాత్ర ధరించిన చిననందిపాడు గ్రామంలో** నా శిష్యులు అడ్డగడ సీతారామయ్య, జ్ఞానేశ్వరరావులచే దుర్యోధన పాత్ర వేయించి నేను ధర్మరాజు వేసినందులకు కృతజ్ఞతతో వారు చేసిన సత్కారం, అద్దంకి యన్.టి.ఆర్. పరిషత్ అధ్యక్షులు యం. త్రిమూర్తులు గారు అద్దంకిలో చేసిన సన్మానం, మా స్వగ్రామములో (కలవకూరు) చంద్రశ్రీ కాన్వెంట్ డైరెక్టర్ బి. శ్రీనివాసుగారు మా సోదరుడు శేషగిరిరావు ద్వారా నన్ను పరిచయం చేసికొని చేసిన సత్కారం, రెండు నెలలు ఇటీవల శిక్షణపొందిన మా కార్తికేయుని తల్లిదండ్రులు మా సోదరుడు యన్. ముక్తేశ్వరరావు హేమా దంపతులు ఆప్యాయతా పూర్వకంగా అన్నమయ్య కళాప్రాంగణం గుంటూరులో చేసిన సత్కారం చిరస్మరణీయాలు.

# బిరుదములు

**'నట శేఖర'** – సమతాసూరి గారిచే, గుంటూరు

**'నట సార్వభౌమ'** – 'నటచూడామణి' బండారు రామారావు గారిచే (అద్దంకి)

**'నటనా విహారి'** – యన్. ముక్తేశ్వరరావు ఐ.ఏ.ఎస్ గారిచే, (పొన్నూరులో)

**'బళ్లారి రాఘవ అవార్డు'** – యువకళా వాహిని, హైదరాబాదు, వై.కె. నాగేశ్వరరావు గారి ఆధ్వర్యంలో అల్లురామలింగయ్య గారిచే

**'అభినయ వాచస్పతి'**, అభినయ విద్యాసాగర' – తెలుగు దర్బార్, ఏలూరు వారిచే

**'నట కంఠీరవ'** – బళ్లారి రాఘవ థియేటర్, గుంటూరులో మారెళ్ల వెంకట రెడ్డి (శివారెడ్డి పాలెం, సర్పంచ్), పురాణం విశ్వేశ్వర శర్మ మున్నగు అభిమాన సంఘ సభ్యులచే

**'నట శిరోరత్న'** – సాహితీ వేత్తలు, 'స్ఫూర్తిశ్రీ' టి. భాస్కరరావు గారిచే

**'నటనాధ్వపతి'** – సర్వేశ్వర నాట్యమండలి, హైదరాబాదు వారిచే రాజబాబుగారి నిర్వహణలో

**'నట చక్రవర్తి'** – అన్నదాన సమాజ పాలకమండలి, (గుంటూరు) ఛైర్మన్ శ్రీ మిరియాల ప్రసాదరావు గారిచే

## నటశిక్షణలో అధ్యాపకత్వం

**పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో** – పద్యనాటక విభాగంలో శ్రీ జి.యస్.యన్. శాస్త్రి గారితో సహాధ్యాపకత్వం ఒక సంవత్సరం.

**ప్రస్తుతం అన్నదాన సమాజం కళాప్రాంగణంలో** – ఛైర్మన్ శ్రీ మిరియాల ప్రసాదరావుగారి నిర్వహణలో మిత్రులు శ్రీ సిరిగిరి సాంబశివరావు గారి సంగీత శిక్షణలో నిర్వహింపబడుతూ ఉండిన నటశిక్షణాలయంలో

దర్శకత్వ బాధ్యత వహించి సమర్థులైన కళాకారులను రంగస్థలి కందించాలనే సత్సంకల్పంతో శిక్షణనీయటం బాధ్యతగా స్వీకరించి దర్శకత్వ ధర్మాన్ని ఈ 76 ఏండ్ల వయస్సులో నిర్వహించగలుగుతున్నందు లకు ఆనందిస్తున్నాను.

## పద్యనాటక కళాకారులసంఘం - కార్యక్రమాలు

నటమిత్రులు శ్రీనల్లక శ్రీనివాసరావుగారి ప్రేరణతో - దాసాంజనేయ నాట్యమండలి అధ్యక్షులు నూకల ఆంజనేయులు గారు, సుప్రసిద్ధ నట సోదరులు ఉప్పలపాడు సైదులుగారు, నేను మరియు పద్యనాటక కళాకారులమందరమూ కలిసి పౌరాణిక కళాకారుల సాంస్కృతిక సంక్షేమ సంఘాన్ని ఏర్పాటు చేశాము. ప్రేరణ కారకులైన నటమిత్రులు శ్రీనివాసరావుగారిని అధ్యక్షులుగా ఎంపిక చేసికొని ఉప్పలపాడు సైదులుగారు, నూకల ఆంజనేయులుగారు ఉపాధ్యక్షులుగా, నేను కార్యదర్శి స్థానంలో ఉండి నాటక మహోత్సవములు నెరపుతూ రెండు దశాబ్దాలుగా యువతరంలో నటనోత్సాహాన్ని కలిగిస్తున్నాము.

విశేషించి ప్రభుత్వం ద్వారా మా అధ్యక్షుల కర్తవ్య దీక్షతో **40 మంది కళాకారులసంఘ సభ్యులకు నివేశస్థలాలు కేటాయింపజేయగలగడం** హర్షదాయకంగా భావిస్తున్నాం. కళాకారుల సంక్షేమం కోసం సంఘీభావంతో సర్వదా కృషిచేయవలెనని కంకణధారులమయాం.



**యువకళావాహిని ఆధ్వర్యంలో అల్లురామలింగయ్య గారిచే సత్కారం త్యాగరాజ గానసభ హైదరాబాదు**

# గురువర్యులకు ప్రణామములు

అయిదుపదుల రంగస్థలనటజీవనయానంలో ఏదో తెలుసుకుంటూనే ఉన్నాం. ఇంకా ఎంతో తెలుసుకోవలసింది ఉందని తెలుసుకుంటూనే ఉన్నాం. పయనం చేస్తూ ఉంటేగాని గమ్యానికి దగ్గరకాము గదా మరి! అందుకే అడుగుముందుకు వేస్తూనే ఉన్నాం. అడిగి తెలుసుకుంటూనే ముందడుగు వేస్తున్నాం.

ఈ పయనంలో ఎందఱిని ఎన్ని అడిగామో! ఏమేమి అడిగామో! ఎందఱి సలహాలు తీసుకున్నామో! ఎందఱి సలహాలు పాటిస్తేగాని యింతదూరం రాలేకపోయామో! ఎందఱు మహనీయులు మనకుముందు బాటచూపి, శుభాశీస్సులందించి కనుమరుగయిపోయారో!

వారందఱూ మనకు ఆదర్శమార్గదర్శకులయిన అధ్యాపకులే, ప్రాతః స్మరణీయులే.

అలా నన్ను ముందుకు నడిపిన గురువర్యులను గుర్తుచేసుకోకపోతే, కృతఘ్నుణ్ణౌతాను.

నాకు మొట్టమొదటి గురువు మా నాన్నగారే. మొట్టమొదట శ్రుతిలో పద్యం అనిపించింది వారే.

నాచేత చిననందిపాడులో ద్రౌపది, అశ్వత్థామ వేషాలు వేయించింది సుబ్బారావు పంతులుగారు, అడుసుమల్లి.

చీరాలలో ఇంటర్ చదివేటప్పుడు గాని, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో బి.ఏ. ఆనర్స్; చదివినప్పుడు గాని నాటకాల జోలికి పోలేదు.

1962లో ఉద్యోగ రీత్యా గుంటూరు చేరాను. ఇక్కడ, ధర్మరాజు, కర్ణుడు, దుర్యోధనుడు, భోజరాజు పద్యాలకు భావయుక్తంగా సంగీతాన్ని జోడించి, అనిపించినవారు "సంగీత విద్వాన్" వై. రామచంద్రరావు మాస్టరుగారు.

అటుపైన క్రమక్రమ అనుభవక్రమంలో అవగాహన పెంచుకొని, తదుపరి నేను వహించిన పాత్రల పద్యాలను పాత్రకు, నా గాత్రానికి అనువైన రీతిలో మలుచుకున్న వాణ్ణి నేనే.

ఆ తరువాత యం. హుళక్కి భాస్కరరావుగారు, సమతా రామానుజ సూరిగారు, కాళహస్తీశ్వరరావుగారు, కామేశ్వరరావుగారు అనేక నాటకాలకు సంగీతసారథులై సహకరించారు. వారందరికి నా నమస్సుమనస్సులు.

నటనాపరంగా, వాచికపరంగా శిక్షణనిచ్చిన పూజ్యగురువర్యులు శ్రీ సవరం వీరాస్వామి నాయుడుగారు, గోనుగుంట రామయ్య గారు, వల్లూరు వెంకట్రామయ్య చౌదరిగారు, బయ్యవరపు వెంకటేశ్వరరావు గారు కాగా, నేను పాత్రలు వహించిన నాటకాలకు దర్శకత్వం నెరపినవారు జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (తెనాలి), మంచికంటి కోటేశ్వరరావుగారు (గుంటూరు), జి.యస్.యన్. శాస్త్రి గారు, బుఱ్ఱా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, దీక్షిత్ డి.యస్. గారు హైదరాబాదు నటశిక్షణా శిబిరంలో. ఇలా ఒక నటుడిగా ఎదగడానికి కారకులయిన మహనీయులెల్లరకు

**మనః పూర్వక కృతజ్ఞతాంజలులు**

**నమః పూర్వక వినమ్రతాంజలులు**





భగవాన్ శ్రీసత్యసాయి
స్వామివారిచే సువర్ణ
రత్నాంగుళీయక ప్రదానం.
ప్రశాంతి నిలయం

పాత్ర : దుర్యోధనుడు



డా॥ ప్రసాదరాయ కులపతి (ప్రస్తుత కుర్తాళం పీఠాధిపతి) గారిచే సువర్ణ
ఘంటాకంకణ సత్కారం అందుకుంటున్న తుర్లపాటి
నిర్వహణ : సమతా వి. రామానుజ సూరిగారు



సువర్ణ ఘంటాకంకణ
సత్కారం చేస్తున్న నల్లక
శ్రీనివాసరావుగారు, అధ్యక్షులు,
పౌరాణిక కళాకారుల సంఘం,
గుంటూరు



మాడా, మురళీమోహన్‌గార్ల ద్వారా సత్కారం.
రవీంద్రభారతిలో "నందిమహోత్సవ" సందర్భంగా



రవీంద్రభారతిలో 'నటసమ్రాట్' అక్కినేని వారిచే మెమెంటో బహూకృతి అందుకుంటున్న "తుర్లపాటి", నిర్వహణ : సమతాసూరిగారు, పాత్ర : నరసింగరాజు



'ధూళిపాళ' వారిచే సత్కారం అందుకుంటున్న "తుర్లపాటి", దుర్యోధన నిర్వహణ : విశ్వశాంతి ఆర్ట్స్ అకాడమి యం. బాలచంద్రరావుగారు



విజ్ఞానమందిరం, గుంటూరులో 'పద్మభూషణ్' డా॥ సి. నారాయణరెడ్డి గారిచే సత్కారం అందుకుంటున్న "తుర్లపాటి" భారతీ ధార్మిక విజ్ఞానపరిషత్ అధ్యక్షులు శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణగారి నిర్వహణలో, పాత్ర : నరసింగరాజు



అజాద్ కల్చరల్ అసోసియేషన్, చిలకలూరిపేట. సాల్‌బుడేగారిచే సత్కారం



వాణీమహల్, చెన్నైలో 'కళావాచస్పతి' జగ్గయ్యగారు, శ్రీమతి అంజలీదేవి గార్లచే సత్కారం. నిర్వహణ:సమతాసూరిగారు, పాత్ర నరసింగరాజు (పల్నాటియుద్ధం)



'హాస్యరత్న' అల్లురామలింగయ్య గారిచే సత్కారం, త్యాగరాజగానసభ, హైదరాబాద్, "బళ్లారి రాఘవ అవార్డు ప్రదానం"
నిర్వహణ : యువకళావాహిని వై.కె. నాగేశ్వరరావు గారు



కైకాల సత్యనారాయణగారు, గుమ్మడి వెంకటేశ్వరరావుగారి
అభినందనలందుకొంటున్న - "తుర్లపాటి", పాత్ర: దుర్యోధన



అన్నదాన సమాజ కళాప్రాంగణంలో శిష్యబృందంచే సత్కారం : కొణతం నాగేశ్వరరావు,
చలువాది ప్రసాదరావు, కె. నాగేశ్వరరావు, షేక్ లాల్, యస్. బాబ్జి,
సంగీత దర్శకులు శిరిగిరి సాంబశివరావు, యనుముల సుబ్బారావుగార్లు



మంత్రివర్యులు కన్నా లక్ష్మీనారాయణగారిచే సత్కారం
నిర్వహణ : మిరియాల గోపిగారు, అరుణాచలం మాణిక్యవేలు
అన్నదాన సమాజ ప్రాంగణంలో




ఉపాధ్యాయ దినోత్సవం సందర్భంగా ఆంధ్ర క్రైస్తవ కళాశాల, గుంటూరులో
సత్కారం ప్రిన్సిపల్ కె.యి.మనోరమా బాయి, వైస్-ప్రిన్సిపల్స్ కె.వి.
ప్రకాష్‌రావు, బి. ప్రకాష్, కె.యి. శశకిరణ్, కె. జీవనజ్యోతి


శాసనమండలి సభ్యులు కె.యస్. లక్ష్మణరావుగారు, రాయపాటి శ్రీనివాస్‌గారు
జాయింట్ కలెక్టర్ శరత్‌గారు, మున్సిపల్ కమీషనర్ కె. సుధాకర్‌గారు
Addl. కమీషనర్ శ్రీనివాసులుగారు, ZP, CEO జయప్రకాష్ నారాయణ్‌గారు
హిందూకళాశాల కమిటీ మెంబర్ జి.వై.యన్. బాబుగారు



ధూళిపాళ కళావాహిని వారి సత్కారం ధూళిపాళ శివరామకృష్ణగారిచే
నిర్వహణ యం. బాలచంద్రరావు గారు



"కళాబంధు" శ్రీ కళ్ళం హరనాథరెడ్డిగారు, కళాకారుల సంఘం
అధ్యక్షులు నల్లక శ్రీనివాసరావుగారు "తుర్లపాటి"ని సత్కరిస్తున్న చిత్రం,
వేంకటేశ్వర విజ్ఞాన మందిరం, గుంటూరు



సత్కార సంరంభం - అన్నదాన సమాజం, గుంటూరు మిరియాల
ప్రసాదరావుగారి ఆధ్వర్యంలో సత్కారం. సి.హెచ్. సాంబిరెడ్డి, వి.వి.బి.ఆచారి,
పెద్ది లింగారెడ్డి, కె. నాగేశ్వరరావు, మంచికంటి, కె. అబ్రహాం మొదలగువారు.



"నాటి" తుర్లపాటి అన్నపూర్ణ రాధాకృష్ణ దంపతులు




మిరియాల ప్రసాదరావుగారు అన్నదాన సమాజం ఛైర్మన్ గారిచే "నటచక్రవర్తి" బిరుద ప్రదాన సందర్భంలో సత్కారం "తుర్లపాటి రాధాకృష్ణమూర్తి, శ్రీమతి అన్నపూర్ణ దంపతులు"



చదలవాడ జయరాంబాబు Ex-MLA గారిచే సన్మానం, మిరియాల గోపి కుమార్‌గారు, మిరియాల ప్రసాదరావుగారు, పెద్దిరామిరెడ్డిగారు, ఇక్కుర్తి రాజారావుగారు, వి.వి.బి. ఆచారి ప్రభృతులు.



మిరియాల ప్రసాదరావుగారు మొ।। కె. నాగేశ్వరరావు, అట్ల రామకృష్ణారెడ్డి, పెద్దిరామిరెడ్డిగార్లచే సత్కారం



తుర్లపాటిని సువర్ణ అంగుళీయకంతో సత్కరిస్తున్న ఎ.సి. కాలేజి ప్రిన్సిపాల్ శ్రీ బి. చంద్రపాల్ గారు నిర్వహణ అధ్యక్షులు సి.వి.కె.వై. శర్మగారు మొదలుగా తెలుగుశాఖ అధ్యాపక బృందం



ధనకుధరం శ్రీనివాసాచార్యులు, మిరియాల ప్రసాదరావు, మందాడి తెల్లకొండయ్య, బిళ్లా సంగీతరావు



శ్రీ సత్యసాయి విద్యానికేతన్ సాంస్కృతిక కార్యక్రమాలలో "తుర్లపాటి", ప్రొఫెసర్ కె. అనిల్ కుమార్, విజయలక్ష్మి దంపతులు, డైరెక్టర్ శ్రీరామ్ కృష్ణకుమారి మోహనరావు దంపతులు



వార్షికోత్సవ సందర్భంగా ముఖ్యఅతిథి "తుర్లపాటి"




సత్యసాయి ఐడియల్ స్కూల్‌వారి సాంస్కృతిక కార్యక్రమములో
డైరెక్టర్ కొల్లా కిశోర్ ధనలక్ష్మి దంపతులచే సత్కారం, వేంకటేశ్వర
విజ్ఞానమందిరం, గుంటూరు.



శ్రీమతి అంజలీదేవి నిర్మించిన షిర్డిసాయి - పర్తిసాయి దివ్యకథ సీరియల్‌లో
షిర్డిబాబా విజయచందర్, మహల్సాపతి తుర్లపాటి



క్రీస్తు జననం (క్రిస్మస్ సందర్భంగా) రచయిత డా॥ బి.ఎ. లింకన్, హేరోదు పాత్రలో "తుర్లపాటి" ప్రిన్సిపాల్ ప్రభుదాస్‌గారు ప్రభృతులు, ఏ.సీ. కాలేజి, గుంటూరు



దుర్యోధన "తుర్లపాటి"



టెలీఫిలిమ్‌లో జడ్జిగా "తుర్లపాటి"



గురుదేవులు 'స్ఫూర్తిశ్రీ టి. భాస్కరావుగారిని సత్కరిస్తున్న "తుర్లపాటి" మరియు
వేదికపై సభాధ్యక్షులు కె. నారాయణరావుగారు





ప్రపంచ తెలుగు మహాసభలు
2012 డిశంబరు 27,28,29 తేదీలలో
తిరుపతి, ఆంధ్రప్రదేశ్, భారతదేశం

గుర్తింపు పత్రము

సాహిత్యం/నృత్యం/నాటకం/సంగీతం/జానపదం

పేరు: ______



ంఖ్య: ఎ000084

సంచాలకులు
సాంస్కృతిక శాఖ



దుర్యోధన "తుర్లపాటి"





"షిర్డిసాయి మాహాత్మ్యం"లో కాటికాపరి "తుర్లపాటి"



**1992** సం॥లో రాష్ట్రస్థాయి పద్యనాటక పోటీలలో ప్రథమ బహుమతి పొందిన నాటకం 'పాండవోద్యోగం' దర్శకత్వం, దుర్యోధన పాత్రధారణ వహించిన "తుర్లపాటి"



STATE LEVEL

THEATRE WORKSHOP ON VERSE-DRAMA

FOR PROFESSIONAL ARTISTES

60 DAYS

CONDUCTED BY

TELUGU UNIVERSITY

DEPARTMENT OF CULTURE, Govt. of Andhra Pradesh

Hyderabad

**CERTIFICATE**

*This is to certify that*

*Sri/Smt.* Jurlapati Radakrishna Murthy

*S/o. D/o* Koteswara Rao

*Belongs to* Guntur *District* Guntur

*Has successfully Completed Theatre Workshop Training on Verse - Drama From 10th May 11th July. 1993*

*Certificate No.* 13

*Hyderabad* *11th July '93*

DIRECTOR DEPT. OF CULTURE GOVT OF A P

CONVENOR THEATRE WORKSHOP HEAD DEPT. OF THEATRE ARTS TELUGU UNIVERSITY

DIRECTOR THEATRE WORKSHOP

REGISTRAR TELUGU UNIVERSITY

నటశిక్షణ :

తెలుగు విశ్వవిద్యాలయం, ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖ - హైదరాబాద్

రాష్ట్రస్థాయి పద్యనాటక శిబిరం 1993 మే 10 నుండి జులై 11 వరకు



## सांस्कृतिक स्रोत एवं प्रशिक्षण केन्द्र
## CENTRE FOR CULTURAL RESOURCES AND TRAINING

बहावलपुर हाऊस, भगवानदास रोड, नई दिल्ली • Bahawalpur House, Bhagwandas Road, New Delhi

---

प्रमाणित किया जाता है कि

---

ने 11 से 26 सितम्बर, 1995 तक विजयवाड़ा, आंध्रप्रदेश में "पारंपरिक रंगशाला में शिक्षण—विधियों का अध्ययन" विषय पर आयोजित कार्यशाला में भाग लिया है।

**this is to certify that**

*Turlapati Radhakrishna Murthy*

**has attended the workshop on "study of teaching methods in traditional theatre" organised at vijayawada, andhra pradesh from september 11 to 26, 1995.**

(प्रेमलता पुरी)
महानिदेशक

(Premlata Puri)
Director General

నటశిక్షణ :

సెంటర్ ఫర్ కల్చరల్ రిసోర్సెస్ & ట్రైనింగ్ - న్యూఢిల్లీ వారు విజయవాడ యందు 11–26 సెప్టెంబర్, 1995వరకు నిర్వహించిన శిక్షణా శిబిరంలో నటశిక్షణ

2002 కృష్ణా మహోత్సవాలు

ప్రశంసా పత్రము

కృష్ణాజిల్లా యంత్రాంగము 2002 ఫిబ్రవరి 7 నుండి 10 వరకు నిర్వహించిన

2002వ కృష్ణా మహోత్సవాల పర్యాటకోత్సవములో

పాల్గొన్న

బహుమతి పొందిన

శ్రీ తుర్లపాటి రాధాకృష్ణమూర్తి గారికి

బహూకరించిన ప్రశంసా పత్రము

బి. ఆర్. మీనా

చైర్మన్

కలెక్టర్ మరియు జిల్లా మేజిస్ట్రేట్

కృష్ణాజిల్లా

THE TOURISM FESTIVAL

అమరావతి మహోత్సవం

గుంటూరు 2002

ప్రశంసా పత్రము

గుంటూరు జిల్లా ఏప్రిల్ 12, 13, 14, 15 తేదీలలో

నిర్వహించిన కళా, సాంస్కృతిక, పర్యాటక ఉత్సవాలలో

దుర్యోధనుడు (కురుక్షేత్రం) అంశంలో పాల్గొన్న / బహుమతి పొందిన

తుర్లపాటి రాధాకృష్ణమూర్తి గారికి

బహూకరించిన ప్రశంసా పత్రము.

అమరావతి మహోత్సవం

గుంటూరు 2002

చైర్మన్

కలెక్టరు మరియు జిల్లా మేజిస్ట్రేటు

గుంటూరు

# అమరావతి మహోత్సవం
## గుంటూరు 2002

### ప్రశంసా పత్రము

గుంటూరు జిల్లా ఏప్రిల్ 12, 13, 14, 15 తేదీలలో
నిర్వహించిన కళా, సాంస్కృతిక, పర్యాటక ఉత్సవాలలో
నరసింగరాజు & దర్శకత్వం (పల్నాటియుద్ధం) అంశంలో పాల్గొన్న / బహుమతి పొందిన
తుర్లపాటి రాధాకృష్ణమూర్తి ........ గారికి
బహూకరించిన ప్రశంసా పత్రము.

హీరాలాల్ సమరియా
ఛైర్మన్
కలెక్టరు మరియు జిల్లా మేజిస్ట్రేటు
గుంటూరు

# అమరావతి మహోత్సవం
## గుంటూరు 2002

### ప్రశంసా పత్రము

గుంటూరు జిల్లా ఏప్రిల్ 12, 13, 14, 15 తేదీలలో
నిర్వహించిన కళా, సాంస్కృతిక, పర్యాటక ఉత్సవాలలో
గయుడు (గయోపాఖ్యానం) ....అంశంలో పాల్గొన్న / బహుమతి పొందిన
తుర్లపాటి రాధాకృష్ణమూర్తి ........ గారికి
బహూకరించిన ప్రశంసా పత్రము.

హీరాలాల్ సమరియా
ఛైర్మన్
కలెక్టరు మరియు జిల్లా మేజిస్ట్రేటు
గుంటూరు

1999

నంది నాటక సప్తాహం

22 మే 2000 - 28 మే 2000

శ్రీ తుర్లపాటి రాధాకృష్ణమూర్తి ([illegible])
జోనల్ స్థాయి న్యాయనిర్ణేతగా
నాటకోత్సవ విజయానికి సహకరించినందుకు

కళాభినందనలు

జీవితాన్ని ప్రతిబింబించేదే నాటకం
నాటకానికి ప్రతిస్పందించేదే జీవితం

28 మే 2000
లలిత కళాతోరణం, పబ్లిక్‌గార్డెన్స్, హైదరాబాద్

[illegible]
(నారా చంద్రబాబు నాయుడు)
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రి

**1999** నంది నాటక సప్తాహంలో జోనల్‌స్థాయి న్యాయనిర్ణేతగా "తుర్లపాటి"




**2001** నంది నాటకోత్సవం పద్యనాటక విభాగంలో ప్రాథమిక పరిశీలనా న్యాయనిర్ణేతగా "తుర్లపాటి"

నంది నాటకోత్సవం
2003

శ్రీ తుర్లపాటి రాధాకృష్ణమూర్తి గారికి.
పద్య నాటక విభాగం
ప్రాథమిక పరిశీలన న్యాయ నిర్ణేతలుగా మీకు

కళాభినందనలు
జీవితాన్ని ప్రతిబింబించేదే నాటకం
నాటకానికి ప్రతిస్పందించేదే జీవితం

19 జూన్ 2004 - 26 జూన్ 2004
రవీంద్రభారతి, హైదరాబాద్

డాక్టర్ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

**2003 నంది నాటకోత్సవం పద్యనాటక విభాగంలో ప్రాథమిక పరిశీలనా న్యాయనిర్ణేతగా "తుర్లపాటి"**

నంది నాటకోత్సవం
2004

శ్రీ తుర్లపాటి రాధాకృష్ణమూర్తి గారికి

"స్క్రూటినీలో పద్యనాటకములకు న్యాయనిర్ణేతగా"

నంది నాటకోత్సవ విజయానికి సహకరించిన మీకు

కళాభినందనలు

జీవితాన్ని ప్రతిబింబించేదే నాటకం
నాటకానికి ప్రతిస్పందించేదే జీవితం

16, జనవరి 2005 - 23 జనవరి 2005
తుమ్మలపల్లివారి క్షేత్రయ్య కళాక్షేత్రం-విజయవాడ

డాక్టర్ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

**2004** నంది నాటకోత్సవం పద్యనాటక విభాగంలో ప్రాథమిక పరిశీలనా న్యాయనిర్ణేతగా "తుర్లపాటి"

నంది నాటకోత్సవం
2011

శ్రీ తుర్లపాటి రాధాకృష్ణ మూర్తి

నంది నాటకోత్సవంలో పాల్గొన్నందుకు గాను
మీకు
కళాభినందనలు
జీవితాన్ని ప్రతిబింబించేదే నాటకం
నాటకానికి ప్రతిస్పందించేదే జీవితం

05-13 ఫిబ్రవరి, 2012
శ్రీ వెంకటేశ్వర విజ్ఞాన మందిరం,
గుంటూరు.

నల్లారి కిరణ్‌కుమార్ రెడ్డి
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

**2011 నంది నాటకోత్సవంలో ఆడిటోరియం కమిటీ సభ్యులుగా "తుర్లపాటి"**



శ్రీ తల్లపురెడ్డి శ్రీనివాసరెడ్డి శ్రీమతి లక్ష్మి చారిటబుల్ ట్రస్టువారిచే సన్మాన సంరంభం, ఉప్పలపాడు గ్రామంలో. సత్కార గ్రహీత 'తుర్లపాటి', మిరియాల ప్రసాదరావు గారు,మిరియాల గోపీ కుమార్ ప్రభృతుల సమక్షంలో



శ్రీకృష్ణ, అర్జున పాత్రలలో మాడభూషి ఘనశ్యామాచార్యులు గారు, "తుర్లపాటి" వారి సహనటులు

## అనుభవాల తోరణాలు - ఆత్మీయుల వితరణాలు

| | |
|---|---|
| తల్లపురెడ్డి శ్రీనివాసరెడ్డి శ్రీమతి లక్ష్మి చారిటబుల్ ట్రస్టువారు, ఉప్పలపాడు | రూ. 10,116-00 |
| 'కళాబంధు' కళ్లం హరనాథ రెడ్డి గారు | రూ. 10,116-00 |
| పొన్నూరు బాలకుటుంబరావుగారు, ప్రిన్సిపాల్ గవర్నమెంట్ జూనియర్ కాలేజి, అర్ధవీడు | రూ. 10,116-00 |
| ముప్పలనేని అంకినీడు ప్రసాద్‌గారు, సికిందరాబాద్ ఛైర్మన్ జి.వి.ఆర్. గార్డెన్స్, బోయనపల్లి | రూ. 10,116-00 |
| మిరియాల ప్రసాదరావుగారు, అన్నదాన సమాజం ఛైర్మన్, గుంటూరు | రూ. 2,116-00 |
| డా॥ తాళ్లూరి సాంబశివరావు గారు | రూ. 2,116-00 |
| మారంరెడ్డి వెంకట సుబ్బారెడ్డి (లాయరు) గారు | రూ. 2,116-00 |
| మాడభూషి ఘనశ్యామాచార్యులుగారు బి.యస్.సి.; బి.ఇ, యం.ఐ.ఐ.పి.ఇ., పి.జి.డిప్ (థియేటర్ ఆర్ట్స్) | రూ. 1,116-00 |
| బి. వేదయ్యగారు డి.సి. కమర్షియల్ టాక్స్ | రూ. 1,116-00 |
| డా॥ దేవరపల్లి ప్రభుదాస్‌గారు | రూ. 1,116-00 |
| డా॥ బి.ఏ. లింకన్ | రూ. 1,116-00 |
| బెజ్జం వేంకటసుబ్బారావుగారు | రూ. 1,116-00 |
| మంచుకొండ వెంకటేశ్వర్లు గారు | రూ. 1,116-00 |
| చలువాది ప్రసాదు బాబు గారు | రూ. 1,116-00 |
| కొల్లూరు శివప్రసాదురావు గారు (బాబు) | రూ. 1,116-00 |
| మలిశెట్టి లక్ష్మీనారాయణ గారు | రూ. 1,116-00 |
| కె. నాగేశ్వరరావు గారు | రూ. 1,116-00 |
| పల్నాటి సుబ్బారావు గారు | రూ. 1,116-00 |

గ్రంథావిష్కరణ నిర్వహణ : **భారతీ ధార్మిక విజ్ఞాన పరిషత్.**

వేదిక : **అన్నమయ్య కళావేదిక,** శ్రీవేంకటేశ్వర స్వామి ఆలయప్రాంగణం, బృందావన్ గార్డెన్స్, గుంటూరు.



సాయి కృష్ణుని అనుగ్రహానికి పాత్రులైన శ్రీకృష్ణ పాత్రధారి
గుమ్మడి గోపాలకృష్ణ, దుర్యోధన పాత్రధారి తుర్లపాటి రాధాకృష్ణ



స్వామి సన్నిధి
సుయోధనునకు అందిన పెన్నిధి



శ్రీ సత్యసాయి భగవానునితో తుర్లపాటి రాధాకృష్ణమూర్తి, వారి మిత్రులు మారెళ్ళ వెంకటరెడ్డి,
గురువులు 'సంగీత విద్వాన్' వై. రామచంద్రరావు, జ్యేష్ఠ కుమారుడు : చి॥ శ్రీనివాసరావు



## తుర్లపాటి రాధాకృష్ణమూర్తి M.A.,

స్వగ్రామం : కలవకూరు, అద్దంకి మండలం, ప్రకాశం జిల్లా.

తల్లిదండ్రులు : శ్రీమతి వెంకటసుబ్బమ్మ, కోటేశ్వరరావు గారలు.

పుట్టిన తేది : 1.7.1939

విద్యాబుద్ధులు గరపినవారు : శ్రీమతి కంఠంరాజు తులసెమ్మ వెంకటసుబ్బయ్యగారలు, (మేనత్త దంపతులు) చిననందిపాడు గ్రామం, ప్రకాశం జిల్లా.

ఉద్యోగం : విశ్రాంత ఆంధ్రోపన్యాసకులు, ఆంధ్రక్రైస్తవ కళాశాల, గుంటూరు.

ప్రవృత్తి : నటన, దర్శకత్వం, సాహిత్యాధ్యయనం.

రచనలు : సచ్చిదానందమయమూర్తి, రంగస్థలి-అనుభవాల తోరణాలు.

### రంగస్థలి - అనుభవాల తోరణాలకు "అభినందనలు"

"నాటకాభిమానులకే కాక సాహిత్యాభిమానులందరికీ పాఠ్యగ్రంథం ఇది"
- డా. సి. నారాయణ రెడ్డిగారు.

"తన అనుభవాలను అద్భుతంగా రంగస్థలానికి తోరణాలుకట్టిన ఆత్మీయ మిత్రుడు రాధాకృష్ణను మనసారా అభినందిస్తున్నాను" - ఆచార్య యస్. గంగప్పగారు.

"ఇంతవఱకు పద్యనాటకమును గూర్చి యిట్టి గ్రంథము వెలువడియుండలేదనుట సత్యము, స్పష్టము" - బుఱ్ఱాసుబ్రహ్మణ్య శాస్త్రిగారు.

"వర్ధమాన నటులకే కాదు, నాటకరంగాన్ని యేలుతున్న నటనామధేయులకు సైతం ఈ గ్రంథం కరదీపిక" - జి.యస్.యన్. శాస్త్రిగారు.

"ప్రవర్ధమాననటులకు ఈ గ్రంథం ఓ నటగీతామృతం, ఓ పెద్ద బాలశిక్ష"
- కె.ఎస్.టి. శాయిగారు.

"రాబోయేతరానికి, కాబోయే నటులకు ఈ గ్రంథం "శబ్దోచ్చారణ మార్గదర్శిని"
- గుమ్మడి గోపాలకృష్ణగారు.

"ఈ గ్రంథం భావితరాలకు ఎంతో ఉపయోగకరం" - డా॥ మీగడ రామలింగ స్వామిగారు.

"ఆణిముత్యం లాంటి పుస్తకం. అపూర్వంగా కళ్లకద్దుకొని చదువుకోవలసిన పుస్తకం"
- ఎన్. ముక్తేశ్వరరావుగారు, ఐ.ఏ.యస్.

DB Press, 0863-2350832